# జీవితస్వప్నం

[నవల]

రచన

ఆదవేని ఈశ్వర

*

ఉజ్వల ప్రచురణాలు
కర్నూలు.

# జీవిత స్వప్నం

సాయంకాలం ఆరు గంటలైంది.

ఆస్పత్రి వాతావరణం చాలా ప్రశాంతంగా వుంది. డాక్టర్ రఘురామ్ గబగబా పేషెంట్లు నందరినీ చూసి—చివరకు ఒక ప్రత్యేకమైన గది ముందుకు వచ్చాడు. అప్పుడే లోనుండి బయటకు వస్తున్న నర్సును చూసి అక్కడే ఆగిపోయాడు.

"ఎలాగున్నాడు?" అనడిగాడు.

"మెరుగువగానే వున్నాడు డాక్టర్! ఇప్పుడే పళ్ళరసం యిచ్చాను..." అంది నర్స్.

"చూడు కళ్యాణీ! ఈ పూర్ ఫెలో నా చిన్ననాటి మిత్రుడు. ఇంత చిన్న వయస్సులోనే హృద్రోగంతో బాధ పడుతున్నాడు. ఎంత గొప్ప శ్రీమంతుల బిడ్డ అయితేనేం, ఆరోగ్యాన్ని కోల్పోయ్యాక? ఈ పేషెంట్‌ను కాస్త జాగ్రత్తగా కనిపెట్టుకొని వుండు..."

"యస్ డాక్టర్! కాని, యీ పేషెంట్‌కు తన ఆరోగ్యాన్ని గూర్చిన చింత వున్నట్లు లేదు. ఎప్పుడూ ఏదో ఒక దానిపై తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఈయనకు వాళ్ళ వారెవ్వరూ లేదా?"

"ఎందుకు లేరు కళ్యాణీ! కావలసినంత మంది బంధువులున్నారు. అయితే, వాళ్ళ నందర్నీ యీ ఫ్లూర్ ఫెలో దూరం చేసుకున్నాడు..."

"పాపం!" అని నిట్టూర్చి అక్కడి నుండి వెళ్ళిపోయిందా నర్సు.

డాక్టర్ రఘురామ్ రెండడుగులు ముందుకు వేసి గదిలోకి తొంగి చూశాడు. బెడ్‌పై సుధాకర్ పడుకొని వున్నాడు. అటువైపు తలత్రిప్పి కిటికీలో గుండా బాహ్య ప్రపంచాన్ని చూస్తున్నాడు.

రఘురామ్ నెమ్మదిగా గది లోపలికి అడుగుపెట్టి బెడ్‌ను చేరుకున్నాడు. తదేకంగా బాహ్య జగతిని పరికిస్తున్న సుధాకర్ చెయ్యి పట్టుకున్నాడు. కాని, అతని నుండి ఏ విధమైన ప్రక్రియ జరగలేదు. దానితో రఘురామ్ మనస్సు మరింత ఆవేదనకు లోనైంది. తను చెయ్యి పట్టుకున్న సంగతి కూడా తెలుసుకోలేని స్థితిలో వున్నాడు. ఎందుకింత ఆవేదన వీడికి? వీడి ఆలోచనలన్నీ దేన్ని గురించి? ఆ కన్పించే సూర్యాస్తమయంలో వీడి మనోనేత్రానికి కన్పిస్తున్న దేమిటి? మానసికంగా వీడేదో గొప్ప బాధ ననుభవిస్తున్నట్టున్నాడు. లేకపోతే ఆ కళ్ళల్లో ఏమిటా నీలి తెరలు?

"సుధా!...సుధా!" రఘురామ్ తన ఆలోచనలకు ఒక విశిష్ట రూపాన్ని ఏర్పరచుకోలేక సతమతమై అతనిని పలకరించాడు.

సుధాకర్ నెమ్మదిగా తన దృష్టిని ప్రక్కకు మళ్ళించాడు. ఎదురుగ్గా నిల్చొని వున్న రఘురామ్ కేసి ఒక క్షణకాలం చూసి చిరునవ్వు నవ్వాడు. కాని, ఆ నవ్వులో జీవం లేదు.

"ఎలా వుంది?" అనడిగాడు రఘురామ్.

"బాగానే వుంది..." అన్నాడు సుధాకర్.

"ఈ వాతావరణం నీకు వచ్చిందా?"

"ఆఁ! దేన్ని ఆశించి నేనిక్కడికి వచ్చానో అది లభ్యమయ్యే సూచనలు కన్పిస్తున్నాయి..."

"నువ్వు దేన్ని ఆశించి యిక్కడికి వచ్చావో నాకు చెప్పకూడదా?"

"రఘూ!..." సుధాకర్ కంఠం వణికింది. "నాకు కావల్సింది ప్రశాంతమైన వాతావరణం. ముఖ్యంగా ఆత్మశాంతి..."

"నిన్ను తొలిసారిగా చూడగానే ఆ విషయం గ్రహించాను. ఇది ప్రశాంతమైన వాతావరణం అనటంలో ఎలాంటి సందేహం లేదు. చుట్టూ కొండలు-దూరంగా పారే నది-మంచి గాలి వీచే చెట్లు గల ఈ ప్రదేశం అన్నివిధాలా అనుకూలంగా వుంటుందనే కొన్నివేల రూపాయలతో ఇక్కడ

నర్సింగ్‌హోమ్ ఏర్పాటు చేశాను. ఈ ప్రశాంత వాతావరణం నీకు తప్పకుండా మనశ్శాంతి ప్రసాదించ గలదు."

కొన్ని క్షణాలు నిశ్శబ్దం ఆవరించింది. ఉభయులూ ఏమీ మాట్లాడుకోలేదు. ఆ నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ మెత్తని పాదరక్షల సవ్వడి దగ్గర పడింది. సుధాకర్ తలెత్తి గుమ్మం వైపు చూశాడు. నర్స్ వస్తోంది.

ఆమె దగ్గరగా వచ్చి—"గుడ్ యీవెనింగ్ డాక్టర్!" అంది.

అంతవరకు ఆలోచనల్లో మునిగివున్న డాక్టర్ రఘురామ్ నెమ్మదిగా తేరుకున్నాడు.

"గుడ్ యీవెనింగ్ నర్స్!...కళ్యాణి వెళ్ళిపోయిందా?" అనడిగాడు ఆమెను.

"యస్ డాక్టర్! ఎవరో కొత్త పేషంట్ వచ్చారని చెప్పింది. ఈయనేనా?"

"ఔను. జాగ్రత్తగా కనిపెట్టుకొని వుండు" అని రఘురామ్ సుధాకర్ వైపు దృష్టి మళ్ళించాడు.

సుధాకర్ యీ భౌతిక ప్రపంచంలో వున్నట్లు లేదు. అప్పుడప్పుడే చీకటి నావరిస్తున్న బయటి ప్రపంచాన్ని దీక్షగా చూస్తున్నాడు. అప్రయత్నంగా రఘురామ్ గాఢంగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"నేను వెళుతున్నాను సుధా! ఈ నర్స్ రాత్రంతా యిక్కడే వుంటుంది. నా అవసరం ఏమైనా కలిగితే వెంటనే

కబురు పెట్టు. వస్తాను మరి, గుడ్ యీవెనింగ్..." అని రఘురామ్ నెమ్మదిగా అక్కడినుండి కదిలిపోయాడు.

డాక్టర్ వెళ్ళిపోగానే నైట్‌డ్యూటీలో ప్రవేశించిన నర్సు గదిలో దీపం వెలిగించింది. కిటికీలకు తెరలను కట్టి-పై రెక్కలను తెరిచింది. ఆ గది ముందు విరియబూసిన చామంతి చెట్టువద్దకెళ్ళి కొన్ని పువ్వుల్ని పట్టుకొచ్చి గది మధ్య నున్న రౌండు టేబుల్ పైని ఫ్లవర్ జగ్‌లో అలంకరించింది.

సుధాకర్ ఆమె ఏం చేస్తున్నదీ లేనిదీ కూడా చూడకుండా బయటికే దృష్టి నిలిపాడు. గదిలో తను తప్ప మరే ప్రాణీ లేనట్లే అతను తలపోస్తున్నట్లుంది. అందుకే ఆ చూపులు శూన్యంగా బాహ్యాంధకారంలోకే చూస్తున్నాయి.

ఆ విధంగా గంట గడిచింది.

నర్సు నెమ్మదిగా అతని పడక వద్దకు సమీపించి—"మిస్టర్!" అని పిలిచింది.

ఆమె ఆ విధంగా రెండు సార్లు పిలిచే వరకూ అతను యిటు వైపు దృష్టి మళ్ళించలేదు.

"మిస్టర్! ఏడు గంటలు కావస్తోంది. భోజనం తెమ్మన్నావా?" అనడిగింది నర్సు.

అతనేమీ జవాబు చెప్పలేదు.

"చెప్పండి. భోజనం తెమ్మంటారా? లేక, పాలు తెచ్చేదా?" తిరిగి అడిగిందామె.

"ఏదీ అక్కర్లేదు..." అన్నాడతను, ఆమె చూపుల్లోకి దృష్టి నిలిపి.

"భలేవారు. ఏమీ తినకుండా ఉపవాసం వుంటారా! పోనీ, పళ్ళరసం యివ్వనా!"

"గంటక్రితమే ఆ నర్స్ యిచ్చి వెళ్ళింది. ఇప్పుడేమీ వద్దు..."

"పోనీ, యింకో గంట అయ్యాకనైనా భోజనం తెప్పించేదా!"

"అక్కర్లేదు. అవసరమైనప్పుడు నేనే మిమ్మల్ని అడుగుతాను..."

నర్స్ యింకేమీ మాట్లాడలేదు. ఆమెకు ఈ కొత్త పేషెంట్ మనస్తత్వమేమిటో అర్థం కాలేదు. చాలా ముభావంగా మాట్లాడుతున్నాడు. ఎప్పుడూ కిటికీలోంగుండా బయటికి చూస్తుంటాడేమిటి? అంతు చిక్కని ఆ కటిక చీకటిలో దేన్ని ఆశించి అలా తదేకంగా చూస్తున్నాడు?

నర్స్ చాలాసేపు అతన్ని గురించి ఆలోచించలేక పోయింది. అతని బెడ్ ప్రక్కగా స్టూల్ జరుపుకొని కూర్చుంది. అతనింకా మేల్కొనే వున్నాడు.

"మీరింకా నిద్రపోతారా!" అనడిగింది.

లేదన్నట్లుగా అతను తల ఊపాడు. అప్పుడే చీకటి లోకి చూడటం మానుకొని కళ్లు మూసుకున్నాడు – అందుకే ఆమె ఆ ప్రశ్న వేసింది.

"చాలా టయమైంది. నిద్రపోండి..."

అతనినుండి ఎలాంటి సమాధానం రాలేదు. ఓ మారు కళ్ళెత్తి ఆమె వైపు చూశాడు.

"మీరు దేన్ని గురించో తీవ్రంగా ఆలోచిస్తున్న ట్లున్నారు. ఆస్పత్రిలో చేరాక కూడా ఆలోచనలు తగవు..." అందామె సౌమ్యంగా.

"నేను తీవ్రంగా ఆలోచిస్తున్నానని మీ కెలా తెలుసు?" అనడిగాడతను.

"మీ చూపుల తీరే స్పష్టపరుస్తోంది. మీ ఆరోగ్యం బాగుపడాలంటే ముందు ప్రశాంతంగా వుండాలి. ఎలాంటి ఆలోచనలనూ దగ్గిరికి రానివ్వకూడదు."

"ఆ సంగతి నాకు తెలుసు. అందుకే యీ నర్సింగ్ హోమ్‌కు వచ్చాను. కాని, పరిసరం మారుస్తున్నా—నాలోని మనస్సును మార్చుకోలేక పోతున్నాను..."

"నిరుత్సాహ పడకండి. ప్రయత్నం మీదట ఎలాంటి క్లిష్టతరమైన పనులు కూడా సానుకూల మౌతాయి."

"ఏమిటో! మీ మాటలు ఆశాజనకంగానే వున్నా — నాకు జీవితంపై విశ్వాసం లేదు. నా ప్రయత్నాలు ప్రయత్నాలుగానే ప్రథమ దశలో మిగిలిపోయాయి. నా కార్యదీక్ష దక్షతపై నాకు ప్రబలమైన విశ్వాసం వున్నప్పటికీ - అదంతా నిజ జీవితంలో వమ్మై అయ్యింది..." అని నిట్టూర్చాడతను.

"మీరు ఉద్రేకపడుతున్నారు. ఆకలిగా లేదా?" అనడిగింది నర్సు, మాట మార్చే ఉద్దేశంతో.

"ఆకలిని గూర్చిన ఆరాటం నాలో లేదిప్పుడు. నాకు ఆత్మశాంతి కావాలి..."

"మీ ధోరణి నాకు వింత గొల్పుతున్నది. ముందు మీలోని మనస్సును మార్చుకోండి. ఆ తర్వాత దానియంత టదే ఆత్మశాంతి లభిస్తుంది."

"లాభం లేదు నర్స్! ఈ జీవితానికిక మనస్సును మార్చుకోలేను...ఆలోచించి చూడగా నన్ను నేనే వంచించు కునేందుకు ఆత్మశాంతి కావాలను కుంటున్నానేమో!..."

ఆ మీదట యిక నర్స్ మాట్లాడలేక పోయింది. అక్కడి నుండి లేచి అల్మైరాలోని ఫ్లాస్కు తెచ్చింది. ఒక గ్లాసులో పాలు పోసి అతనికి అందించింది. అతనేలాంటి అడ్డూ చెప్పకుండా గ్లాసు నందుకున్నాడు.

పాలు త్రాగటం ముగించి—"థ్యాంక్స్" అన్నాడు. అందుకామె పెదవులపై సహజమైన చిరునవ్వు క్షణకాలం వెలిసి మాయమైంది.

"ఇక మీరు పడుకోండి. నేను వెళతాను" అన్న దామె.

అప్రయత్నంగా అతని పెదవుల నుండి—"ఎక్కడికి!" అనే ప్రశ్న వెలువడింది.

"ఆ పడక కుర్చీలో నేను పడుకుంటాను. ఎక్కడికీ వెళ్ళను. తెల్లవారేదాకా నా డ్యూటీ యిక్కడే. ఈ లోగా నా అవసరం కల్గితే పిలవండి..." అంటూ ఆమె అతను ఖాళీ చేసిన కప్పు నందుకున్నది.

"పాపం! నా కోసం మిమ్మల్ని శ్రమ పెడుతున్నాను..." అన్నాడతను.

"నా డ్యూటీ నేను నిర్వర్తించటంలో శ్రమ ఏముంటుంది?" అంటూనే ఆమె అక్కడినుండి కదిలింది. తన కోసం ప్రత్యేకించిన పడక కుర్చీలో పడుకొని ఏదో పుస్తకం చదువుకోసాగింది.

ఆ తర్వాత సుధాకర్ చాలాసేపు మేల్కొనే వుండి పోయాడు. ఎప్పటిలాగే చీకట్లోకి దృష్టి నిల్పి అలా చూస్తూ చూస్తూ తెల్లవారుఝామున కళ్ళు మూశాడు.

నర్స్ ఒక వైపు దీక్షగా పుస్తకం చదువుతున్నప్పటికీ అప్పుడప్పుడు తన పేషంట్ వైపు చూస్తూనే వుంది. తరువాత అతను నిద్రాదేవి కౌగలిలో వాలిపోవటం కూడా గమనించింది. లేచి బెడ్ దాకా వెళ్ళి ముఖం వరకు రగ్గు కప్పింది. తిరిగి అక్కడినుండి కదిలి పడక కుర్చీ చేరుకుంది.

క్రమక్రమంగా ఆమెకు పుస్తకం చదవటంలో ఉత్సాహం తగ్గిపోయింది. అంతవరకు తనతో మాట్లాడిన అతని మాటలే మదిలో మెదలసాగాయి. ఎందుకంత నిగూఢంగా మాట్లాడుతున్నాడితను? ప్రతి మాటలోనూ నిరాశ ప్రస్ఫుటమౌతోంది. యువకుడైన యితని కళ్ళల్లో లవలేశమైనా జీవం లేకపోవడమెందుకు? ఎందుకింత నిరాశ ఆవరించింది యితన్ని - మొదలైన ప్రశ్నలతో ఆమె చాలా సేపు సమాధానాలకోసం తనలో తాను పోరాడింది. కాని, ఎంత ఆలోచించినా అతని తత్వమేమిటో-ఎందుకలా నిరాశా జీవి అయ్యాడో తెలిసి రాలేదు.

తెల్లవారింది...

ఆ ఏకాంత నిర్జన ప్రదేశంలో తిరిగి మామూలుగా జన సంచారం ప్రారంభమైంది. నర్స్ పడక కుర్చీలోనుండి లేచి కిటికీ రెక్కలు మూసింది. ఫ్లవర్ జగ్‌లోని చామంతి పూలను బయటికి పారవేసి-అప్పుడే విరియ కాసిన రోజా పుష్పాలను తెచ్చి అందులో అలంకరించింది.

రాత్రంతా మేల్కొనేవున్నా ఆమె ముఖంలో ఎలాంటి అలసట కన్పించటం లేదు. చేసే ప్రతి పనినీ నెమ్మదిగా, స్పష్టంగా చేస్తోంది. పేషెంట్ వద్దకెళ్లి అతని నాడి చూసింది. అతనిలో ఒక్క బలహీనం తప్ప యింకేమీ లేదనుకుంది. అక్కడినుండి కదిలి నెమ్మదిగా గది బయటికి చేరుకుంది.

అప్పుడే కళ్యాణి డ్యూటీలో ప్రవేశించింది కాబోలు, చకచకా ముందుకు వస్తోంది.

"హలో - గుడ్‌మార్నింగ్! క్రొత్త పేషెంట్ ఎలా గున్నాడు?" అనడిగిందామె.

"అతని తత్వమేమిటో నాకు బోధపడలేదు. రాత్రి భోజనం చెయ్యమని ఎంత బ్రతిమాలినా ప్రయోజనం లేక పోయింది. రాత్రంతా మేల్కొనే వున్నాడు. మూడు గంటల ప్రాంతాల్లో నిద్రపొయ్యాడు కాబోలు, యింకా మెళుకువ రాలేదు..." అంది నర్స్.

"పాపం! చాలా వింత మనిషి. ముందు యితను మానసికంగా ఆరోగ్యవంతుడైతే కాని, ప్రయోజనం లేదు..."

"ఈ సంగతే నేనూ అతనితో చెప్పాను."

"ఏమన్నా అన్నాడా?"

"తనకు జీవితంపై విశ్వాసం లేదన్నాడు..."

"అతని జీవితం వెనక ఏదో విషాద చరిత్ర దాగి వున్నట్లుంది. లేకపోతే ఎందుకంత నిరాశావాది అవుతాడు?..."

"నేనూ అదే అనుకుంటున్నాను. ప్రతి యొక వ్యక్తి జీవితంలోనూ ఎన్నో అపరిష్కార సమస్యలు ఎదురౌతూ వుంటాయి. కాని, అంతమాత్రం చేతనే నిస్సహాయులమని ఆత్మవంచన చేసుకోకూడదు..."

"నిజమే...అయినా, అతని మానసికాందోళనకు ఏది కారణమో మనకు తెలియదుగా! చాలా గంభీరమైన వ్యక్తి లాగున్నాడు. ఈ నర్సింగ్ హోమ్ కొచ్చే ప్రతి పేషంటూ ఒక గొప్ప జీవిత చరిత్రను వెంటబెట్టుకొని వస్తుంటాడు. సరే గాని, నువ్వు డాక్టర్‌ను మీట్ చేసి వెళ్లు. నేను అతను లేచాడేమో చూసి బ్రెక్‌ఫాస్ట్ యిస్తాను..." అని కళ్యాణి గబగబా గది లోపలికి ప్రవేశించింది. అప్పటికే సుధాకర్ నిద్రనుండి లేచి పడకపై కూర్చొని వున్నాడు. కళ్యాణి అతనిని సమీపించింది.

"ఇప్పుడే లేచారా?" అనడిగింది.

"ఔను."

"కాలకృత్యాలు తీర్చుకోండి. బ్రెక్‌ఫాస్టు తెస్తాను..."

"నాకేమీ అక్కర్లేదు. ఓ గ్లాసుడు పాలు మాత్రం తెప్పించండి..."

"అలాగే..."

"నైట్ డ్యూటీ చేసిన నర్స్ వెళ్ళిపోయిందా?"

"అవును."

"రఘు ఎప్పుడొస్తాడు?"

"ఈ పాటికి బయలుదేరి వుంటారు. ఇంక కొన్ని నిమిషాల్లో రావొచ్చు. ముందు మీరు కాలకృత్యాలు తీర్చుకోండి..."

సుధాకర్ పడక మీది నుండి లేచి బయటికి వెళ్ళాక ఆ గదిని ఆయా వచ్చి శుభ్రం చేసింది. అతను తిరిగి వచ్చే లోగా కళ్యాణి పాలు తెచ్చి బల్ల మీద పెట్టింది.

కొంతసేపటికి సుధాకర్ తిరిగి వచ్చి పాలు త్రాగాడు. మళ్లీ అతను పడక మీదికి వాలబోతుండగా కళ్యాణి అడ్డు చెప్పింది.

"వరండాలో కుర్చీ వేస్తాను. కాస్సేపు అక్కడ కూర్చోండి. ఎప్పుడూ పడుకొనివుంటే ఒంట్లో చురుకుతనం వుండదు..." అందామె.

అలా అంటూనే వరండాలో కుర్చీ వేసింది. అతనింకేం మాట్లాడకుండా బయటికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. అంతలోనే డాక్టర్ రఘురామ్ అక్కడికి సైకిల్ మీద వచ్చాడు. పరస్పరం విష్ చేసుకున్నాక డాక్టర్ మాట కలిపాడు.

"రాత్రి నువ్వు భోజనం చెయ్యలేదని నర్సు చెప్పింది. ఇదేమీ బాగా లేదు..."

సుధాకర్ ఏమీ మాట్లాడలేదు.

"నువ్వేదో ఆలోచనలతో సతమతమౌతున్నావ్. ఇక్కడ ఉన్నన్ని దినాలైనా వాటికి దూరం కావాలి. లేక పోతే నీ ఆరోగ్యం కుదుటబడదు..." అన్నాడు డాక్టర్ తిరిగి.

ఈ మారు కూడా అతనేమీ పలక లేదు.

"పది గంటలకు నీ బాడీ ఎగ్జామిన్ చేస్తాను. నాకు అవతల పనుంది. వెళ్ళిరానా?"

"అలాగే..."

డాక్టర్ రఘురామ్ సైకిల్ ఎక్కి ఆఫీస్ రూమ్ వైపు వెళ్లిపోయాడు. అతను వెళ్లిపోగానే సుధాకర్, గదిలోపల నున్న నర్సును పిలిచాడు.

"చూడండి. ఇక్కడ కూర్చొని వుంటే నా కేమీ తోచటం లేదు. వెంట తెచ్చుకున్న సిగరెట్లన్నీ అయి పోయాయి. మరోలా భావించకపోతే ఒక టిన్ను తెప్పిస్తారా?" అన్నాడు.

"ఇక్కడ సిగరెట్లు అమ్మే కుర్రాళ్ళెవరూ లేరండి. ఏది కావాలన్నా టవున్‌కు వెళ్ళాల్సి వుంటుంది. అయినా, మీ ఆరోగ్యం బాగా లేనప్పుడు సిగరెట్లు కాల్చరాదు..."

కళ్యాణి జవాబు విని నిట్టూర్పు విడిచాడతను. ఆమె యిహ అక్కడ నిల్చోకుండా గబగబా ఆఫీస్ రూమ్ వైపు

వెళ్లిపోయింది. కొన్ని నిముషాల్లో ఆమె తిరిగి వచ్చి అతనికో దినపత్రిక అందించింది.

"మీ కేమీ తోచకపోతే యీ పత్రిక చదువుకుంటూ వుండండి. ఈలోగా డాక్టర్ వచ్చి మిమ్మల్ని పరీక్షిస్తారు..." అందామె.

రెండు గంటలపాటు అతను ఏకాంతంగా గడిపాక డాక్టర్ రఘురామ్ అక్కడికి వచ్చాడు. అతన్ని గది లోపలికి తీసుకెళ్లి దేహ పరీక్ష చేశాడు. పరీక్షానంతరం అతను సంతృప్తిగా తల ఊపి, అక్కడున్న ఓ కుర్చీలో కూర్చు న్నాడు.

"నీ కేసు నా కేమీ ఒంట బట్టటం లేదు. అన్ని అవయవాలు సక్రమంగానే పని చేస్తున్నాయి. ఇంతకీ నీకు గుండెజబ్బని ఎవరు చెప్పారు?" అనడిగాడు డాక్టర్.

"ఒకరు చెప్పే దేమిటి? నా బాధ నాకు తెలియదా ?"

"సరే. ఎన్నాళ్ళనుండి నీ గుండెల్లో పోటు ప్రారంభ మైంది?"

"ఎప్పుడు ఆరంభ మైందో నా కంతగా జ్ఞాపకం లేదు."

డాక్టర్ రఘురామ్ రెండు క్షణాలు దీర్ఘంగా ఆలో చించిన మీదట– "అయితే, మధ్యాహ్నం ఎక్స్‌రే తీసి చూస్తాను" అన్నాడు.

అంతలో కళ్యాణి కలగ చేసుకొని– "డాక్టర్! ఈయన ఉదయం ఒక్క గ్లాసుడు పాలుతప్ప ఏమీ పుచ్చుకో లేదు" అంది.

ఆమె తనపై రిపోర్టు చెయ్యటం విని సుధాకర్ శుష్క-హాసం చేశాడు,

"నువ్విలా మొండిపట్టు పట్టితే ఏమీ లాభంలేదు. నీకేం కావాలన్నా క్షణాలమీద పంపిస్తాను. శశి నిన్ను చూడాలనుకుంటోంది. బేబీని చూశావా?"

"లేదు. ఎన్ని సంవత్సరాలు."

"మొన్ననే అయిదో ఏడు పడింది. అంతా వాళ్ళ అమ్మ పోలికలే. శశికి నువ్వు వచ్చావని చెప్పగానే యింటి కెందుకు తీసుకరాలేదని నన్ను వేధించింది."

"వదినగారికి నాపై అభిమానం మెండు. బేబీ పేరు ఏమిటి?"

"రాధ..."

'రాధ' అనే మాట అతని చెవిలో బడేసరికి ఒక్క-సారిగా ముఖకవళికలు మార్పు చెందాయి. తిరిగి అతని నయన ద్వయంలో నీలి మబ్బులు అల్లుకున్నాయి. అలాంటి స్థితిలో తన నెవ్వరూ గమనించకుండా వుండేందుకు ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు.

అయితే, అతని ప్రయత్నం కళ్యాణి విషయంలో నిష్ప్రయోజనమైంది. 'రాధ' పేరు వినగానే అతని ముఖంలో వచ్చిన మార్పును స్పష్టంగా ఆమె చూడగల్గింది. కాని, అతని లోని మార్పుకు కారణ మేమిటో ఆమె ఊహ కందలేదు.

రఘురామ్ దృష్టి ఆ విషయాన్ని ఆకర్షించుకోలేదు. అందుకే అతను మామూలు ధోరణిలో మాట్లాడసాగాడు.

"చూశావా సుధా! బేబీ వాళ్ళ అమ్మలాగే డిగ్రీ చదువులు చదువుతానని అప్పుడే అంటోంది. చాలా అల్లరి పిల్ల, నువ్వు ఒక్కమాట మాట్లాడించావంటే వెయ్యి మాటలు చెబుతుంది... సరేగాని, మధ్యాహ్నం రెడీగా వుండు. ఎక్స్‌రే తీస్తాను..." అంటూ అతను కుర్చీలోనుండి లేచాడు. అక్కడినుండి కదిలి నెమ్మదిగా గది బయటకు చేరు కున్నాడు. కళ్యాణి అతన్ని అనుసరించింది. ఇద్దరూ ఆఫీస్‌రూమ్ వైపు నడవసాగారు.

"డాక్టర్!..." అంది కళ్యాణి.

రఘురామ్ ఆమెవైపు తిరిగి చూశాడు.

"డాక్టర్! ఈ పేషెంట్ సిగరెట్లు కావాలన్నాడు. తెప్పించేదా?"

"ఇప్పుడే వద్దు కళ్యాణీ! ఎక్స్‌రే రిజల్ట్స్ చూశాక నేనే తెప్పిస్తాను. వీడు మానసికంగా ఏదో గొప్ప ఆవేదన ననుభ విస్తున్నాడు గనుకనే- శారీరకంగా ఏదో బాధ అంటున్నాడు. నిజానికి వీడిని ఏ విధంగా మామూలు మనిషిగా తయారు చేయాలో తెలియటం లేదు..."

"డాక్టర్! నాకు తెలియక అడుగుతాను- యీ పేషెంట్ ఎందుకింత ఆవేదనకు లోనయ్యాడో మీకు తెలియదా?"

"ఈమధ్య వీడిని గురించి నాకేమీ తెలియదు

కళ్యాణీ! నిదానం మీదట అన్ని విషయాలూ తెలుసుకోనిదే తప్ప ఉపయోగం లేదు..."

"యస్ డాక్టర్!..."

"ఇహ నువ్వు వెళ్ళి వాడికి భోజనం ఏర్పాటు చూడు. సరిగ్గా రెండు గంటలకు వాడిని ఎక్స్‌రే థియేటర్‌కు తీసుకరా!"

"అలాగే డాక్టరు..." అని వెనుదిరిగింది కళ్యాణి. ఆమె గది ముందుకు చేరుకునే సరికి-లోపల కన్పించిన దృశ్యం చూసి చకితురాలైంది.

సుధాకర్ కిటికీ వద్ద నిల్చొని ఆకాశంకేసి చూస్తున్నాడు. అతని కళ్ళంబడి అశ్రువులు స్రవిస్తూ షర్ట్‌పై పడుతున్నాయి.

ఒక మగవాడు ఆ విధంగా కంటతడి పెడుతూ వుండటం చూసిన కళ్యాణి హృదయం బ్రద్దలైంది. అప్రయత్నంగా ఆమె కళ్ళల్లో కూడ నీళ్లు నిలిచాయి.

'భగవాన్! ఈ యువకుని హృదయ మందిరంలో ఏ అశాంతి పిశాచాలు విలయ నృత్యం చేస్తున్నాయి? ఎందుకింత ఆవేదనకు లోను చేశావు యితన్ని? ఇంత చిన్న వయస్సులోనే ఏ అపరాధం చేశాడని యింత కఠినమైన శిక్ష? మానసికంగా యితన్ని చిత్రహింస పాలు చెయ్యటంలో నీ ఉద్దేశ్య మేమిటి ప్రభూ!' అని తనలోని దైవాన్ని ప్రశ్నించుకుందామె.

కాని, ఆమె ప్రశ్నలు ప్రశ్నలుగానే మిగిలి పోయాయి. చాలాసేపటిదాక ఆమె అలాగే గుమ్మం వద్ద నిల్చుండి

పోయింది. అయినప్పటికీ సుధాకర్ ఆమె రాకను గమనించ లేదు. 'రాధ' పేరు అతని చెవుల్లో పడినప్పటి నుండీ హృదయ పృధివి రెండుగా చీల సాగింది. గత స్మృతులన్నీ తిరిగి మనః ఫలకంపై నిలిచి మరింత ఆవేదనకు లోను చేశాయి. ఎంత నిగ్రహించు కుందామనుకున్నా ఫలితం శూన్యమైంది. హృదయంలోని బాధ కన్నీళ్ళ రూపంలో బయటపడక తప్ప లేదు. ఆ కన్నీటి వర్షాన్ని నిలవరింపలేక సతమతమౌతూ కిటికీ దాకా వచ్చి నిల్చున్నాడు,

కళ్యాణి గది లోపలికి ప్రవేశించింది. పాదరక్షల చప్పుడు విని అతను దృష్టి ప్రక్కకు మళ్ళించాడు. ఆమె నెమ్మదిగా అతన్ని సమీపించింది.

"మీ కంట్లో నీళ్లు నిలిచి వున్నాయి. నలుసు పడిందా?" అనడిగింది.

అవునన్నట్లుగా అతను తల ఊపాడు.

"ఎప్పుడూ కిటికీ వద్ద నిల్చోకండి..." అంటూ ఆమె ఏదో చెప్పబోయి మధ్యలోనే ఆగింది. అతని కళ్ళల్లో మనో వేదన తాలూకు కన్నీళ్లు నిలిచి వున్నాయని తెలిసికూడా- తన కేమీ తెలియనట్లు ఆమె ప్రశ్న వేసింది. అందు కతను ఎలాంటి సమాధానం పలకకపోయేసరికి ఏదో చెప్పాలనుకుంది. కాని, ఒకటి రెండు దినాల పరిచయంవల్ల - అతన్నిగూర్చి ఏమీ తెలియని తను ఆ సాహసం చేయలేకపోయింది. ఎక్కువసేపు అక్కడ వుండలేక గది బయటికి నడిచింది.

# 3

చీకటి పడింది.

అకస్మాత్తుగా గదిలో దీపం వెలిగేసరికి సుధాకర్ తలెత్తి చూశాడు. ఎదురుగా నైట్‌డ్యూటీ నర్స్ నిల్చొని వుంది. ఆమె పెదవులపై మందహాసం లాస్యం చేస్తోంది. నెమ్మదిగా ముందుకు జరిగి—"గుడ్ యీవెనింగ్! చీకట్లో ఏం చేస్తున్నారు?" అంది.

అత నేమీ బదులు పలకలేదు. ఊరకే ఆమె కళ్ళల్లోకి తదేకంగా చూడసాగాడు.

"మీ ఆరోగ్యం ఎలా వుంది?" అని తిరిగి అడిగిందామె.

"నా ఆరోగ్యం ఎలా వుందో మీకే తెలిసివుండాలి" అన్నా డతను నెమ్మదిగా.

"అవును- కళ్యాణి చెప్పింది, డాక్టర్‌గారు యీ దినం మీకు ఎక్స్‌రే తీశారని. మీ ఊపిరి తిత్తులు బాగా పని చేయటం లేదట. మీరు పూర్తిగా విశ్రాంతి తీసుకుంటే చాలా త్వరలో మామూలు ఆరోగ్యాన్ని పుంజుకోగలరు."

ఆ మాటలు విని అతను గాఢంగా నిట్టూర్చాడు.

"నా ఆరోగ్యం విషయమై మీరంతా ఎందుకింత ఆవేదన పడుతున్నారో అర్థం గాకుండా వుంది" అన్నాడు.

"బాగుంది. పేషెంట్ ఆరోగ్యం బాగుపడాలని మేము కోరుకోవటంలో అసహజం ఏముంది? ఈ నర్సింగ్

హోమ్ కొచ్చేవాళ్ళంతా సంపూర్ణ ఆరోగ్యవంతులై తిరిగి పోయేందుకేగా!''

''కావొచ్చు. కాని, నే నిక్కడికి వచ్చింది ఆరోగ్యాన్ని పొందేందుకు కాదు.''

''మరి?''

''ఆత్మశాంతి కోసం వచ్చాను...''

''నిన్న కూడా యిదే మాట చెప్పారు...''

''అవును. ఏ నాటికైనా నా ఉద్దేశ్యం యిదే! ఇక్కడున్నా - ఎక్కడున్నా నాకు కావల్సింది ఆత్మశాంతి మాత్రమే!...''

''మీ మాటల తీరును బట్టి జీవితంలో మీరేదో గొప్ప వస్తువును పోగొట్టుకున్న వారిలా కన్పిస్తున్నారు. నిజమే నంటారా?...''

ఆ మాటతో అతనికి ముఖ కవళికల్లో మార్పు వచ్చింది. చూస్తూ చూస్తూండగానే అతని కళ్ళు సజల పూరితాలయ్యాయి.

''క్షమించండి. నా మాటలు మిమ్మల్ని బాధ పెట్టాయేమో!...'' అందామె.

''......''

''గతాన్ని మరచిపోయ్యేందుకు ప్రయత్నించటం మీలాంటి చదువుకున్న వారికి సులభమే ననుకుంటాను...''

''.....''

"గత గాథను మరచిపోయి భవిష్యత్తును పునరుద్ధరించు కోండి..."

"భవిష్యత్తు! ఊఁ— ఇక నాకు భవిష్యత్తు లేదు. అన్ని ఆశలూ అణగారి పోయాయి..."

"నిరాశతో కృంగి పోకండి. ప్రపంచ చరిత్రలో చాలా భాగం ఆశల్నీ, ఆశయాల్నీ నెరవేర్చుకోలేని వాళ్ళే మనకు కన్పిస్తారు. అయితే, వాళ్ళంతా తిరిగి ఎందువల్ల జీవితాన్ని పున రుద్ధరించుకున్నారంటారు?"

"వాళ్ళకి బ్రతకటమే ప్రధాన ఆశయం కనుక..."

ఆ సమాధానం విని నర్స్ ఒక్కసారిగా చకితురాలైంది. అతని నుండి అలాంటి సమాధానం వస్తుందని ఆమె ఊహించుకో లేదు. అటు తరువాత ఆమె యిహ మాట్లాడలేక పోయింది. నిశ్శబ్దంగా అక్కడే నిల్చొని కిటికీలో గుండా బయటికి దృష్టి నిల్పింది.

కొంతసేపటి వరకు ఉభయులూ ఏమీ మాట్లాడుకో లేదు. నిశ్శబ్దం ఆ గదిలో రాజ్యమేల సాగింది.

సుధాకర్ దృష్టి అప్రయత్నంగా ఆమె మీదికి మళ్లింది. నిశ్చలంగా బాహ్య ప్రపంచంలోకి చూస్తున్న ఆమెను చూసే సరికి అతని మనస్సెందుకో అంత దుఃఖంలోనూ జాలిపడింది. తనకోసం యీ నర్సుకు ఎందుకు దిగులు? తన ఆరోగ్య విషయంలో ఎందుకింత జాగ్రత్త తీసుకుంటోంది? మాటి మాటికి తనను ప్రశాంతంగా వుండేందుకు ప్రయత్నించమని

ఎందుకు చెబుతోంది_ అని తొలిసారిగా ఆమెను గురించి ఆలో చించా డతను.

నెమ్మదిగా "నర్స్!" అని పిలిచా డామెను.

ఆమె ఉలిక్కిపడి తేరుకుంది.

"ఏమండీ! పిలిచారా?" అంది తడబడుతూ.

"అవును. ఒక్కసారిగా మీలో మార్పు వచ్చింది. నాపై మీ రెందుకింత అభిమానం చూపుతున్నారో కారణం తెలుసుకోవచ్చా?"

"మీపై నేను అభిమానం చూపేందుకు ప్రత్యేకమైన కారణ మేదీ లేదు. నర్స్‌గా నా కర్తవ్యాన్ని నేను యిక్కడ నిర్వర్తిస్తున్నాను. సరేగాని, మీరు మందు తీసుకున్నారా?"

"లేదు_"

"సరిగ్గా టయానికి మందు తీసుకోవాలి. వుండండి. మందు యిస్తాను_" అంటూ ఆమె అల్మైరావద్ద కెళ్ళి ఔన్సు గ్లాసులో మందు తెచ్చి అతనికి అందించింది.

సుధాకర్ ఆమె అందించిన ఔన్సు గ్లాసు నందుకొని శుష్కహాసం చేశాడు.

"మీ అందరి పిచ్చిగాని, యీ మందు నా మనో వ్యాధిని జయించగల దనుకుంటున్నారా?" అన్నాడు.

అందుకు ఆమె ఏమీ బదులు పలకలేదు. నిశ్శబ్దంగా అక్కడినుండి కదిలి గది బయటికి వచ్చింది. కొన్ని పుష్పా లను తెచ్చి గదిలోని ఫ్లవర్ జగ్‌లో అలంకరించింది.

అప్పటికి ఏడుగంటలైంది.

ఆమె పడక కుర్చీలో మేను వాల్చి, చదువుకునేందుకు పుస్తకం అందుకుంది. కాని, మన స్సెందుకో చదువుపై ధ్యాస నిలపలేకపోయింది. ఆ అక్షరాలమధ్య సుధాకర్ దీనవదనమే నిలిచి ఆమెను కలవరపరచింది. ఎన్ని విధాలుగా ఆలోచించినా ఆమెకు అతని మనస్తత్వ మేమిటో బోధపడలేదు.

సాయంకాలం కళ్యాణి అతన్ని గురించి తనకు అన్ని విషయాలు చెప్పింది. డాక్టర్‌గారు 'రాధ' అని తన కూతురు పేరు చెప్పేసరికి అతనిలో కల్గిన మార్పును- అప్పటినుండి అతను మానసికంగా పొందుతున్న ఆవేదననుగూర్చి వివరించింది. 'రాధ' అనే పేరు వినగానే అత నెందు కంతగా పరితపించాడు? ప్రతి మాటకు ఆత్మశాంతికోసం యిక్కడికి వచ్చా నంటున్నాడు. జీవితంలో ఎంత గొప్పగా పరాజయం పొందాడో- యింతగా వ్యధ చెందుతున్నాడు? ఈ జీవితానికిక యితని హృదయానికి కల్గిన గాయం మానదేమో!

అలాంటి ఆలోచనలతో ఆమె పడక కుర్చీ నుండి లేచింది. అతని వైపు చూసే సరికి ఆమెకు ఎక్కడలేని దుఃఖం పొంగు కొచ్చింది. స్త్రీ సహజమైన జాలి వల్ల అతని కోసం ఆమె కళ్లు వర్షించాయి. ఆ కన్నీటి వర్షాన్ని ఆపలేక కిటికీ దాకా వెళ్ళి నిల్చుంది.

అదంతా గమనిస్తున్న సుధాకర్ చలించి పోయాడు. ఈ నర్సు వింత ప్రకృతిగల స్త్రీవలె గోచరిస్తోంది. తనెవరో తెలియని వాడు. కేవలం యీ నర్సింగ్ హోమ్‌లో పేషెంట్

మాత్రమే! అలాంటి తనకోసం యీామె మధన పడట మెందుకు_ అనుకున్నా డతను.

పడకలో నుండి లేచి ఆమెను సమీపించాడు. ఆమె నుండి అప్పుడప్పుడు వేడి నిట్టూర్పులు విన్పిస్తున్నాయి.

"నర్స్!..." అన్నాడు నెమ్మదిగా.

ఆమె బదులు పలకలేదు.

"మీరు దేన్ని గురించి ఇంత తీవ్రంగా ఆలోచిస్తు న్నారో నేను తెలుసుకోకూడదా?" అన్నాడు తిరిగి.

"మీ గురించే ఆలోచిస్తున్నాను..." అందామె గద్గద స్వరంతో.

"నా గురించా! దేనికి?..."

"చాలా సులువుగానే దేనికని ప్రశ్న వేశారు. నేను స్త్రీని. మగవారి వలె కఠినమైన గుండె కల దాన్ని కాను. మీ గురించిన ఆలోచనలు నాలో క్షణక్షణానికి అధికమా తున్నాయి. మీ ఆవేదన ఏమిటో స్పష్టంగా అర్థం చేసుకో లేక పోతున్నాను. నా ముందు ఒక వ్యక్తి అనుక్షణం మాన సికంగా కృంగి పోవటం చూసి నా హృదయం పగిలి పోతుంది. ఇంతకన్నా ఏం చెప్పను?" అంటూ ఆమె వెను దిరిగి అతని కళ్ళల్లోకి సూటిగా చూచింది.

అతనామె చూపుల తీక్షణతకు ఆగలేక పోయాడు. తప్పు చేసిన వాడిలా నెమ్మదిగా తలవంచుకొని తిరిగి పడక మీదికి వచ్చి కూర్చున్నాడు. ఆమె మాటల తీవ్రతవల్ల తనను గురించి ఆమె ఎంతగా ఆరాటపడుతోందో స్పష్టంగా అర్థ

మైంది అతనికి. తనకోసం యీ స్త్రీ ఆరాటపడటంలో గల అర్థ మేమిటి? తను యిక్కడికి వచ్చింది ఎందుకు? ఇంతమంది హృదయాల్లో అశాంతిని రేకెత్తించేందుకా? ముఖ్యంగా యీ స్త్రీమూర్తిని బాధపెట్టేందుకా? తన నిజ జీవిత గాథ ఏమిటో తెలుసుకోవాలని యీ స్త్రీ వేగిరపడుతోంది. తన విషాద గాథను విని యీమె ఏం చెయ్యగలదు, ఒక్క కన్నీటి చుక్కను వదలటం తప్ప! తనలోని ఆవేదన తనలోనే అణగారి పోకుండా- యీ స్త్రీకి కూడా పంచిపెట్టడం దేనికి? అసలీ స్త్రీమూర్తి ఎవరు? పేరేమిటి? యిక్కడ ఎన్నాళ్ల నుండి నర్సుగా పనిచేస్తోంది? ఈమె ముఖంలో కూడా నీలిఛాయలు కన్పిస్తున్నాయి. యెందుకు? తనవలె యీమెకూడా భగ్నజీవి కాదు కదా!

అతను తన ఆలోచనలనుండి నెమ్మదిగా తేరుకొని- "నర్స్!" అన్నాడు.

ఆమె నిశ్శబ్దంగా అతని వద్దకు నడిచి వచ్చింది.

"కూర్చో నర్స్! నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి."

ఆమె అక్కడున్న స్టూల్‌ను దగ్గరగా జరుపుకొని అతని ముందు కూర్చుంది.

"నర్స్! నీ పేరేమిటో యింతవరకు చెప్పలేదు. నీ మనోవేదన ఏమిటో అర్థం చేసుకున్నాను. అందుకే నిన్ను 'మీరు' అని సంబోధించలేకపోతున్నాను. నువ్వు నాయెడ కనపరచిన అభిమానానికి- నా జీవితంలో తారసిల్లి- నా

హృదయ ఫలకంపై చెదరిపోని అక్షరాలతో నిలిచివున్న వ్యక్తుల మధ్య నీ పేరూ దాచుకుంటాను. నీ పేరు చెప్పు నర్స్!"

కొన్ని క్షణాలు ఆమె మాట్లాడలేకపోయింది. అతని కళ్ళల్లోకి నిశ్చలంగా చూస్తూ- ఏవో లోకాల్లోకి దిగజారి పోయింది.

"నువ్వెవరో- నీ పేరేమిటో చెప్పుకోవాలని లేదా నర్స్! మాటిమాటికీ నిన్ను 'నర్స్' అని సంబోధించలేకున్నాను. నీపై నాకున్న అభిమానానికి కనీసం నీ పేరుతోనైనా నిన్ను పిలుచుకునే భాగ్యం ప్రసాదించు."

"ఇంత చిన్న విషయానికే ఎందు కంత ఉద్రేక పడతారు? నా పేరు సావిత్రి. ప్రస్తుతం నేను నర్స్‌ను. ఇంతకన్నా నన్ను గురించి ఏమీ చెప్పుకోలేను" అని శుష్క-హాసం చేసిం దామె. అతను ప్రయత్నపూర్వకంగా చిరునవ్వు నవ్వాడు. కాని, ఆ నవ్వులో సహజత్వం నశించింది.

అంతలో బయట ఏదో శబ్దమైంది. సావిత్రి లేచి గది బయటికి నడిచింది. ఎదురుగా కళ్యాణి రావటం చూసి చిరు నవ్వు నవ్వింది.

"సావిత్రీ! నీతో అర్జంట్‌గా మాట్లాడవలసి వచ్చాను. నేనీ రాత్రే బయలుదేరి నంద్యాల వెళుతున్నాను" అంది కళ్యాణి.

"దేనికి?" అనడిగింది సావిత్రి.

కళ్యాణి జవాబు చెప్పేలోగా అక్కడికి సుధాకర్

వచ్చాడు. కళ్యాణి అతనక్కడికి రావటం చూసి—"గుడ్ నైట్ మిస్టర్! భోజనం చేశారా?" అనడిగింది.

"లేదు..." అన్నాడతను.

"అదేమిటి? యింకా భోజనం తీసుకోలేదా? సావిత్రీ! ఈయనకు వేళకు భోజనం సంగతి జ్ఞాపక ముండదు. నువ్వు నీ చదువు గొడవలోపడి యీాయన సంగతే మరచి పోయేవు..." అని నవ్వింది కళ్యాణి.

సావిత్రి పెదవులపై క్షణకాలం చిరునవ్వు నిలిచింది.

"వీరికి భోజనం ఏర్పాటు చూద్దామనుకునే లోపుగా నువ్వు వచ్చావ్. ఇంత అకస్మాత్తుగా నువ్వు వెళతావని అనుకో లేదు..."

"నేను మాత్రం అనుకున్నానా? ఇప్పుడే టెలిగ్రాం వచ్చింది. ఉన్న పళంగా బయలుదేరి రమ్మని నా మిత్రురాలు తెలిపింది. వెళ్ళకపోతే వుండలేను..."

"డాక్టర్‌గారిని కలిశావా?"

"ఆఁ. టెలిగ్రాం చూపించాను. వెళ్లి రమ్మన్నారు. తిరిగి వచ్చేందుకు ఎన్నాళ్లు పడుతుందో? మరి నేను వెళ్ళి రానా?"

కళ్యాణి వెనుదిరిగి వెళ్ళబోయింది. కాని, అంతలోకే ఏమని ఆలోచించుకుందో చటుక్కున ఆగింది. తిరిగి వారిద్దరి ముందుకొచ్చి సుధాకర్ వైపు దృష్టి నిల్పింది.

"ఏమండీ! నేను వెళుతున్నాను. తిరిగి వచ్చే సరికల్లా మీారెలాంటి బాధలూ లేకుండా నవ్వుతూ కన్పించాలి. ఆలోచ

నలతో ఆరోగ్యాన్ని శ్రంగ దీసుకోకండి. నేను మీ గురించి కొంతవరకు ఊహించుకున్నాను. నా ఊహ నిజమో కాదో నేను తిరిగి వచ్చాక మీరే చెబుదురు గాని!'' అన్నదామె.

కళ్యాణి మాటలు విని అతను తొలిసారిగా ఆ ఆస్పత్రిలో చిరునవ్వు నవ్వాడు.

''ఎందుకలా నవ్వుతున్నారు?'' అందామె.

''మీ అందరి పిచ్చిగాని, నాపై మీ కెందు కింత అనురాగం? నా విధిని ఎవ్వరూ మార్చలేరు. నా భవిష్యత్తును ఎవరూ ఏవిధంగానూ నిర్ణయించలేరు. మీరు వచ్చేసరికి నేను మీకు సంపూర్ణ ఆరోగ్యంతో కన్పించగలనని ఎలా అనుకుంటున్నారు?''

''మీ ఆరోగ్యం చక్కబడాలని ఆశిస్తూన్నాను. ఆ మాత్రం ఆశించకూడదా నేను?''

''ఆ విధంగా ఆశించేవారు మరొక రున్నారు. మీకా యోగ్యత లేదు.''

ఆ సమాధానం విని కళ్యాణి సావిత్రికూడా నిశ్చేష్టులయ్యారు. అత నంత సూటిగా, కటువుగా సమాధానం చెబుతాడని వారు ఆశించలేదు. అలాంటిది అకస్మాత్తుగా జరిగేసరికి ఉభయుల హృదయాలు గాయపడ్డాయి.

ఆ యిద్దరు స్త్రీమూర్తుల మనోవేదనను అతను పసిగట్టలేకపోయాడు. మామూలు ధోరణిలోనే – ''ఏం? నా మాటపై విశ్వాసం లేదా?'' అన్నాడు తిరిగి.

"ఎందుకు లేదు" అంది తడబడుతూ కళ్యాణి.

"మీ ఆరోగ్యాన్ని ఆశించే ఆ భాగ్యవతి ఎవరో మాకు చెప్పకూడదా?" అన్నది మధ్యలో సావిత్రి కలగచేసుకొని.

అందు కతను బదులు పలకలేదు.

"పోనీ లెండి, ఆ స్త్రీమూర్తి ఎవరైందీ మీరు చెప్పక పోయినా ఫరవాలేదు. అయినా, నర్సుగా నా విధి నిర్వహణ రీత్యా మీ ఆరోగ్యం చక్కబడాలని ఆశించే యోగ్యత నా కున్నది. మీ వ్యక్తిగత జీవితానికి సంబంధించిన ఏ విష యంలోనూ నాకు ఎలాంటి యోగ్యత లేకపోవచ్చు. అంత మాత్రంచేత మిమ్మల్ని అభిమానించే వారిలో నే నొకతెననే విషయం మాత్రం మరచిపోకండి" అంది కళ్యాణి రుద్ధమైన కంఠంతో.

అతను కొన్ని క్షణాల వరకు మౌనం వహించాడు. ముగ్గురి హృదయాలు మూడు కోణాల్లో ఆలోచనలు ప్రారం భించాయి. ఎవరికి వారు ఎదుటి వారి మనస్తత్వ మేమిటో తెలియక అర్థంకాని ఆవేదనకు లోనయ్యారు.

ఆ విధంగా మరికొన్ని క్షణాలు గడిచిన తర్వాత అతనే నెమ్మదిగా మాట కలిపాడు.

"కళ్యాణీ! తొందరపడ్డాను. నేనేం ఆలోచిస్తున్నానో, ఏం మాట్లాడుతున్నానో నాకే అర్థంకాని స్థితిలో వున్నాను. ఈ అపరాధానికి నన్ను క్షమించక తప్పదు..."

ఆ మాటలతో కళ్యాణి తేరుకుంది.

"ఇందులో క్షమించేందుకు మీరేం అపరాధం చేశా

రని! ఉన్న సత్యాన్ని స్పష్టపరచారు. అందుకు నాకెంతో సంతోషమైంది. ఇహ సెలవు తీసుకుంటాను. ఇప్పటికే ఆలశ్యమైంది. నేను రావటం ఆలశ్యమైతే ఉత్తరం వ్రాస్తాను. మీ ఆరోగ్యం ఎలాగుండేది నాకు సావిత్రి వ్రాస్తూ వుంటుంది. వస్తానండి. వెళుతున్నాను సావిత్రీ! నమస్తే!'' అంటూ కళ్యాణి రెండు చేతులూ జోడించింది.

అప్పుడామె చేతులు ఎందువల్ల వణుకుతున్నాయో - ఆ కళ్ళల్లో నీళ్ళెందుకు నిలవబోతున్నాయో ఎవ్వరూ అర్థం చేసుకోలేక పోయారు. బరువైన మనస్సుతో అడుగులో అడుగు వేసుకుంటూ నెమ్మదిగా కళ్యాణి అక్కడి నుండి కదిలి పోయింది.

ఆమె వెళ్ళిపోగానే కొంత సేపటివరకు సావిత్రి యీ లోకంలో లేదు. కళ్యాణి పైని ఆలోచనలతో ఆమె అక్కడే చాలాసేపు నిల్చుండి పోయింది.

ఇహ ఆ రాత్రంతా ఆమె మేల్కొనే వుండి పోయింది. ఎప్పుడు తెల్లవారిందోగాని డాక్టర్ రఘురామ్ వచ్చేవరకు ఆమె జాగ్రదావస్థలోకి రాలేదు.

అప్పటికి సుధాకర్ గాఢ నిద్రలో మునిగి వుండటం చూసి డాక్టర్ రఘురామ్ నిట్టూర్చాడు. సావిత్రిని దగ్గరగా పిలిచి—''నర్స్! ఈ పూర్ ఫెలో యింకా నిద్రపోతున్నాడు. స్లీపింగ్ డోస్ ఏమైనా యిచ్చావా?'' అనడిగాడు.

''లేదు డాక్టర్! రాత్రి చాలాసేపు మేల్కొనే

వున్నాడు. ఇప్పుడిప్పుడే నిద్రపోయినట్లుంది" అని బదులు చెప్పింది సావిత్రి.

"సరే—యిహ నువ్వెళ్లు" అన్నాడతను.

"యస్ డాక్టర్! కళ్యాణి ఊరికి వెళ్ళిపోయింది. మరి యిక్కడ డే డ్యూటీ కూడా నేనే చెయ్యనా?"

"వద్దు నర్స్! ఆమె వచ్చేవరకు సంధ్య యిక్కడ డే డ్యూటీ చేస్తుంది. నువ్వు వెళ్ళి సంధ్యను పంపించు."

"అలాగే డాక్టర్!" అని సావిత్రి అక్కడినుండి కదిలిపోయింది. డాక్టర్ రఘురామ్ ఓమారు సుధాకర్ వైపు జాలిగా చూసి, తిరిగి గది బయటికి వచ్చాడు. యిక అక్కడ వుండలేక తన సైకిల్ ఎక్కి ఆఫీస్‌రూం వైపు నెమ్మదిగా వెళ్ళిపోయాడు.

# 4

సుధాకర్ నిద్రనుండి మేల్కొనేసరికి ఎదురుగా ఒక అపరచిత నర్స్ నిల్చొని వుంది. ఆమెను చూడగానే కళ్యాణి స్థానంలో ఆమె డ్యూటీకి వచ్చిందని తెలుసుకున్నా డతను. పడకమీాదినుండి లేచి క్రిందికి దిగేసరికి ఆమె నవ్వుకుంటూ ముందుకు వచ్చింది.

"హలో! హౌడుయుడు?" అందామె నవ్వుతూనే.

అతను ఒక్క క్షణకాలం ఆమె కళ్ళల్లోకి చూసి తలవంచుకున్నాడు.

"సావిత్రి వెళ్ళిపోయిందా?" అనడిగాడు నెమ్మదిగా.

"అవును మాష్టారూ! ఏం? పిలిపించమన్నారా? మీ కేమైనా కావాలా?"

"ఏదీ అక్కర్లేదు."

"అక్కర కల్గినప్పుడే చెప్పండి. చూడండీ! నా పేరు సంధ్య. కళ్యాణి స్థానంలో యిక్కడ డే డ్యూటీకిగాను డాక్టర్ గారు నన్ను పంపారు."

"మంచిపని చేశారు."

"చూడండీ! మీ పేరేమిటి?"

అత నేమీ బదులు పలకలేదు.

"మీ ఊరేమిటి? ఎన్నాళ్ళయింది యిక్కడికి వచ్చి? అసలు మిమ్మల్ని పట్టుకున్న రోగ మేమిటి?"

ఆమె ప్రశ్నలకు అతను చికాకు పడ్డాడు. ఏం మాట్లాడకుండా అక్కడినుండి కదిలి గది బయటికి వెళ్ళి పోయాడు.

తన ప్రశ్నలకు సమాధానం చెప్పకుండా నిశ్శబ్దంగా వెళ్ళిపోతున్న అతన్ని చూస్తూ సంధ్య ముఖం చిట్లించుకుంది.

అతను తిరిగి వచ్చే సరికల్లా ఆమె గదిని శుభ్రం చేయించి బ్రెక్ఫాస్టు తెచ్చేందుకు వెళ్ళింది.

కొంతసేపటికి అతను బ్రెక్ఫాస్టు ముగించి యథా ప్రకారం కిటికీ వద్ద వెళ్ళి నుంచున్నాడు. ఆ తర్వాత సంధ్యకు ఏం చేయాలో తోచలేదు. ఆమె చప్పుడు గాకుండా వెనుక పాటుగా అతన్ని సమీపించి తనూ బయటికి చూసింది.

దూరంగా నల్లని కొండలు - బంగారు కాంతి కిరణాలను వెదజల్లుతూ ఆకాశానికి ఎగబ్రాకుతున్న సూర్యభగవానుడు కన్పించారామెకు. వాటిలో ఎలాంటి ప్రత్యేకతను ఆమె చూడలేక - అతని దృష్టిని తన వైపు మళ్ళించుకునేందుకు పొడిగా దగ్గింది. కాని, ఆమె ప్రయత్నం సఫలం కాలేదు. దానితో ఆమె రెండవసారి ముఖం చిట్లించుకుంది. లేని నవ్వును పెదవుల మీదికి తెచ్చుకుంటూ — "మాష్టారూ! ఏం చేస్తున్నారు?" అంది.

ఆమె కలుపుగోలు తనానికి అతనెలాంటి అర్థాన్ని తియ్యలేక ఓమారు వెనక్కి తిరిగి చూశాడు.

"ఓహో! ప్రకృతి పరిశీలనలో పడ్డారా? ఐయామ్ వెరీ గ్లాడ్. చూడండీ, ఈ ప్రకృతి రామణీయకతపై నా కెంతో ముచ్చట కల్గుతుంటుంది. చూడండీ, మిమ్మల్ని చూస్తుంటే నా కెందుకో ఒకలా వుంటోంది. పాపం! మీతోపాటు మీ వాళ్ళెవరూ రాలేదా? మీ కెవ్వరూ లేరా?"

ఆ మాటలతో సుధాకర్ హృదయం తిరిగి బ్రద్దలైంది. తను ఆశించినది దూరమైపోతున్నది. ఏ ఉద్దేశ్యంతో తనిక్కడికి వచ్చాడో క్రమక్రమంగా ఆ ఉద్దేశ్యమే మార్పు చెందుతున్నది. ఎక్కడైతే ఆత్మశాంతి లభ్యం కాగలదని వచ్చాడో - అక్కడే క్షణ క్షణానికి అశాంతి విలయ నృత్యం చేస్తూ ఎదురు రాసాగింది.

ఈ నర్సులందరూ తన నెందుకిలా గుచ్చిగుచ్చి ప్రశ్నిస్తున్నారు? ప్రశ్నించటంలో మార్పులు తప్ప అందరి భావాలూ

ఒకటే! అదే_తన జీవిత కథనం విన్పించమని. వీళ్ళంతా తన నిజ జీవిత గాథ విని ఏం చెయ్యగలరు? అసలు తన బాధల గాథతో వీళ్ళకేం పని? ఈ ముగ్గురు స్త్రీలకు తనను గురించి తెలుసుకోవాలనుకునే ఉబలాట మెందుకు?

అత నా విధంగా తన ఆలోచనల్లో తాను మునిగి వుండగా మళ్ళీ సంధ్య ప్రశ్నించింది: "చూడండి! నా ప్రశ్నలు వినగానే మీ ముఖంలో మార్పు వచ్చింది. నిజంగా మీవాళ్లు ఎవ్వరూ లేరా?"

ఏమని సమాధానం చెప్పాలి తను యీ నర్సుకు? ప్రతి ముఖ కవళికకు_కదలికకు అర్థం తీసే యీ స్త్రీ నర్సులు శారీరక శాస్త్రం చదివారా? లేక, మానసిక శాస్త్రం చదువు కున్నారా? తన కెవ్వరూ లేరని చెబుతే యీ స్త్రీ తనను గురించి ఏమని తలపోయగలదు?

అతని నుండి ఎంత సేపటికీ ఆమెకు సమాధానం రాక పోయే సరికి తిరిగి మాట కలిపింది: "పోనీలెండి. మిమ్మల్ని గురించి చెప్పుకోవాలని లేకపోతే నేనేమీ యిబ్బంది పెట్టను" అంది.

అప్పటికి కూడా సుధాకర్ ఏమీ పలకలేదు. నిస్సహా యంగా ఆమె కళ్ళల్లోకి ఓమారు చూసి తిరిగి పడక చేరు కున్నాడు.

ఆ తర్వాత సంధ్య ఏమీ మాట్లాడలేదు. సాయం కాలం దాకా ఉభయులూ మౌనంగానే గడిపారు.

# 5

కళ్యాణి ఆస్పత్రి నుండి తిరిగి క్వార్టర్స్‌కు వచ్చేసరికల్లా యింటి ముందు కారు ఆగి వుంది. స్టేషన్‌కు వెళ్ళేందుకు డాక్టర్ గారు తన కారు పంపించారేమో నని ఆమె గబగబా లోపలి కెళ్ళి సూట్ కేస్‌తో బయటికి వచ్చి తలుపుకు తాళం వేసింది. అంతవరకు చెట్టుక్రింద కూర్చొని బీడీ దమ్ము లాగు తున్న డ్రైవర్ ఆమెను చూసి పరిగెత్తుకుంటూ వచ్చాడు.

కొన్ని క్షణాల్లో కారు ఆ ఆస్పత్రి పరిసరాలను వదలి రామగుండం రోడ్డుమీదుగా ప్రయాణించసాగింది.

కళ్యాణి కారులో కూర్చున్న దన్నమాటేగాని ఆమె మనస్సు పరిపరి విధాలుగా ఆలోచనల్లో తేలిపోసాగింది. ఒక వైపు తన స్నేహితురాలు ఎందుకు తంతి నిచ్చిందో అనే ఆరాటం— మరోవైపు క్రొత్తగా వచ్చిన పేషెంట్ తనను అర్థం చేసుకోలేకపోయాడే ననే ఆవేదన ఆమెను చుట్టు ముట్టాయి.

కారుమాత్రం ఆమె ఆలోచనలతో ఎలాంటి సంబం ధమూ లేనట్లుగా శరవేగంతో వెళ్ళిపోతోంది. మధ్యమధ్యన అడ్డు తగిలిన రెండు మూడు గ్రామాలను దాటి, కారు కొంత సేపటికి హిందూపురం చేరుకుంది.

కారు స్టేషన్ చేరుకోవటం— రైలు ప్లాట్‌ఫాంమీదికి రావటం ఒకేమారు జరిగాయి. కళ్యాణి కారు దిగి డ్రైవర్‌తో టికెట్టు తెప్పించుకుంది. ఆడవాళ్ళ కంపార్ట్‌మెంట్‌లో స్థలం

లేకపోవటంతో యిష్టంలేకున్నా మగవాళ్ళ కంపార్ట్‌మెంట్ ఎక్కింది. ఆమె తీరిగ్గా స్థలం చూసుకొని కూర్చున్నాక డ్రైవర్ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

ఓ పది నిమిషాల్లో రైలు ప్లాటుఫాం వదిలింది. క్రమ క్రమంగా రైలు వేగం హెచ్చేకొద్దీ- తిరిగి ఆమె ఆలోచనా ప్రవాహంలో పడిపోయింది.

ఉదయం గుంతకల్ జంక్షన్‌లో రైలు ఆగగానే కళ్యాణి రెస్టారెంట్‌కి వెళ్ళి కాఫీ త్రాగింది. అక్కడినుండి మచిలీపట్నం వెళ్ళే రైలు ఎక్కి ఆడవాళ్ళ మధ్య కూర్చుంది.

క్రమక్రమంగా సూర్యుడు ఆకాశానికి ఎగబ్రాక సాగాడు. ప్లాటుఫాంమీద జనసమూహం రానురాను అధికం కాసాగింది. రైలు ఎంతసేపటికీ బయలుదేరకపోయేసరికి ఆమెకి విసుగు వేసింది. కిటికీలోగుండా తలపెట్టి అటూ యిటూ తిరుగుతున్న జనంకేసి చూడసాగింది.

చాలాసేపటికి కూతపెట్టి నెమ్మదిగా రైలు కదిలింది. వెనక్కిపోతున్న ప్లాటుఫాంను- జనాన్ని చూస్తూ ఆమె తన సీటులో వచ్చి కూర్చుంది. అప్పటికే పెట్టెలో జనం ఎక్కువయ్యారు. ఒకరి నొకరు త్రోసుకుంటూ, శాపనార్థాలతో- మాటి విరుపులతో యుద్ధం చేస్తున్నారు. ఎటొచ్చీ అందరూ మధ్య తరగతి స్త్రీలే. ప్రొద్దు గడిచేందుకు ఎవరితోనైనా కాస్త మాట్లాడదామనుకున్నా లాభం లేకపోయిందామెకు. ఏదో తనకే తెలియని అస్పష్టమైన ఆరాటంతో బాధపడుతూ

బాహ్య ప్రపంచంలోకి దృష్టి నిలిపి టెలిగ్రాఫ్ స్తంభాలను, బీడు పొలాలను, కొండ గుట్టలను చూడసాగింది.

రైలు భోజనం వేళకు ద్రోణాచలం స్టేషన్ చేరు కుంది. కళ్యాణి పెట్టె దిగి ఒక భోజనం పొట్లం కొనుక్కుంది. కాని, దాన్ని తినేందుకు ఆమె మన స్కొప్ప లేదు. అడుక్కుం టున్న ఒక బిచ్చగత్తె చేతిలో దాన్ని పెట్టి- రెస్టారెంట్ లో కాఫీ త్రాగింది.

ఒక నలభై నిమిషాల తర్వాత తిరిగి రైలు కదిలింది. నంద్యాల చేరుకునేసరికి ఎండ నిప్పులు చెరుగుతోంది. కళ్యాణి సూట్ కేస్ తీసుకొని గబగబా పెట్టె దిగింది. గేటు బయటికి వచ్చి రిక్షా మాట్లాడుకుని జ్ఞానాపురం వైపు దారితీసింది.

సాధారణమైన ఒక యింటిముందు రిక్షా ఆగింది. కళ్యాణి రిక్షావాడికి డబ్బులిచ్చి గేటు తెరచుకొని లోపలికి ప్రవేశించింది.

ఇంట్లో అడుగుపెట్టగానే ఆమె కెలాంటి సవ్వడి విన్పించ లేదు. అస్పష్టమైన భయావేశంతో ఆమె మరింత ముందుకు నడిచింది. కుడివైపుగా నున్న మంచంపై మూడేళ్ళ కుర్రవాడు పడుకొని వున్న దృశ్యం కన్పించేసరికి అంతవరకు ఆమెను ఆవహించి వున్న భయమంతా పటాపంచలైంది.

పరుగు పరుగున బాబును చేరుకొని మంచంపై కూర్చుండి, ఆ పిల్లవాడి కురులను సవరిస్తూ చెక్కిలిపై ముద్దు పెట్టుకుంది.

అంతలోనే పెరటి వైపున్న తలుపులవద్ద శబ్దం విన్పిం

చగా తలెత్తి చూసింది. మార్గరెట్ చంకన బిందె నిడుకొని వస్తున్న దృశ్యం చూడగానే సంతోషంతో ఒక్క గెంతున ఆమెను చేరుకుంది.

మార్గరెట్ చిరునవ్వు నవ్వి బిందె క్రింద పెట్టింది. కళ్యాణి రెండు చేతులూ పట్టుకొని—"యిప్పుడేనా రావటం!" అంది.

"అంత డల్‌గా అడుగుతావేమిటి? నిన్ననే నీ టెలిగ్రాం అందింది. ఉన్న ఫళంగా బయలుదేరి వచ్చాను. అదేమిటి, చాలా చిక్క పోయావ్! ఆరోగ్యం బాగా లేదా?" ఆత్రంగా అడిగింది కళ్యాణి.

"నేను నిక్షేపంగానే వున్నాను. బాబుకే ఆరోగ్యం సరిగా లేదు."

"ఏమిటీ-బాబుకా! ఏమైంది?"

"అయిదారు దినాల నుండీ జ్వరం కాస్తోంది."

"అయిదారు దినాల నుండీ జ్వరం కాస్తోంది. ఆస్పత్రికి తీసికెళ్ళి డాక్టర్‌కు చూపించాను. ఇంజెక్షన్‌లు కూడా యిప్పించాను. ఏ దినానికా దినం తిరుగు ముఖం పట్టినట్టే వుంటుంది. కాని, సాయంకాలం అయ్యేసరికి టెంపరేచర్ వుంటుంది. ఏం చేయాలో అర్థం గాక నీకు వైర్ యిచ్చాను. నీకన్నా నాకు ఆప్తులు ఎవ్వరున్నారని, నా ఆవేదనను వెలి బుచ్చుకునేందుకు?"

"ఊరుకో. ఏమిటా కంట తడి? నేను వచ్చానుగా!

బాబుకు యింకేం భయంలేదు. వచ్చిన జ్వరాన్ని వచ్చినట్టే పంపించేస్తాను. నువ్వేలాంటి దిగులూ పెట్టుకోకు."

మార్గరెట్ ఆ మాటలతో కళ్ళనీళ్లు తుడుచుకొని బాబును సమీపించింది. ఆ పిల్లవాడు తన మాతృమూర్తి ఎంతగా ఆవేదనకు లోనైందో తెలియక జ్వర తీవ్రతతో బంధితుడై వున్నాడు.

కళ్యాణి బాబు నాడి చూసింది. ఇంకా టెంపరేచర్ వుంది. బాబు నిద్రపోతూ వుండటంతో ఏమీ చెయ్యలేక పోయింది.

"కళ్యాణీ!..." అన్న శాంతస్వరం విన్పించగానే ఆమె మార్గరెట్ వైపు తిరిగి చూసింది.

"బాబుకు నయమౌతుందంటావా ?" అనడిగింది అమాయకంగా మార్గరెట్.

"ఛీ! ఏం ప్రశ్న యిది? ఎందుకంత మానసిక బలహీనురాల వవుతావ్? బాబుకు నయంగాక ఏమౌతుంది?"

"అది కాదు. నా మనస్సెందుకో ఆందోళనగా వుంది. ఏ పనీ చెయ్యలేక పోతున్నాను. నా మనస్సు మనస్సులో వుండటంలేదు. నాకే అర్థంకాని ఆవేదన నన్ను చుట్టుముట్టి చిత్రహింస చేస్తోంది. ఈలాంటి సమయంలో ఏం చెయ్యను నేను?"

మార్గరెట్ బాధాపూరితమైన మాటలు వినగానే కళ్యాణి హృదయం జాలిపడింది. ఎందుకంత ఆవేదన యీమెకు? కేవలం సామాన్యమైన జ్వరం బాబును ఆవహించి

నంత మాత్రాన యింతగా ఆరాటపడటమా? ఏమో! మాతృ హృదయం యీ పరిస్థితుల్లో ఎలాగుంటుందో తనకు అనుభవ పూర్వకమైన జ్ఞానం లేదు. తనూ మాతృమూర్తి అయ్యింటే యిలాగే కన్నీళ్ళ వర్షంతో కుమిలిపోయేదేమో!

"పలకవేం?" అంది తిరిగి మార్గరెట్.

కళ్యాణి ఏం మాట్లాడకుండా నిశ్శబ్దంగా ఆమె కళ్ళల్లోకి చూసింది. కాని, ఆమె కళ్ళల్లో కన్పిస్తున్న ఆవేదనారాటాలను చూడలేక తల క్రిందికి దించుకుని—

"ఇదిగో! నువ్విలా ఊరకే ఆలోచనలతో సతమతమయ్యేకొద్దీ అన్నీ సమస్యలుగానే ఎదుట పడుతుంటాయ్. మూడు సంవత్సరాలనుండీ నిన్ను చూస్తున్నాను. కాని, ఒక్కసారైనా నిండు హృదయంతో నీలో నువ్వయినా నవ్వుకున్నావా? లేదు. ఏదో బాధ నిన్ను అనుక్షణమూ వెంటబడి జీవచ్ఛవాన్ని గావిస్తోంది. నీలోని బాధలేమిటో- బాబు తండ్రి ఎవరో నాతోనైనా చెప్పుకొని కొంతవరకు ఊరట పొందు. అంతవరకు నీకు అశాంతి తప్ప శాంతి దొరకదు. ఆవేదన తప్ప ఆనందం లభ్యం కాదు. ఆరాటాలు తప్ప అనుభూతులు సమీపించవు" అంది ఉద్రేకంతో.

రెండు క్షణాలవరకు మార్గరెట్ ఏమీ పలకలేదు. చెక్కిళ్ళమీదుగా జారిపోతున్న కన్నీటిని పయిట చెరగుతో తుడుచుకొని నేలకేసి చూపులు నిలిపింది.

అంతలోనే బాబు మంచంలోనుండి లేచి కూర్చునేసరికి అంతటితో వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

కళ్యాణి బాబును గుండెలకేసి హత్తుకొని, కురులను సవరించసాగింది. ఆ దృశ్యం చూస్తూ మార్గరెట్ పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక అక్కడినుండి లేచి పెరటిలోకి వెళ్ళిపోయింది.

# 6

సాయంకాలం ఆరుగంటలైంది.

చర్చిలో గంటలు కొడుతున్నారు. అప్పటికే చాలా మంది క్రైస్తవులు బైబిల్ చేతపట్టుకొని నిర్మల మనస్కులై చర్చికి వెళ్ళసాగారు.

మార్గరెట్ శుచియై ఏసుభగవానుని పటం ముందున్న బైబిల్ నందుకొని కళ్ళ కద్దుకుంది. తెల్లటి దుస్తులు ధరించి - మూర్తీభవించిన శోకదేవతవలె గేటు దాటి చర్చి కేసి దారి తీసింది.

చర్చి గంటలు వినగానే ఆమె సర్వప్రపంచాన్నీ మరచి పోయింది. ఏవో తనకే తెలియని నిర్మల లోకాలలోకి రెక్కలు గట్టుకొని వెళ్ళసాగింది. ఆమె కళ్ళ ముందు ఏసుభగవానుని దివ్యమంగళ విగ్రహం తప్ప ఏమీ కన్పించటం లేదు. ఎప్పుడు చర్చి కెళ్ళిందో - మాస్ ప్రేయర్ ఎప్పుడు పూర్త యిందో - తనెప్పుడు తిరిగి యింటికి వచ్చిందో ఆమెకే తెలియదు!

బాబు గుక్క తిప్పుకోకుండా ఏడుస్తున్నట్లు విన్పించ గానే ఒక్కసారిగా ఆమెలోని మాతృమూర్తి మేల్కొంది.

గభాలున మంచం వద్ద వెళ్ళి బాబు కోసం చూసింది. కాని, అక్కడ బాబు లేడు.

ఆమె చర్యలన్నీ గమనిస్తున్న కళ్యాణి లోలోన ఎంతో బాధపడింది. బాబును తను ఎత్తుకొని పాలుపట్టిస్తున్న సంగతి కూడా తెలియని స్థితిలో ఆమె వుండటం చూశాక మరింత దిగులు పడింది.

"మార్గరెట్ ! యిటు చూడు" అంది ఆమె దగ్గరగా నడిచి.

పరితాపంతో కుమిలిపోతున్న మార్గరెట్ గిరుక్కున వెనుతిరిగింది. కళ్యాణి చేతుల్లో వున్న బాబును గభాలున అందుకొని తన గుండెల కేసి అదుముకుంది.

"బాబూ ! ఏడుస్తున్నావా ? ఏడవకమ్మా!... నేను యిక్కడే వున్నాగా...ఏడ్వకు..." అంటూ ఆ పిల్లవాడిని మాటిమాటికీ తన గుండెలకు హత్తుకో సాగింది.

ఆ సంఘటన చూసిన కళ్యాణి యిహ ఆగలేక పోయింది. చప్పున బాబును ఆమె నుండి వేరుపరచి మంచంలో పడుకోబెట్టింది. ఒక్కసారిగా తననుండి బాబును ఆమె తీసుకునేసరికి ఏమీ అర్థంగాక మార్గరెట్ తెల్ల బోయింది.

"రాను రాను నీ ప్రవర్తనలో చాలా మార్పు వస్తోంది మార్గరెట్! ఆ మాత్రం నిన్ను నువ్వు కట్టుదిట్టం చేసుకోలేకపోతే ఎలా? కష్టాలు అందరికీ వస్తుంటాయి. అంత

మాత్రంచేత అందరూ నీలాగే తీరని వ్యథతో కుమిలి పోతారను కుంటున్నావా?"

మార్గరెట్ ఏమీ పలకలేదు. శూన్యంలోకి తదేకంగా చూడసాగింది.

"ఇదిగో! నా మాట విను. నువ్వేదో గొప్ప ఆత్మ బలం గలదానివనీ— ఎంతటి కష్టాలనైనా నవ్వుతూ అనుభవించ గలవనీ అనుకున్నాను. కాని, యింత చిన్న విషయానికే తల క్రిందులవుతావనుకో లేదు. బాబుకు త్వరలో నయమౌతుంది. సామాన్యమైన జ్వరానికే యింతగా బెంబేలు పడతావెందుకు? లే. నీ మనస్సును అన్యథా మళ్ళించు. బాబు సంగతి నాకు వదిలిపెట్టు. నీ బాబు అల్లరిచేస్తూ – నవ్వుతూ తిరుగుతున్నాడనే అనుకో."

"ఎలా అనుకోను! నా సర్వస్వం, నా ప్రాణం— నా ఒక్కగా నొక్క బిడ్డ యిలా రేయింబగళ్లు జ్వర తీవ్రతలో సలసల కాగిపోతోంటే ఎలా నా హృదయాన్ని కట్టివేసుకోను? నా ఆవేదన అర్థం కాదు నీకు. నా పంచప్రాణాలూ బాబు పైనే పెట్టుకున్నాను. బాబు కోసమే బ్రతుకుతున్నాను. నా బాబు కోసమే అందరినీ ఎదిరించాను. మతం మార్చుకున్నాను. మనస్సును మార్చుకున్నాను. నా జీవితాన్నే తలక్రిందులు చేసుకున్నాను. నా బాబు...నా బాబు తప్ప యీ ప్రపంచంలో నాకెవ్వరూ లేరు!" అని భోరున మార్గరెట్ ఏడ్వ సాగింది. ఆమె కన్నీళ్ళ వర్షాన్ని చూసేసరికి కళ్యాణి హృదయం వెయ్యి ముక్కలైంది. అప్రయత్నంగా ఆమె కళ్లు సైతం వర్షించాయి.

ఉభయులూ ఏకధారగా కురుస్తున్న కన్నీటి వర్షాన్ని గ్రహించుకోలేక అలాగే ఒకరి దుఃఖంలో మరొకరు పాలుని పంచుకో సాగారు.

చివరకు చాలాసేపటికి కళ్యాణి తన్ను తాను నిగ్రహించుకుంది. ఆ సమయంలో యిహ ఆమె ఏమీ మాట్లాడ లేక పోయింది. నెమ్మదిగా అక్కడి నుండి లేచి వంట గదిలో కెళ్ళి - కాస్సేపైనా అన్నీ మరచి పోయేందుకు వంట ప్రయత్నం గావించింది.

# 7

ఆకాశం మేఘావృతమైంది. దట్టంగా అలుముకున్న కారు మేఘాలు సూర్యాస్తమయం అయినదో, లేదో ననే భ్రాంతి గొల్పుతున్నాయి. అప్పుడప్పుడు మెరుపులు మెరుస్తున్నవే కాని, సన్నటి తుంపరులైనా కురవటం లేదు. ఏ క్షణంలో మేఘాలు వర్షిస్తవో తెలియక పక్షులు గుంపులు గుంపులుగా తమ తమ గూళ్ళకేసి పరుగెత్తిపోతున్నాయి.

సావిత్రి గోడ గడియారంకేసి చూసింది. అప్పటికే టైమ్ ఆరు కావస్తోంది. కుర్చీలోనుండి లేచి డ్రస్ చేసుకుంది. వారం రోజులుగా చదువుతున్నా పూర్తికాని విశ్వనాథవారి 'వేయి పడగలు' పుస్తకం తీసుకొని గది బయటికి నడిచింది. తలుపుకు తాళంవేసి వెను దిరిగేసరికి అకస్మాత్తుగా ఆకాశంలో గొప్ప ధ్వని అయ్యింది. ఆ వెంటనే భీకరంగా ఉరుములు

ఉరమటం- మెరుపులు మెరవటం ప్రారంభమయ్యాయి. అప్పుడప్పుడు ఒకటి రెండు చినుకులూ పడసాగాయి.

ఆమె తలెత్తి ఆకాశంకేసి చూసింది. ఒళ్ళంతా నల్లని ముసుగు కప్పుకున్న మనుష్యుల గుంపువలె- నింగిలో కారు మేఘాలు తారట్లాడుతున్నాయి. అంతు తెలియని ఆకాశంలో ఎక్కడా ఒక్క అరుణ కిరణమైనా కన్పించటం లేదు. ఫెటిల్లు ఫెటిల్లు మని-ఆకాశం విరిగి ముక్క ముక్కలై పోతుందేమో నన్నంత భయం గొల్పేలా ఉరుములు ఉరుము తున్నాయి. ఎక్కడ వర్షించవలెనో మేఘాలకు తెలియ చెప్పేందుకు కాబోలు, ఉరుము శబ్దాలతోపాటు మెరుపులు మెరుస్తూన్నాయి.

సావిత్రి ఆ దృశ్యం చూసి హడలిపోయింది. ఒక్క క్షణంలో ఆకాశంలో దట్టంగా మేఘాలు అలుముకున్నాయి. అలాగే తన జీవితాకాశంలోనూ విచార మేఘాలు ఆక్రమించు కున్నాయి. ఇప్పుడు ఆకాశానికీ, తన హృదయాకాశానికీ ఏమీ భేదం లేదు. రెండూ బరువెక్కి వున్నాయి. కాని, ఆకాశం ఏ క్షణంలోనైనా తన బరువును వదలించుకోగలదు. అయితే, తనీ విచార మేఘాలను ఎక్కడ-ఏవిధంగా కన్నీళ్ళ రూపంగా వదిలించుకోవాలి?

ఆ విధంగా ఆమె తన్నుతాను ప్రశ్నించుకుంటూ ఆస్పత్రివైపు నడవసాగింది. దారిలో డాక్టర్ రఘురామ్ యింటికి పోతూ కన్పించాడు. ఆయన సావిత్రి విష్ నందుకొని చిరునవ్వుతో ముందుకు సాగిపోయాడు.

ఆమె ఆఫీసుకు వెళ్ళి అటెండెన్స్ రిజిష్టర్‌లో సంతకం పెట్టి డ్యూటీలో ప్రవేశించింది. సుధాకర్ గది వద్దకు వచ్చే సరికి ఎదురుగా సంధ్య కన్పించింది.

"హల్లో, సావిత్రీ! నువ్వెప్పుడు వస్తావా అని ఎదురు చూస్తున్నా"నంది సంధ్య ఆమె దగ్గరగా వస్తూ.

సావిత్రి మందహాసం చేసి లోపలికి తొంగి చూసింది. సుధాకర్ పడకపై పడుకొని యథావిధిగా ఏదో ఆలోచనలో మునిగి వున్నాడు. ఆ దృశ్యం చూసి ఆమె యిస్సురని నిట్టూర్చింది.

అంతలోనే "సావిత్రీ!" అని తగ్గు స్వరంలో సంధ్య పిలవగానే వెనుదిరిగింది.

"చూడు సావిత్రీ! ఈ దినమంతా నాకు ఏమీ తోచ లేదు. కంపం పుట్టినట్లుందనుకో. రెండేళ్ళ నుండి యిక్కడ సర్వీస్ చేస్తున్నాను గాని - ఏనాడూ యిలాంటి కేసు చూడ లేదు" అంది సంధ్య.

సావిత్రికి ఆమె మాటల అంతర్థామేమిటో చప్పున బోధపడింది కాదు.

"ఏం జరిగింది, సంధ్యా?" అనడిగింది తాపీగా.

"ఏం జరిగిందని నెమ్మదిగా ప్రశ్నిస్తావేమిటి? చూడు సావిత్రీ! నా సర్వీస్‌లో యిలాంటి పేషెంట్‌నింతవరకూ చూడ లేదు. నాతో మాట్లాడేందుకు యిక్కడికొచ్చే రోగులంతా ఎలా పోటీలు పడేవారని! అసలు నేను కన్పించనిదే మందైనా త్రాగేవారు కాదు. ఆ సంగతి నీకు తెలుసా?"

సావిత్రి వస్తున్న నవ్వు నాపుకొని - "తెలియకేం ! కళ్యాణి చెప్పగా విన్నాను" అంది.

"ఒక్క కళ్యాణే ఏమిటి? ఎవర్నడిగినా ఆ సంగతి చెబుతారు. అంత దూరం ఎందుకు? మన డాక్టర్‌గారు నా సంగతి తెలుసుకొని ఎంతకూ నయం కాని, రోగుల వద్దకు నన్నే పంపేవారు. అదేం చిత్రమో కాని, నేను ఒక్క మాట మాట్లాడేసరికే వాళ్ళ రోగం యిట్టే పోయేది!"

"నిజమే అయ్యుంటుంది. ఇంతకీ అసలు సంగతేమిటి?" అంది చిరునవ్వుతోనే సావిత్రి.

"అదే చెప్పుకొస్తున్నాగా! ఈ పేషంట్ వున్నాడే - యీయన అదో రకమైన మనిషిలా వున్నాడు. ఎన్ని ప్రశ్న లేసినా పలకడేమిటి? నాకు తెలియక అడుగుతాను, యీయన తత్వమే యింతనా, లేక గర్విష్టా?"

సుధాకర్‌ను గూర్చిన విమర్శ వినేసరికి సావిత్రి బాధ పడింది. అయినా, ఆ బాధను తనలో తాను అణచిపెట్టుకొని- "తప్పు సంధ్యా! ఒకరిని గురించి మన మంత త్వరగా ఓ నిర్ణయానికి రాకూడదు. ఆయన గర్విష్టి అయినా- తత్వమే అలాంటిదైనా మనకేమిటి చెప్పు? మనిషి ఎలాంటివాడైనా డ్యూటీ చెయ్యటమే మన వంతు..." అంది.

"అంతేలే! అయినా, యీ సుధాకర్ తత్వం నాకేమీ నచ్చలేదు. ఈ పేషంట్‌తో నువ్వెలా వేగుతున్నావో మరి" అని అదోరకంగా నవ్వింది సంధ్య.

ఆమె నవ్వులోని అర్థాన్ని స్పష్టంగా సావిత్రి అర్థం చేసుకుంది. ఊరకే మాటలు పెంచటంవల్ల ప్రయోజనం లేదనుకొని అక్కడినుండి సంధ్యను పంపించే మార్గం కోసం ఆలోచించసాగింది.

"మబ్బు పట్టింది. వర్షం వస్తుందేమో!" అందామె చివరికి ఏమీ తోచక పోయేసరికి.

"ఛీ! ఛీ! పాడు వర్షం. దీనికి వేళాపాళా తెలిసినట్లు లేదు. ఎప్పుడు పడితే అప్పుడు కురవటమే. అవునుగాని సావిత్రీ! కళ్యాణి ఎప్పుడు వస్తుందో నీకేమైనా తెలుసా?"

"ఊహుఁ!"

"అబ్బ! ఒక్క దినానికే నాకు వల్లమాలిన విసుగు కల్గిందనుకో. పాపం- నువ్వూ, కళ్యాణీ యీయనతో ఎలా వేగుతున్నారో మరి?" అని తిరిగి నవ్వింది సంధ్య.

సావిత్రికి ఆమె మాటలు రానురాను వెగటు పుట్టించ సాగాయి. ఇహ సహించలేకపోయిం దామె.

"వర్షం రాబోతోంది. నువ్వెళ్లు- గుడ్ నైట్!" అంటూ ఆమె గబగబా గదిలోపలికి దారి తీసింది.

అంత అకస్మాత్తుగా సావిత్రి వెళ్ళిపోవటంతో సంధ్య ముఖం చిట్లించుకుంది. అదోరకమైన జుగుప్సతో కాలి జోళ్ళను గట్టిగా చప్పుడు చేసుకుంటూ చేసేదేమీ లేక అక్కడినుండి క్వార్టర్స్ వైపు వెళ్ళిపోయింది.

సావిత్రి గదిలోపల అడుగుపెట్టగానే ప్రళయ భయంకరంగా ఆకాశంలో ఉరుము ఉరిమింది. ఆమె దాని గర్జనకు

క్షణకాలం నివ్వెరపోయి- ద[illegible]డల్ని చిక్కబట్టుకుంటూ సుధాకర్ పడక వద్దకు చే[illegible]ంది.

అదే సమయంలో ఉరుము శబ్దానికి త్రుళ్ళిపడి లేచాడు సుధాకర్. ఎదురుగా కన్పించిన సావిత్రిని చూడగానే అతని ముఖ మండలంలో సంతృప్తి గోచరమైంది.

"ఇప్పుడే వచ్చావా?" అనడిగాడు.

"ఔనండి. సాయంకాలం వేళ నిద్రపోతున్నా రేమిటి?" అంది సావిత్రి.

"నిద్ర కాదు, నటన."

"దేనికండీ?" నవ్వుతూ అడిగిందామె.

"ఈ ఆస్పత్రిలోని నర్సులందరూ వింత ప్రవృత్తి గల వారిలా కన్పిస్తున్నారు. అందరూ నన్ను గురించి గుచ్చి గుచ్చి ప్రశ్నించట మెందుకో అర్థం చేసుకోలేక పోతున్నాను. ఉదయం నుండి డ్యూటీ వెలిగించిన ఆ అమ్మాయి ప్రశ్నలతో నా ప్రాణం తిన్నది...కొన్ని గంటలపాటు ఆ అమ్మాయిని భరించటమే కష్టమయింది నాకు."

"మీరు మాట్లాడుతున్నది సంధ్యను గురించేనా?"

"ఔను."

"సంధ్య చాలా తెలివిగలది. ఇంటర్ దాకా చదువు కున్నది. అయితేనేం పాపం, అమాయకురాలు. అందరి బాగో గులు తెలుసుకోవాలని ఉబలాట పడుతుంటుంది. అందుకే కాబోలు మిమ్మల్ని గుచ్చి గుచ్చి ప్రశ్నించి వుంటుంది..."అని నవ్వింది సావిత్రి.

"నా మటుకు నాకు, ఆ అమ్మాయి మాటలతో రోగుల ప్రాణం హరించేలా కన్పించింది."

"అలా అనకండి. ఆమె తత్వమే అంత. మాటకారి కావటం వల్ల వేసిన ప్రశ్ననే తిరిగి మార్చి మార్చి అడుగుతుంటుంది. అంత మాత్రానికే విసిగిపోతే ఎలా చెప్పండి? కేవలం మందులతోనే రోగుల ఆరోగ్యం బాగుపడదనీ-వాళ్ళకు మనశ్శాంతి, సంతృప్తి కల్గించటం వల్ల రోగం నయం కావచ్చనే సిద్ధాంతాన్ని సంధ్య విశ్వసిస్తోంది. అందుకే మీ యెడ ఆ విధంగా ప్రవర్తించి వుంటుంది. సరేగాని మీరు మందు త్రాగారా?"

"ఆఁ! నువ్వు వచ్చేముందే ఆ అమ్మాయి యిచ్చింది. త్రాగాను. ఈ దినం మందు మార్చినట్లుంది."

"అవును..." అని సావిత్రి అంటూ వుండగానే గది బయట సవ్వడి అయ్యింది. ఆమె వెనక్కి తిరిగి చూసే సరికి డాక్టర్ రఘురామ్ భార్య శశికళ, కూతురు బేబీ లోపలికి రావటం జరిగింది.

అకస్మాత్తుగా శశికళ రావటం చూసి- సావిత్రి ఏవిధంగానూ ఊహించుకోలేకపోయింది. అప్రయత్నంగా ఆమె దృష్టి సుధాకర్ వైపు మళ్ళింది. అతని కళ్ళల్లో మునుపటి ఉత్సాహం అంతరించింది. శూన్యంగా శశికళ కేసి, బేబీ కేసి చూస్తున్నాడతను.

వాళ్ళిద్దరి మధ్యా గల సంబంధ బాంధవ్యాలేమిటో

అర్ధాంగాక సావిత్రి ముందుకు నడిచింది. అదే సమయంలో శశికళ బేబీని వెంటబెట్టుకొని సుధాకర్‌ను సమీపించింది.

ఉభయులూ చాలాసేపు మాట్లాడుకోలేదు. సుధాకర్ బేబీవైపు మౌనంగా చూస్తూ కూర్చున్నాడు. శశికళ అక్కడున్న స్టూల్‌ను దగ్గిరగా జరుపుకొని కూర్చుంది.

సావిత్రి ఆ దృశ్యం చూసి చలించిపోయింది. ఆమె ఎటూ ఆలోచించుకోలేక తప్త హృదయంతో గది బయటికి నడిచింది.

బేబీకి సైతం ఆ యిద్దరి మూగ సంభాషణ అర్థం కాలేదు. తల్లి చెయ్యి పట్టుకుని—

"మమ్మీ! ఎవరే యీాయన?" అనడిగింది.

అంతవరకు ఏవో ఆలోచనల్లో మునిగివున్న శశికళ ఆ ప్రశ్నతో తేరుకుంది. బేబీని దగ్గరగా జరుపుకుంటూ—

"వీరు మీ చిన్నాన్నగారమ్మా!" అంది.

బేబీకి తల్లి సమాధానం రుచించలేదు. వింతగా ఓ మారు అతనికేసి చూసింది.

"మమ్మీ! నాన్న నాకు చిన్నాన్న వున్నాడని ఎప్పుడూ చెప్పలేదే?" అని కొంటెగా ప్రశ్న వేసిందా బాలిక.

"నేను యిప్పుడు చెబుతున్నాగా! చిన్నాన్నగారికి నమస్కారం పెట్టు..."

బేబీ తల్లినుండి ప్రక్కకు జరిగి పడకపై కూర్చుంది. సుధాకర్‌కేసి చూస్తూ—

"నమస్కారమండీ!" అంది.

ఆ బాలిక ఎప్పుడైతే అతనికి నమస్కరించిందో యిహ అతని హృదయావేదన ఆగలేకపోయింది. ఆ ఆవేదన తిరిగి కన్నీళ్ళ రూపంలో బయటపడింది.

"మమ్మీ! చిన్నాన్నగారు ఎందుకే ఏడుస్తున్నారు?" అనడిగింది బేబీ.

"ఆ సంగతి నేను కాదమ్మా చెప్పవలసింది, మీ చిన్నాన్ననే అడుగు" అంది శశికళ.

అంతటితో ఆ బాలిక ఊరుకోలేదు. అతని మెడపై చేతులు వేసి–

"చిన్నాన్నా! ఎందుకేడుస్తున్నావ్?" అంది.

బేబీ పలుకులతో సుధాకర్ నిశ్చల మనస్కుడుగా లేకపోయాడు. ఆ బాలికను తన గుండెలకేసి హత్తుకొని రెండు క్షణాలు కళ్లు మూసుకున్నాడు.

గది బయటినుండి ఆ దృశ్యమంతా అలకిస్తున్న సావిత్రి కళ్ళు సజలపూరితా లయ్యాయి. 'ఆకాశం ఎందుకు వర్షించబోతోంది? సుధాకర్ కళ్ళు దేనికి వర్షిస్తున్నాయి?' అని తన్ను తాను ప్రశ్నించుకుం దామె.

'బరువెక్కిన అతని హృదయం కన్నీళ్ళ రూపంగా వర్షించక ఊరుకోవటం సాధ్యమా? మేఘావృతమైన ఆకాశం వర్షించక, అంతటి బరువును ఎన్నాళ్ళని సహించగలదు?' అని తనలోని ప్రశ్నలకు సమాధాన మిచ్చుకుంది.

"నాతో మాట్లాడకూడదని శపథం పలికావా?" అని ప్రశ్నించింది చాలాసేపటికి శశికళ, అతనిని.

ఆ ప్రశ్నతో తలెత్తి ఆమె కళ్ళల్లోకి దీనంగా చూశా డతను. దీపకాంతుల్లో ఆమె కళ్ళు సైతం వర్షిస్తున్నాయని గుర్తించేసరికి- వెయ్యి సమ్మెటలతో గుండెలను బాదు తున్నట్లు అన్పించిం దతనికి.

"హుఁ! శపథం!! నా జీవితంలో నేను చేసింది ఒక్క— శపథం మాత్రమే. కాని, నా శపథమే నన్ను వెక్కిరించింది. ఆ శపథమే యీనాడు నన్ను యిన్ని విధాలుగా చిత్రహింస చేస్తోంది" అన్నాడు ఉద్రేకంగా సుధాకర్.

"విధి నీయెడ చిన్నచూపు చూసింది సుధా! అంత మాత్రానికే దిగులుపడి కృంగిపోతున్నా వెందుకు?"

"నా బాధల గాథను ఏమని చెప్పుకోను శశీ! అను క్షణమూ ఆరాటంతో కృంగిపోయేకన్నా నేను చేయగల్గిం దేమిటో చెప్పు!"

"స్థైర్యంతో జీవిత పోరాటంలో గెలవమంటాను."

"ఎవరికోసం స్థైర్యం? దేనికోసం పోరాటం?"

"పిచ్చి సుధా! జీవితమంటే యింతే ననుకున్నావ్ కాబోలు! దుర్బలత్వంతో నిన్ను నువ్వు వంచించుకోవటం మంచిది కాదు. నువ్వే అపరాధం చెయ్యలేదని నాకు స్పష్టంగా తెలుసు. విధి కఠోర దంష్ట్రలకు బలియైన నీ జీవితంలో అలాగే అంతరించి పోకుండా కాపాడుకోవలసిన ధర్మం నీకుంది."

"ధర్మం! ధర్మం!! ఈ ప్రపంచంలో ఎక్కడా ధర్మ చింత లేదు శశీ! న్యాయ ధర్మాల పేరాట సర్వనాశనం జరుగు

తోంది. న్యాయమని, ధర్మమని అందరూ కలిసి నా జీవితాన్ని ఏం చేశారు?''

''ఈ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను.''

''నువ్వే కాదు శశీ! హృదయమంటూ వున్న ఎవ్వరైనా నాకు జరిగిన అన్యాయాన్ని వింటే ఏమీ పలకలేరు. నాలోని ఆవేదన ఎన్నెన్ని రూపాలుగా నన్ను క్షోభ పెడుతోందో నీ కెలా వివరించి చెప్పను?''

''పరిస్థితి నంతా అర్థం చేసుకున్నాను. ఈ నీ స్థితికి కారణ మేమిటో తెలుసుకున్నాను. జరిగిందేదో జరిగిపోయింది. ఇహానైనా భవిష్యత్తును గూర్చి ఆలోచించుకో.''

''లేదు నాకిక భవిష్యత్తు! ఆ ఆలోచనే నాలో లేదు శశీ!''

ఆ సమాధానంతో శశికళ గాఢంగా నిట్టూర్పు విడిచింది. గది బయట నిల్చొని ఆ యిద్దరి సంభాషణ వింటున్న సావిత్రి చెక్కిళ్ళపై కన్నీటి వర్షం కురుస్తోంది. ఆమె చేతి రుమాలుతో కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో అలాగే అక్కడే నిల్చుండి పోయింది. అంతలో ఆమెకు తిరిగి శశికళ మాటలు విన్పించాయి.

''నా మాట విను సుధా! ఎందుకిలా నిన్ను నువ్వు వంచించుకుంటావ్? ఎన్నాళ్ళని రాధను గూర్చి ఆలోచిస్తూ ఆరాటపడతావ్? ఆత్మాభిమానం గల రాధ యింత కథ జరిగాక యింకా జీవించే వుంటుందా? ఒకవేళ జీవించే వున్నా యిన్నాళ్ళూ నీ కంటబడకుండా అజ్ఞాతంగా ఎందుకు వుంటుంది?''

"రాధ! నా రాధ నువ్వనుకున్నంత నీచకృత్యానికి పాల్పడి వుండదు శశీ! నాకోసం గాకపోయినా తన కడుపులోని బిడ్డకోసమైనా తప్పకుండా జీవించి వుంటుంది."

"రాధ జీవించే వుందనుకో! అయితే నువ్వు విదేశాల నుంచి తిరిగి వచ్చావని తెలిసికూడా ఎందుకు రాలేదు?"

"నా రాధ హృదయం నీకు అర్థంకాదు శశీ! అభిమానవంతురాలు ఆమె. ఆ నిష్కళంక హృదయాన్ని అపనిందల గాయాలతో తూట్లు తూట్లు పొడిచింది మా కుటుంబం. ఆచారం పేరిటా- కులం పేరిటా- అంతస్థు పేరిటా నా రాధను నిలువునా హత్య చేశారు; నా బ్రతుకును బండ చేశారు. అవమాన భారంతో ఆమె కృంగిపోయి వుంటుంది. ప్రపంచం మీదా- మనుష్య జాతిమీదా- సమాజంమీదా ద్వేషాన్ని పెంచుకొని వుంటుంది. సమస్త ఆశలనూ, ఆశయాలనూ త్యజించి ఏకాకిగా వెళ్ళివుంటుంది. అందుకే ఎన్ని గ్రామాలు, పట్టణాలు, నగరాలు శోధించినా ఆమె దర్శనం లభ్యం కాలేదు. ఎన్నిమార్లు పత్రికల్లో ప్రకటనలు వేసినా ఆమె నన్ను చేరుకోలేదు. తప్పదు శశీ, నాకీ చిత్రవధ! తల్లిదండ్రులు చేసుకున్న పాప-పుణ్యాల ఫలాన్ని యీనాడు, యీ రూపంగా అనుభవిస్తున్నాను నేను. ఇహ ఏనాటికీ నా రాధ నన్ను చేరుకోదు. ఈలాగే ఆరాటంతో- ఆవేదనతో ఆక్రోశించి అనుక్షణమూ మరణిస్తూ వుండమని నా రాధ నన్ను శపించిందేమో! ఎలా భరించను యీ దుర్భర జీవితాన్ని శశీ, నే నెలా భరించను?" అంటూ ఉద్వేగంతో సుధాకర్ చిన్న

పిల్లవాడివలె భోరున ఏడ్వసాగాడు. బేబీకి వాళ్ళ సంభాషణ సారాంశ మేమిటో అర్థంగాకపోయినా ఆ బాలిక కళ్లుకూడా అశ్రుపూరితా లయ్యాయి.

శశికళ ముఖం చాటుచేసుకొని పయిటచెరగుతో కళ్ళ నీళ్లు తుడుచుకుంది. సావిత్రికూడా వస్తున్న దుఃఖాన్ని ఆపుకో లేక చేతి రుమాలుతో నోరు నొక్కుకుంది.

అదే సమయంలో ఆకాశం బ్రద్దలైనంత గొప్ప శబ్ద మైంది. ఉరుములు, మెరపులు క్షణకాలం ఆకాశంలో తళతళ లాడాయి. చూస్తూ చూస్తూండగానే వడగండ్ల వర్షం ప్రారంభ మైంది. ఒక వైపు బ్రహ్మాండంగా గాలి వీస్తుంటే చెట్లు కొమ్మలు అప్పుడో యిప్పుడో విరిగి క్రిందికి కూలి పోతవేమో అన్నట్లున్నాయి.

సావిత్రి ప్రకృతి విజృంభణ చూసి నిరుత్తరురాలైంది. హృదయ విదారకమైన సుధాకర్ స్థితికి ఆమె హృదయం గోలుగోలున ఏడ్వసాగింది. క్రమక్రమంగా ఆమెకు సుధాకర్ జీవిత మేమిటో - అతని మానసిక క్షోభకు కారణ మేమిటో అర్థం కాసాగింది. ఆ పవిత్ర ప్రేమికుని విషాద గాథ కొక రూపాన్ని తన మనస్సులో రూపొందించుకునే కొద్దీ ఆమెకు సర్వ ప్రపంచంపై కఠోరమైన ప్రతీకారం తీర్చుకోవాలనిపించే ఉద్దేశ్యం కల్గసాగింది.

ఎవరి ఆలోచనలతోనూ నిమిత్తం లేనట్లుగా మేఘాలు కుంభవోతగా వర్షిస్తున్నాయి. ఆస్పత్రి పరిసరమంతా కటిక చీకటి ఆవరించి వుంది. అప్పటికే కురిసిన వర్షంవల్ల బాటలన్నీ

జలమయ మయ్యాయి. గాలి యిటు వీచినపుడల్లా సావిత్రి ముఖంపై జల్లు పడుతోంది. కన్నీళ్ళతోపాటు ముఖంపై పడుతున్న ఆ జల్లును కూడా ఆమె తుడుచుకోసాగింది.

గది లోపల నిశ్శబ్దం రాజ్యమేలుతోంది. బేబీ ఒక్కోమారు తల్లి వైపు వింతగా చూస్తూ అలాగే పడకలో కూర్చుంది. మాయా మర్మాలు—సామాజిక క్రూర చర్యలు—సనాతనాచారాల దుష్ఫలితాలు ఎరగని ఆ బాలిక—నిండైన రెండు హృదయాల మనోవేదనను ఎలా అర్థం చేసుకోగలదు?

చాలాసేపటికి శశికళ దుఃఖం నుండి తేరుకుంది. ఏ విధంగా సుధాకర్‌ను అనునయించాలో ఎంతగా ఆలోచించినా ఆమెకు బోధపడలేదు. లేచి కిటికీ దాకా వెళ్ళి తలుపులు వేసింది. తిరిగి వచ్చి స్టూల్ మీద కూర్చుంటూ—"సుధా!" అని పిలిచింది.

అతను ఏమీ పలకలేదు. మోకాళ్ళ మధ్య తలపెట్టి శోక సముద్రంలో మునిగివున్నాడు.

"సుధా! యిటు చూడు. నా మాట విను" అందామె తిరిగి.

కాని, ఆమె ప్రయత్నం సఫలం కాలేదు. అతను వంచిన తల ఎత్తలేదు.

"ఆత్మస్థైర్యం లేని ఆడవాళ్లు ఏడ్వటంకన్నా ఏమీ చెయ్యలేరు. కాని, ఆత్మబలంగల మగవాళ్లుకూడా కంటతడి పెట్టటం నేనెప్పుడూ చూడలేదు. నీ మనస్సును మార్చుకో. క్రొత్త జీవితం ప్రారంభించు. రాధతో నువ్వు గడిపిన దినా

లను మరచిపొమ్మని నేను చెప్పటంలేదు. కాని, ఆ జ్ఞాపకా
లతో సతమతమౌతూ- ఆరోగ్యాన్ని కృంగదీసుకోకు. నిన్ను
నువ్వే కఠినంగా శిక్షించుకోకు. నా మాట విను సుధా! ఇంత
కన్నా నేనేమీ చెప్పలేను'' అంది శశికళ గద్గదస్వరంతో.

''నాకోసం నువ్వేమీ ఆవేదనకు లోనుగాకు శశీ! నేను
పూర్తిగా పరాజితుణ్ణి అయ్యాను. శాపగ్రస్తుడ నయ్యాను.
జీవితంతో పోరాడలేక అలిసిపోయాను. నువ్వే గాదు, యిహ
నన్నెవ్వరూ మార్చలేరు... నా ఆరాటాన్ని తీర్చలేరు'' అన్నా
డతను నెమ్మదిగా దుఃఖంనుండి తేరుకుంటూ.

ఆ సమాధానంతో శశికళ పూర్తిగా నిరుత్సాహ
పడింది. ఆమె ఆశలన్నీ, సంకల్పాలన్నీ మొదలు నరికిన వృక్షం
వలె కూలిపోయాయి.

ఎడతెగక కురుస్తున్న వర్షం చాలాసేపటికి తెరిపి
యిచ్చింది. బేబీ మంచంలోనుండి లేచి శశికళను సమీ
పించింది.

''మమ్మీ! నీ కళ్లు ఎర్రగా వున్నాయి. చిన్నాన్న
ఏడుస్తున్నాడు. నువ్వూ ఏడ్చావా మమ్మీ! ఎందుకే మీ
యిద్దరూ ఏడుస్తున్నారు?'' అని అమాయకంగా ప్రశ్నించిం
దా బాలిక.

శశికళ సమాధానం చెప్పలేకపోయింది. అక్కడి
నుండి లేచి బేబీని ఎత్తుకుంది.

''పాపా! చిన్నాన్నకు నమస్కారం పెట్టు. మనం
వెళ్ళిపోదాం'' అందామె.

బేబీ సుధాకర్ కు నమస్కారం పెడుతూ-

"మమ్మీ! చిన్నాన్ననికూడా మన యింటికి తీసుక పోదామే!" అంది.

"వద్దమ్మా! ఆయన ఎక్కడికీ రారు. ఆయన సర్వస్వం, ఆరవ ప్రాణం కన్పించేవరకూ మనమెన్ని చెప్పినా విన్పించుకోరు... ఆయన కిక ఆయనే తోడు నీడ. మన చేతుల్లో ఏమీ లేదమ్మా!" అని పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పోయిందామె.

ఆ తర్వాత ఒక్క క్షణమైనా శశికళ అక్కడ వుండలేక పోయింది. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ బేబీతోసహా గది బయటికి నడిచింది.

ఆవేదనాభరిత హృదయంతో బరువెక్కిన ఆ సహృదయురాలు బాటమీదుగా నడిచిపోతూంటే- విషాదంగా అటు చూసింది సావిత్రి. అప్రయత్నంగా ఆమె రెండు చేతులూ జోడించబడి ఆ సౌజన్యశీలికి నమస్కరించాయి.

# 8

రాత్రి చాలాకాలం గడిచిపోయింది.

కళ్యాణి బరువెక్కిన హృదయంతో ఏమీ చెయ్యలేక బాబు ప్రక్క కూర్చుంది. మార్గరెట్ చీరెచెరగు పరచుకొని నేలపై పడుకొంది. అప్పుడప్పుడు ఆమె గాఢంగా నిట్టూర్చటం వల్ల యింకా నిద్రపోలేదని కళ్యాణి తెలుసుకుంది. తిరిగి ఆమె ఆలోచనలన్నీ మార్గరెట్ ను గురించే మెదలసాగాయి.

మూడు సంవత్సరాల క్రితం బాబు కడుపులో వుండగా మార్గరెట్‌తో తనకు గాఢమైన పరిచయం కల్గింది. ఆనాటి నుండీ తనామె ప్రవర్తనను గమనిస్తూనే వుంది.

మార్గరెట్ నిజంగా సాధుశీలి. పరిపూర్ణమైన యవ్వన వతి. గొప్ప సౌందర్యవతి. అంతేగాక యితరుల కష్టాలను చూసి సహించలేని సహృదయురాలు. ఒకరిపై నిందా వాక్యాలు పలకటం గాని- దూషించటం గాని ఎలాంటిదో ఎరుగని సౌజన్యమూర్తి.

అలాంటి మార్గరెట్‌కా యిన్ని దుఃఖాలు, కష్టాలు? భగవంతుడు ఎప్పుడూ మంచివాళ్ళకు తోడునీడగా వుంటా డంటారు. కాని, యీామె విషయంలో ఏం జరిగిందీ? బాబు తండ్రి ఎవరో, ఆమె జీవితకథ ఏమిటో ఎన్నిమార్లు అడిగినా చెప్పలేదు. తనెందు కింత దుఃఖాన్ని భరిస్తోందో- ఏ పరిస్థితుల ప్రాబల్యానికి తల వొగ్గి యీ దుర్భర జీవితాన్ని కొనితెచ్చు కుందో చెప్పలేదు. తన బాధ లేమిటో- జీవితంలో ఏ గొప్ప వస్తువును పోగొట్టుకొని యీావిధంగా కృంగి కృశించిపోతోందో- కనీసం హృదయంలోని బరువును తొలగించుకొనేందుకైనా బయటపెట్టలేదు. ఎందుకింత ఆవేదనను యీామె భరిస్తోంది?ఇంత చిన్న వయస్సులో అన్ని సుఖాలకు దూరమై-అందరినీ వదులు కొని నిర్జీవంగా బ్రతుకుతోంది! వాంఛలు, యవ్వనపు కోర్కెలు పొంగి పొర్లవలసిన యీ వయస్సులో అనుక్షణం విషాదా ద్భాధిత హృదయంతో దేనికి కృంగి పోతోంది? ఈమె జీవితం యింత అధోగతి పాలయ్యేందుకు కర్త లెవరు? బాబును

యీమెకు ప్రసాదించిన ఆ అజ్ఞాత వ్యక్తి ఎవరు? అందరికీ దూరమై - సమస్త భోగాలను విడనాడి జీవచ్ఛవంగా యిలా బ్రతకమని యీమెను శపించిన వారెవరు?

నర్సింగ్ హోమ్‌లో చేరిన క్రొత్త పేషెంట్ కూడా యీమెలాగే విచారవదనంతో - వేదాంతం మాట్లాడు తుంటాడు. వీళ్ళంతా ఎందుకిలా దిగజారి పోయారు? దేన్ని సాధించేందుకు? తెలిసి తెలిసీ దుఃఖ సముద్రంలో పడి పతనమై పోతున్నారు. జీవితమంటే ఏమిటో అర్థం కాదా వీళ్ళకి? కష్ట కాలం వచ్చినప్పుడు ఆత్మబలంతో ముందుకు సాగలేక ఎక్కడి వారక్కడే ఆగిపోయి కృంగి పోవటం దేనికి? ఆశల్ని పెంచుకో లేరా? జీవితంపై విశ్వాసముంచలేరా? గతాన్ని విస్మరించి భవిష్యత్తును పునరుద్ధరించుకోలేరా? సమస్త ఆశలనూ విడనాడి ఎందుకిలా పరాజితు లవుతున్నారు వీళ్లు?

ఆ రాత్రి ఎన్ని విధాలుగా ఆలోచించినా ఆమెకు జీవిత మంటే ఏమిటో - మనుష్యులు ఎందుకిలా విషాదంతో అల మటించి పోతారో అర్థం కాలేదు.

కళ్యాణి తన ఆలోచనల్లో తానుండగా నెమ్మదిగా మార్గరెట్ కళ్లు విప్పి చూసింది. కళ్యాణి శూన్యంలోకి చూస్తూ - దీర్ఘంగా ఆలోచిస్తున్న దృశ్యం ఆమె కంటబడగానే మనస్సు చివుక్కుమంది.

''కళ్యాణీ! ఇంకా నిద్రపోలేదా?'' అనడిగింది.

అందుకామె ఏమీ బదులు పలకలేదు. విషాదంగా నవ్వి ఊరకుంది.

"చాలా ప్రొద్దు పోయింది. నువ్వు పడుకో. బాబు లేస్తే మందు యిస్తాను" అంది తిరిగి మార్గరెట్.

"ఆస్పత్రిలో నెలల తరబడి నైట్ డ్యూటీ చేసి నాకు నిద్ర కాయటం బాగా అలవాటయింది. నువ్వు పడుకో. తెల్లారి స్కూలుకు వెళ్ళాలిగా" అంది కళ్యాణి.

"నా బాధల్ని నేనొక్కతెనే భరించక – నిన్నూ కష్ట పెడుతున్నాను కళ్యాణీ!" అంది విచారంగా మార్గరెట్.

"పిచ్చిదానా! నిన్నెట్లా అర్థం చేసుకోవాలో నాకు బోధపడకుండా వుంది. ఇందులో నువ్వు నన్ను కష్టపెడుతున్న దేమిటి?"

"లేదు కళ్యాణీ! నీను నేను చాలా విధాలుగా ఋణ పడి వున్నాను. నీ ఋణం ఎలా తీర్చుకోను?"

"ఇదిగో! యిలాంటి పిచ్చిమాటలే మాట్లాడకు. ఒకరి కష్టసుఖాల్లో మరొకరు పాలు పుచ్చుకున్నంత మాత్రాన ఎలా ఋణపడిన వారవుతారు? అయినా, నాకు తెలియక అడుగు తాను, ప్రతి చిన్న విషయానికి నువ్వెందుకింత దీర్ఘంగా ఆలో చిస్తావ్? జీవితం మీాది అనంతమైన ప్రశ్నలతో అనుక్షణం ఎందుకు ఆరాటపడతావ్?"

"ఏం చెప్పను కళ్యాణీ! నా జీవితమే తలక్రిందులైంది. నన్ను నన్ను గాకుండా చేసిన విధి క్రూర చెయిదానికి తల వొగ్గి దుఃఖ భాజనురాల నయ్యాను."

"మాటి మాటికీ విధిని ద్వేషిస్తావెందుకు?"

"అంతకన్నా నేనేమీా చెయ్యలేను గనుక!"

"అక్కడే నువ్వు పొరబడుతున్నావ్ మార్గరెట్! నీకు భగవంతునిపై విశ్వాస ముందా, లేదా?"

ఆ ప్రశ్నతో మార్గరెట్ గాఢంగా నిట్టూర్చింది.

"ఈ పరిస్థితుల్లో నాకు భగవంతునిపై విశ్వాస మున్నా ఒకటే - లేకున్నా ఒకటే! అన్న ఆశలకూ నాలోనే సమాధి గట్టుకున్నాను. దేనికోసమని నేనిప్పుడు సర్వేశ్వరునిపై విశ్వాసం ప్రకటించను?"

"తప్పు మార్గరెట్! అలా అనకు. నీ ఆశలు ఫలించ లేదని సర్వాంతర్యామిపై అవిశ్వాసం ప్రకటిస్తావా?"

"ఏం చెప్పను కళ్యాణీ, నాలోని బాధల గాథను! ఎన్ని రాత్రులని యిలా ఒంటరిగా ఏసుభగవానునికి నా కన్నీళ్ళ గాథను చెప్పుకున్నానో నీకేం తెలుసు? బాబు కోసం బ్రతుకు తున్నాను గాని, లేకపోతే ఏనాడో యీ బ్రతుకు చాలించి వుండేదాన్ని."

"ఛీ! ఛీ! ఏమిటా మాటలు? కష్టాలు కల్గినప్పుడే కాఠిన్యం వహించాలి. మనస్సును బండ చేసుకొని జీవిత పోరాటంలో ముందుకు సాగిపోవాలి."

ఆ తర్వాత మార్గరెట్ ఏమీ మాట్లాడలేక పోయింది. ఆమె హృదయంలో సుడిగుండాలు తిరగసాగాయి. గత స్మృతులన్నీ మనఃఫలకంపై మెదల నారంభించాయి. అపూర్వ స్మృతులను స్పష్టంగా మనోనేత్రంతో చూస్తూ క్షణకాలం సర్వ ప్రపంచానికి దూరమైంది.

ఆమె పరిస్థితిని పూర్తిగా అవగాహన చేసుకున్న కళ్యాణి యింకేం మాట్లాడించలేదు. బాబు గాఢంగా నిద్ర పోతూండడం చూసి- తనూ నేలపై బెడ్ పరచుకొని పడు కుంది. ఉదయంనుండి బాగా అలసిపోయిందేమో, కళ్ళు మూయగానే ఎప్పుడో నిద్రపట్టింది.

చాలాసేపటికి మార్గరెట్ గతస్మృతులనుండి మేల్కొంది. కళ్యాణి నిద్రాదేవి ఒడిలో వాలివుండటం-బాబు నిశ్చలంగా కళ్ళు మూసుకొని నిద్రపోతూ వుండటం ఆమె చూసింది. నెమ్మదిగా అక్కడినుండి లేచి మంచంపై కూర్చుంది. బాబు తల నిమురుతూ తదేకంగా ఆ బాలుని రూపురేఖలను చూడసాగింది.

బాబును చూసేకొద్దీ తిరిగి ఆమె మనస్సు కలవరపడ సాగింది. అప్రయత్నంగా ఆమె కనుకొలకులనుండి కన్నీటి బిందువులు చెక్కిళ్ళ మీదుగా జాలువారాయి. పయిట చెరగుతో వాటిని తుడుచుకొని- అలాగే బాబు శిరస్సును ముద్దుపెట్టుకుంది.

అప్పటికి ఠాణాలో మూడు గంటలు కొట్టారు. ఆమె మంచంలోనుండి లేచి పూజా మందిరానికి నడిచింది. అక్క డున్న ఏసు భగవానుని చిత్రపటానికి వణికిపోతున్న రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

'భగవాన్! నా మనస్సు మహా అల్లకల్లోలమై వున్నది. ఎందు కింత ఆవేదన నాకు? జీవిత సమస్య నా కళ్ళ ముందు భయంకరంగా నిల్చొని వికటాట్టహాసం చేస్తోంది.

ఏమని ఆలోచించుకుందును? ఏవిధంగా యీ సమస్యను పరిష్కరించుకుందును?

'నాలో గుప్తమైన యీ జీవిత రహస్యం ఎన్నాళ్లు యీవిధంగా నన్ను చిత్రహింసపాలు చేస్తుంది? భగవాన్! ఎందుకు స్వామీ, నాకీ పరీక్ష? నే నే నేరం చేశానని యింత గొప్ప శిక్ష విధించావ్?

'నా జీవితానికి మనశ్శాంతి అనేదే లేకుండా చేసిన నిన్ను గురించి ఏమని తలపోయను? ఇది నాకు శాపమా? లేక- ముందు నాకూ నా బాబుకూ రాబోయే ఆపదలనూ, అవమానాలనూ భరించేందుకు తగిన మనస్థైర్యాన్ని నాలో రేకెత్తించే ఉద్దేశ్యమా?

'ప్రభూ! నీ నిర్ణయం నాయెడ ఏవిధంగా వున్నదో తెలుసుకునేందుకు నువ్వు నాకు ప్రసాదించిన యీ జీవితం చాలదు.

'మరి ఎట్లా జీవించను యీ క్షోభతో? మానసికంగా నన్నింత చిత్రహింస చేస్తున్నావే! ఇంతటి గొప్ప బాధతో- కన్నీటి గాథతో ఎలా మనగలనయ్యా?

'నన్నిలా క్షణక్షణము చిత్రహింస చేసేకన్నా - ఒకే మారు చావు కల్పించరాదా! నా అపరాధాలు ఏమని నాకింత కఠినమైన శిక్ష విధించావ్? చేసిన తప్పు లేమిటో తెలియక - అనుభవిస్తున్న దానిని భరించలేక - రాబోయే విషమావస్థలను ఊహించుకోలేక ఎప్పటికప్పుడు మరణిస్తూనే వున్నాను.

'కాని, యిది మరణం కాదు. మరణం మానవులకు ఒకే మారు వస్తుంది. అయితే, నేను ప్రతి క్షణం మరణిస్తూనే వున్నాను.

'ఇహం యీ చావు బ్రతుకుల పోరాటంలో జయించలేను. పూర్తిగా పరాజిత నయ్యాను. నువ్వే నాకిక శరణ్యం! నువ్వు తప్ప నన్నీ స్థితి నుండి ఎవ్వరు కడతేర్చగలరు ప్రభూ!

'నాకు ఆత్మశాంతి ప్రసాదించు. సామాన్య మానవిగా— ఆలోచనలు లేని ప్రాణిగా మార్చివెయ్యి. ఈ ఘోర జీవితాన్ని భరించలేకున్నాను స్వామీ! ఎన్నాళ్లని యీ కష్టాలతో – దుఃఖాలతో పోటీపడి జీవించను?

'నా బ్రతుకు దుర్భరమైంది. నా జీవిత వనం మోడు బారింది. నా హృదయ వీణ పగిలి పోయింది. నాలోని మానవి అస్తమించింది.

'అందుకే యిహ బ్రతకలేను. చావలేక – బ్రతకలేక యీ రెండింటి మధ్యా పడి నలిగి పోతున్నానయ్యా, ప్రభూ!

'నాదింకా పరిణతి నొందని మేధస్సా? లేక, జీవిత నిర్వచనం తెలియని దానినా? అదేదీగాక నిన్ను అర్థం చేసుకోలేని మూఢు రాలినా?

'అయితే, నాకెందుకు ప్రసాదించావ్ యీ జీవితాన్ని? నా గురించిన చింత నాకు ప్రబలమై, ఆవేదనా జ్వాలల మధ్య పడి బూడిద నవుతున్నానే! ఒక్కసారిగా యుద్ధ భూమిలో శత్రువులు చుట్టుముట్టినట్లు – యిన్ని దిగుళ్ళు, బాధలు నన్ను పెనవేసుకున్నవే!

'ఈ దిగుళ్ళు, బాధలూ నన్ను ఊరకే హింసిస్తు న్నాయి కాని, శాశ్వతంగా నా ఊపిరిని చేజిక్కించుకోవటం లేదు.

'ఎన్ని రాత్రులని ఒంటరిగా జీవితం మీాది మమతతో బ్రతకను నేను? నాకిక ఏదారీ లేదా ప్రభూ! నా జీవితం యిలాగే అంతరించి పోవల్సిందేనా?'

అని ఆ భగవంతునితో మొరబెట్టుకుం దామె. కాని, సర్వేశ్వరుడు ఆ దీనురాలి ప్రార్థన ఆలకించాడో, లేదో!

ఆమె పూజా మందిరంనుండి బయటికి వచ్చేసరికి ఠాణాలో నాలుగు గంటలు కొట్టడం విన్పించింది. అప్పటికి కూడా బాబుకు మెళకువ రాలేదు. కళ్యాణి గాఢంగా నిద్ర పోతోంది.

మార్గరెట్‌కు ఏం చేయాలో తోచ లేదు. చాలాసేపు అక్కడ వుండలేకపోయింది. తలుపులు తెరచుకొని రోడ్డు మీాదికి వచ్చింది.

బయట నిర్మానుష్యంగా వుంది. మిషన్ ఆస్పత్రిలో నుండి అప్పుడప్పుడు రోగుల మూలుగు శబ్దాలు విన్పిస్తు న్నాయి. చుట్టూ గాఢాంధకారం ఆక్రమించుకుంది. దూరంగా స్టేషన్‌నుండి తిరిగి వెళుతున్న జట్కాబండ్ల చప్పుడు- కీచు రాళ్ళ ధ్వని తప్ప ఎలాంటి అలికిడి కావటంలేదు.

ఆ నిశ్శబ్ద వాతావరణాన్ని చాలాసేపు భరించలేక పోయిం దామె. కొన్ని క్షణాలైనా తన దుర్భర జీవితావస్థను గూర్చిన చింతనుండి మనస్సును అన్యథా పరివర్తన చేయా

లనుకుంది. నెమ్మదిగా అక్కడినుండి కదిలి చర్చివైపు నడవ సాగింది.

కాని, ఆమె ఎన్ని విధాలుగా మనస్సును నిగ్రహించుకుందామని ప్రయత్నించినా ప్రయోజనం లేకపోయింది. దానికి తోడు ప్రకృతి సైతం వికటాట్టహాసం చేస్తూ ఆమెను భయపెట్టసాగింది.

తన ముందే నిల్చొని రెండు కుక్కలు అదే పనిగా ఏడ్వసాగాయి. దూరంగా నక్కల అరుపులుకూడా విన్పిస్తున్నాయి. క్షణ క్షణానికి అశుభాలు ఎదురయ్యే కొద్దీ ఆమె గుండె ధైర్యం సడలిపోయింది, నరనరాల్లోనూ భీతి ఆవహించి, బేలను చేయసాగింది.

ఇహ ఆమె తన్ను తాను నిగ్రహించుకోలేకపోయింది. గిరుక్కున వెనుదిరిగి గబ గబా యిల్లు చేరుకుంది. అప్పటికి కూడా బాబు నిద్రలేవలేదు. ఆ బాలుని ప్రక్కలో పడుకొని తల నిమురసాగింది. తిరిగి అప్రయత్నంగా ఆమె కనులు వర్షించ నారంభించాయి.

ఆ విధంగా ఆమె శోకిస్తూ గతస్మృతులన్నీ తిరిగి హృదయ ఫలకంపై మెదలగానే, ఆ వేదనతో బాబును గుండెల కేసి హత్తుకుంది.

# 9

శశికళ వెళ్ళిపోగానే సావిత్రి కళ్ళనీళ్లు తుడుచుకుని గది లోపలికి అడుగు పెట్టింది. సుధాకర్ అటు వైపుగా ముఖం

పెట్టి కిటికీగుండా శూన్యంలోకి చూస్తున్నాడు. ఆ పరిస్థితిలో అతను ఎంతో దుఃఖ భాజను డయ్యాడో తెలుసుకునేందుకు ఆమెకు చాలా కాలం పట్టలేదు.

అతని దగ్గరగా నడిచి– "ఏమండీ..." అని పిలిచింది.

ఈ పిలుపుతో అతను వెనుదిరిగి చూశాడు.

"చీకట్లో ఏం కన్పిస్తుందని చూస్తున్నారు?" అని ప్రశ్నించిం దామె.

"నా బ్రతుకే అమవశ అయ్యింది. నా కిప్పుడు చీకటి– వెలుగు రెండూ ఒకటే...ఎటు చూసినా నా కేమీ కన్పిం చటం లేదు..." అని భావగర్భితంగా అత నేదో మాట్లాడ బోయాడు.

అంతలోనే ఆమె అడ్డు తగిలింది.

"ఊరుకోండి–ప్రతి చిన్న సాధారణమైన మాటకు కూడా ఉపమానాలతో సమాధానం చెబుతా రేమిటి? బ్రతుకే భారమైనట్లుగా మాట్లాడతా రెందుకు?..."

"నా ఆవేదన అంత సులభంగా నీకు అర్థం కాదు, సావిత్రీ! నా కష్టసుఖాల్లో జీవితాంతం సమపాలు పంచు కుంటానని ప్రమాణం చేసిన రాధకే నా హృదయం అర్థం కాలేదు–ఇహ ఎట్లా నువ్వు నన్ను అర్థం చేసుకోగలవ్?..."

"మీలోని సుధాకర్‌ను నేను స్పష్టంగా చూడగలుగు తున్నాను. ఎందుకింత మనోబలం లేని వారిలా మీరు తయా రయ్యారో కూడా అర్థం చేసుకున్నాను...ప్రపంచ చరిత్రలో నే నెన్నో ప్రేమగాథలు చదివాను. నిత్యజీవితంలోనూ

చూశాను. కాని, ఎప్పుడూ ఎక్కడా మీలాంటి వారిని చూడలేదు.''

సుధాకర్ ఏమీ మాట్లాడలేదు. ఆమె వైపు మౌనంగా చూడసాగాడు.

''ప్రేమించటం చేతనయిన వాళ్లు వియోగ దుఃఖాన్ని కూడా భరించేందుకు సిద్ధపడాలి. మీరు గొప్ప నిగ్రహవంతులనీ–గంభీర హృదయులనీ అనుకుంటున్నాను. అలాంటి మీరే దుర్బలులై దిగజారిపోవటం మంచిది కాదు.''

ఈమారు కూడా అతనేమీ పలకలేదు.

''సమస్త సంపదలూ–గొప్ప మేధా సంపత్తి కల్గికూడా సామాన్యులవలె కన్పిస్తున్నారు మీరు– మీలోని ప్రేమ హృదయం ఎంత ఔన్నత్యమైనదో యీ కొన్నిదినాల పరిచయం వల్ల నిర్దుష్టంగా తెలుసుకోగల్గాను. మీలాంటి సౌజన్యులు చెయ్యవలసిన పని కృంగిపోవటం కాదు. మీలోని ప్రేమను అన్యథా ప్రసరింప చెయ్యండి.''

''ఎలా ? ఏ విధంగా నాలోని ప్రేమను మళ్ళించమంటావ్ సావిత్రీ ?''

''ఆ విషయం మీరే నిర్ణయించుకోవాలి. ఫలానా వాటిపై మీ ప్రేమను మళ్ళించమని చెప్పగల స్తోమతు లేదు నాకు...''

''సావిత్రీ! ఇంకా నాలో ప్రేమ ఉందనుకుంటున్నావా? రాధ నా సర్వస్వాన్ని తన వెంట తీసికెళ్ళింది. నేనిప్పుడు కేవలం జీవన్మృతుణ్ణి మాత్రమే!''

"అంత పూర్తి నిరాశకు లోను గాకండి."

"నిరాశ కాదు సావిత్రీ! రాధను నేనెంత గొప్పగా ప్రేమించి, పూజించానో నీకు తెలియ చెబుతున్నాను. ఏమిటా కన్నీరు? నా మాటలు నిన్నేమైనా బాధ పెట్టాయా?"

సావిత్రి కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ—"మీ చేత యింత గొప్పగా ప్రేమించబడ్డ ఆ స్త్రీమూర్తి నిజంగా ధన్యజీవి! ఏ కారణంవల్ల మీకూ, ఆమెకూ మధ్య అనుబంధ బాంధవ్యాలు సడలి పోయాయో నా ఊహకు అందటం లేదు. మీ ఉభయుల యెడ విధి ఎందుకింత కాఠిన్యం వహించింది?" అంది.

"విధిగాని మరేదైనా కర్తగాని—మా యిద్దరి జీవితాలు అధోగతి పాలయ్యాయి. క్షణ క్షణానికి నాలో ఆ వేదన పెల్లుబుకుతోంది. ఏ విధంగా నా మనస్సును కట్టివేసుకుందామనుకున్నా ఫలితం కల్పించటం లేదు. ఏం చెయ్యను నేను?"

"మీలోని ఆ వేదన కొంతవరకైనా తొలగిపోయేందుకు జరిగిందేమిటో చెప్పుకోండి."

"నా బాధల గాథను చెప్పుకోమనే మనస్సు తొందర పెడుతోంది. ఆ దినాలు—ఆ సుఖ జీవితం అంతా నా కళ్ళ ముందు మెదులుతోంది. తప్పకుండా విన్పిస్తాను సావిత్రీ! నా జీవిత కథనం—నీకు తప్పకుండా విన్పిస్తాను..." అంటూ అతను పడకమీద కూర్చున్నాడు. సావిత్రి నెమ్మదిగా అక్కడికి వచ్చి అతని కెదురుగా స్టూల్ మీద కూర్చుంది.

కొన్ని క్షణాలు అతనేమీ మాట్లాడలేదు. కళ్లు మూసుకొని నిశ్చలంగా మనోనేత్రంతో-అంతవరకు తన జీవితంలో జరిగిన సంఘటనల నన్నింటినీ స్పష్టంగా చూడసాగాడు.

చాలాసేపటికి అతను కళ్ళు విప్పి ఆమె వైపు చూశాడు. అతనే క్షణంలో తన జీవిత కథ మొదలెడతాడా అనే ఉత్కంఠతో సావిత్రి చూడసాగింది.

చివరకు అతను గాఢంగా నిట్టూర్చి యీ విధంగా చెప్పసాగాడు :

# 10

"సావిత్రీ! ఆనాటి సంఘటన లన్నింటినీ జ్ఞప్తికి తెచ్చుకుంటూండే తిరిగి నా హృదయం రెక్కలు గట్టుకొని మద్రాసు చుట్టూ విహరిస్తోంది. నిజంగా జీవితం ఎంత విచిత్రమైంది!

"సర్వ సంపదలతో తులతూగుతూ-అపారమైన విజ్ఞానాన్ని ఆర్జించి-నా జీవితానికి చీకూ చింతా లేదనిపించుకున్న నాకే చివరికీ దుర్భర జీవితం సంప్రాప్తమైంది ఇది నాకు శాపమో, లేక విధి క్రూర చెయిదమో ఎంత ఆలోచించినా అంతుపట్టడం లేదు.

"ఆ దినాలను గురించి తలచుకున్నప్పుడల్లా నా జీవితానికి అదొక స్వప్నంగా గోచరమౌతోంది యీనాడు. కాని, ఆ జ్ఞాపకాల వివరాలే యీనాటి నా స్థితికి కారణభూతమైనవి.

"నా పూర్వార్ధ జీవితాన్ని గురించిన జ్ఞాపకాలు నాలో లేకుండా పూర్తిగా తుడిచివేయమని ఎన్నోసార్లు భగవంతుని ప్రార్థించాను. కాని, నా ప్రార్థన విని ఆ భగవంతుడు అనుగ్రహించలేదు, ఎందువల్లనో!...

"నా జీవితాన్ని గురించి ఎన్నో కలలు కన్నాను. ఆ సుఖ స్వప్నాల్లో తేలిపోయాను. కాని, చివరకు శోకాంబుధిలో మునగక తప్పలేదు. ఎంత గొప్ప సంతోషం మానవునకు సంక్రమిస్తుందో—ఆ వెను వెంటనే అంత విచారంకూడా పెన వేసుకుంటుందేమో!

"ప్రథమంగా రాధతో నాకు పరిచయమైన దినాల్లో— నా అంతటి అదృష్టవంతుడు యీ ప్రపంచంలో మరొకడుండడనుకున్నాను. కాని, నా రాధ నాకు దూరంకాగానే నా అంతటి అదృష్టహీనుడూ మరొకడుండ డనుకుంటున్నాను. కొన్ని వసంతాలకే నా ఆలోచనల్లోనూ— జీవితంలోనూ ఎంత గొప్ప మార్పు వచ్చింది!

"అవి నేను బి.ఏ. చదువుకుంటున్న రోజులు. ఒనొకాక దినం నా మిత్రులైన యిప్పటి డాక్టర్ రఘురామ్‌ను, శశికళను నా జన్మదినపు పండుగకు ఆహ్వానించేందుకు రాయపేట లోని వాళ్ళ బంగళాకు వెళ్ళాను. అప్పటికే వాళ్ళిద్దరూ కాలేజీకి బయలుదేరి వెళ్ళారని తెలిసింది. సరాసరి ప్రెసిడెన్సీ కాలేజీకి వెళ్ళాను, ముందుగా శశికళతోనైనా మాట్లాడదామని. కాని, ఆమె కూడా యింకా కాలేజీకి రాకపోవటం వల్ల—జాంబజార్‌లోని ఒక మిత్రున్ని కలుసుకునేందుకు వెళ్ళాను.

''అదే సమయంలో రఘురామ్, శశికళ కారులో రావటం కన్పించింది. అతని కారునాపి పిచ్చాపాటి మాట్లాడుతూ కారు వెనుక సీట్‌లో కూర్చున్నాను. నా ప్రక్క ఎవరో కదిలిన చప్పుడు కాగానే వెనుదిరిగి చూశాను. అక్కడొక స్త్రీమూర్తి కూర్చొని వుంది. నా తొందరపాటుకు సిగ్గు పడ్డాను. అయినా, చేసేదేమీ లేకపోవటం వల్ల అలాగే కూర్చోవటం జరిగింది.

''ఆ అమ్మాయిని చూడగానే ఎందుకో నా మనస్సు స్వాధీనం తప్పింది. కాలేజీలోనూ_నగరంలోనూ ఎంతమంది స్త్రీలనో చూశాను గాని, ఆమెలాంటి అందగత్తెను చూసి ఎరుగను. మాటి మాటికి ఆ అమ్మాయి నా వైపు క్రీగంట చూస్తూ సిగ్గుపడుతుండటం గమనించగానే_నా హృదయం మరింత తొందరపడింది.

''మార్గ మధ్యంలో శశి ఆ అమ్మాయిని నాకు పరిచయం చేసింది. నా జీవితంలో ఆ క్షణమే వసంతోదయం కల్గింది.

''ఆ విధంగా నాకు పరిచయం చేయబడిన అందగత్తె రాధాదేవి!

''రాధాదేవిపై ఆ సమయంలో నాకు కల్గిన అభిమానం ఎలాంటిదో యిప్పుడు స్పష్టీకరించలేను. ఆ సౌందర్య దేవత అందచందాలకు దాసానుదాసుడ నయ్యాను. అంతవరకు గల గల మాట్లాడిన నేను_ఆ మరు క్షణంనుండి పెదవి కదిపేందుకే సిగ్గుపడ సాగాను. తొలిచూపులోనే నేనామెను గాఢంగా

ప్రేమించానని చెప్పుకునేందుకు యింతకన్నా మరో నిదర్శనం ఎందుకు?

"ఆ నా ప్రణయమూర్తి శ్రావ్యంగా వీణ వాయించ గలదనీ-అప్పుడప్పుడు రేడియోలో పాడుతుంటుందనీ - తన ప్రాణ స్నేహితురాలనికూడా శశికళ చెప్పగానే నేను పొందిన అనుభూతి వర్ణనాతీతం. ఆమె అందగత్తే గాక కళా మూర్తి అనికూడా తెలుసుకున్నాక మరింత సంతోషించాను.

"రాధాదేవిని నా పుట్టినరోజు పండుగకు వినయంగా ఆహ్వానించాను. కాని, ఆ రోజు నా అదృష్టం వక్రించినందు వల్ల ఆమె నా ఆహ్వానాన్ని మన్నించి రాలేదు. అందుకు నే నెంతగానో తపన చెందాను. నా ఆహ్వానాన్ని ఎందుకు మన్నించలేదో ముఖాముఖిగా అడిగి తెలుసుకుందామను కున్నాను. కాని, నాకు సమయం దొరకలేదు. నాలోని ఆరాటాన్ని అణచుకోలేక శశికళతో ఆ విషయం చెప్పాను.

"ఆ తర్వాత శశికళ చెప్పింది వినగానే రాధపై నాకెంతో జాలి కల్గింది. ఆర్థికంగా రాధ కుటుంబం పూర్తిగా చితికిపోయినందువల్ల- ఆమె ధనికవర్గానికీ, బీదవర్గానికీ మధ్య నున్న కొండల్ని, లోయల్ని ఊహించుకొని నా జన్మదినానికి వచ్చేందుకు బిడియపడిందని తెలుసుకోగానే నా మనస్సు గాయపడింది. రాధకోసమైనా నేను ధనహీనుణ్ణి గాకపోయానే అనుకున్నాను.

"క్రమంగా రోజులు గడవసాగాయి. దిన దినానికి రాధపై నాలో అనురాగం అధికం కాసాగింది. ఆమెను

గూర్చిన తలపులతో ఒక్కో-రాత్రి జాగరణ చేసేవాడిని. ఎన్ని విధాలుగా ఆమెను గురించి మధురంగా ఊహించుకున్నా నాకు తృప్తి కలిగేదే కాదు.

"మధురమైన ఆ బాధను చాలా దినాలు భరించలేక పోయాను ఒక దినం సాహసంచేసి శశికళతో రహస్యంగా 'నేను రాధను ప్రేమిస్తున్నా'నని చెప్పాను. తత్ఫలితంగా నా మధ్యా రాధ మధ్యా వున్న గోడలు ప్రక్క-కు తొలగాయి. ఇద్దరం హృదయం విప్పి మాట్లాడుకోగల్గాం.

"కాల గమనంలో మరి కొన్ని దినాలు ముందుకు వెళ్ళాయి. రఘురామ్ చదువు పూర్తయింది. ఆ వేసంగిలోనే శశికళ-రఘురామ్ లిద్దరూ దంపతు లయ్యారు. హనీమూన్‌కు కాశ్మీర్ వెళ్ళిపోయారు. అంతటితో శశికళ కాలేజీ చదువుకు స్వస్తి పలికింది.

"ఆ సంవత్సరంతో నా చదువుకూడా పూర్తయింది. యూనివర్సిటీ ఫస్ట్‌గా నిలబడ్డాను. గోల్డ్ మెడల్ కూడా పొంద గల్గాను.

"ఆ నా ఆనందాన్ని రాధ కూడా సమంగా పంచుకుంది. ఆమె కూడా బి. ఏ. లో ఫస్టు క్లాస్ తెచ్చుకుంది. ఆ సమయంలోనే యిద్దరం బీచిలో కలుసుకొని భావి జీవితాన్ని గురించి ఎన్నెన్నో ఆశాహర్మ్యాలు నిర్మించుకున్నాము.

"చూస్తూ చూస్తూండగానే మరికొన్ని నెలలు మమ్మల్ని వెనకవేసి ముందుకెళ్లాయి. ఆ మధ్య కాలంలో రాధ జీవితంలో గొప్ప మార్పు వచ్చింది. ఆమె నొక మానవిగా తీర్చి

దిద్దిన మాతృశ్రీ అస్తమించింది. దాంతో రాధ ఏకాకిగా యీ ప్రపంచంలో మిగిలి పోయింది.

"వారం రోజులు గడవకముందే ఒక విచిత్ర సంఘటన జరిగింది. ఆ సాయంకాలం తొలిసారిగా మా బంగళాలో రాధను చూశాను నేను. నా ఆశ్చర్యానికి అంతులేక పోయింది. రాత్రి ఆమెను కలుసుకొని మాట్లాడాను. జరిగిందంతా విన్నాక నా మనస్సు గాయపడింది. కాబోయే నా భార్య తన యింట్లోనే నౌకరుగా ప్రవేశించటమా!

"నేను ఎన్నోవిధాలుగా రాధకు చెప్పి చూశాను, యీ చాకిరీనుండి ప్రక్కకు తప్పుకోమని. కాని, తన కిదే ఆనందంగా వుందనీ- కోడలిగానైనా, నౌకరుగానైనా మా అమ్మకు సేవ చేయటం తప్పదనీ పలికింది.

"అమ్మకు అంధత్వం వచ్చి అప్పటికి రెండు సంవత్సరాలైంది. వయస్సు మీరిపోవటంతో ఆమె రెండు కళ్ళూ జబ్బుపడి క్రమంగా గుడ్డితనం వచ్చింది. అప్పటినుంచీ ఆమెకు తోడుగా ఎల్లప్పుడూ వుండేందుకు ఒక ఆయా పనిచేస్తుండేది. కాని, ఆమెకు ఆమధ్య ఆరోగ్యం బాగా లేకపోవటంవల్ల రాజీనామా చేసి పోయింది.

"ఆ స్థానాన్నే రాధ ఆక్రమించింది.

"ఏది ఏమైనా తిరిగి రోజులు గడవసాగాయి. నేను యింట్లో ఎవ్వరికీ తెలియకుండా రాధను కలుసుకొని మాట్లాడే వాడిని. ఒక దినం మేము యిద్దరం ప్రోగ్రాం నిర్ణయించుకొని మహాబలిపురం వెళ్ళాం. అక్కడే ఎవ్వరికీ తెలియకుండా

అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నాం. ఆ రాత్రే మా యిద్దరి తనువులూ ఏకమయ్యాయి.

"మా వివాహ విషయం కొన్నాళ్ళపాటు ఎవ్వరికీ తెలియకుండా వుంచటం మంచిదనే అభిప్రాయంతో ఎక్కడా బయట పెట్టలేదు. చివరకు ఆ రహస్యమే నా జీవితంతోపాటు రాధ జీవితాన్ని కూడా బుగ్గిపాలు చేసింది.

"ఒక ఉదయం నాన్నగారు నాతో విదేశాల కెళ్ళి బారెట్లా చదవమన్నారు. నాకెంతో ఆశ్చర్య మేసింది. కాని, నేనేమీ సమాధానం చెప్పలేక పోయాను.

"వారం తిరక్కుముందే నాన్నగారు ఇంగ్లాండు వెళ్లేందుకు నాకు పాస్‌పోర్ట్ తీసుకొచ్చి వెంటనే ప్రయాణం కమ్మన్నారు. ఆయన దృఢ నిశ్చయం చూసి నా గుండెలు పగిలాయి.

"నన్నే నమ్ముకున్న నా భార్య రాధను వదలి నేనెలా వెళ్ళను? నా ఆరోగ్యం బాగా లేదనీ - యీ విదేశ ప్రయాణం నా కిష్టం లేదని ఎన్నో విధాలుగా నాన్నగారితో చెప్పాను. అయినా, ప్రయోజనం కన్పించలేదు. ఆయన నా మాటల్ని ససేమిరా ఒప్పుకోకపోవటంతో యింగ్లాండు వెళ్ళటం నాకు తప్పలేదు.

"రాధ కన్నీళ్ళతో నాకు వీడ్కోలు చెప్పింది. ఆరోగ్యం సరిగ్గా కాపాడుకోమనీ- వారం వారం ఉత్తరాలు వ్రాయమనీ ఎన్నో మాటలు చెప్పి - పొంగుతున్న దుఃఖాన్ని ఆపుకోలేక పోయింది.

"ఆనాటికే రాధ గర్భం దాల్చి మూడు మాసాలు

కావటంవల్ల- వెంటనే మరో యిల్లు తీసుకొని ప్రసవం అయ్యేంతవరకూ మా యింటికి దూరం కమ్మని చెప్పాను.

"ఆ రాత్రే మేమిద్దరం చివరిసారిగా కలుసుకున్న దినం. నేను త్వరలో తిరిగి వస్తానని ఎన్నోవిధాలుగా ఆమెను ఊరడించాను. నా మాటలమీద రాధకు విశ్వాసమున్నా- తన కేదో భయంగా వుందనీ- ఏమైపోతానోననీ చెప్పింది. చివరకు ఆ ఊహే నిజరూపం దాల్చింది.

"నేను విదేశాలకు వెళ్ళిపోయాను. అక్కడినుండి ఎన్ని ఉత్తరాలు వ్రాసినా రాధనుండి బదులు రాలేదు. కారణమేమిటో ఎన్నివిధాలుగా ఆలోచించినా అర్థం కాలేదు. జరిగిన యీ విపత్కర పరిస్థితికి నాలో నేను కుమిలిపోతూ ఒక్కో దినం ఒక్కో యుగంగా గడిపాను.

"పరిస్థితి అలాగుండగా ఒక దినం అకస్మాత్తుగా నాన్నగారినుండి కేబుల్ వచ్చింది. అందులో నన్ను వెంటనే బయలుదేరి రమ్మని ఆయన తెలిపారు. ఏం జరిగిందోనని ఆరాటపడుతూ నేను తక్షణమే ఇండియా బయలుదేరాను.

"మీనంబాకం విమానాశ్రయంలో దిగి నేను యింటికి చేరుకోగానే - కన్పించిన దృశ్యం చూసి ఒక్క సారిగా చకితుణ్ణయ్యాను. భవనం ముందు వెనకల పెద్దపెద్ద పందిళ్లు వేశారు. తోరణాలు కట్టారు. పిల్లా, పెద్దా అనే తారతమ్యం లేకుండా

అందరూ ఏదో అవసరమైన కార్యమున్నట్లుగా హడావిడి
పడుతూ అటూ యిటూ పరుగెత్తుతున్నారు. నేను ఎటూ
ఆలోచించుకోలేక పోయాను. గబగబా అందర్నీ తప్పించుకొని
లోపలికి వెళ్ళాను. భవనం లోపల కూడా ఎక్కడ చూసినా
అలంకరిస్తున్నారు. క్రొత్తగా రంగులు పూసేవాళ్లు - సామా
నులు సర్దేవాళ్ళతో యిళ్ళంతా కోలాహలంగా వుంది.

"మేడమెట్లెక్కి నాన్నగారి గదిలోకి వెళ్ళాను. అమ్మ
కూడా అక్కడే వుంది. కాని, నా రాధ స్థానంలో మరో
యువతి అమ్మ ప్రక్క వుండటం గమనించగానే నా గుండె
లెందుకో వేగంగా కొట్టుకో నారంభించాయి.

"నాన్న నన్ను చూడగానే గభాలున లేచి వచ్చి కావు
లించుకున్నారు. నేను వచ్చానని అమ్మతో చెప్పారు.
నెమ్మదిగా ఆమె వద్దకు వెళ్ళి పాదాలకు నమస్కరించాను. ఎందు
కిలా భవనాన్ని అలంకరిస్తున్నారని నాన్నను ప్రశ్నించాను.
ఆయన చిరునవ్వు నవ్వి - ముందుగా నన్ను బడలిక తీర్చుకో
మన్నారు. సాయంకాలం అన్ని సంగతులూ చెబుతానని
అక్కడి నుండి వెళ్ళిపోయారు.

"ఇహ చాలాసేపు నేను అక్కడ వుండలేక పోయాను.
నా గదిలోకి వెళ్ళి కుర్చీలో చతికిలబడి రాధ ఏమైందోనని
ఆలోచించ సాగాను. అంతలో మా యింటి పాత నౌకరు
జగ్గు తాత సమయానికి జ్ఞాపకం వొచ్చాడు. అతన్ని రాధను

గురించి అడిగితే ఏమైనా వివరాలు తెలుస్తాయేమోనని ఆశిం చాను. వెంటనే జగ్గు తాతను మేడ మీదికి పిలిపించాను.

"ఎందుకోగాని, రాధను గురించి నేను ప్రశ్నించే సరికి అతను తలక్రిందికి వంచాడు. అతను జాప్యం చేసే కొద్దీ నాలో భయావేశాలు ఉత్పత్తిల్ల సాగాయి.

" 'జగ్గు తాతా! నా రాధ ఏమైంది? ఈ యింటి లక్ష్మి ఎక్కడి వెళ్ళింది?' అని ఆవేశంతో తిరిగి ప్రశ్నించాను.

"జగ్గు తాత కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పైగుడ్డతో నోరు నొక్కుకున్నాడు.

" 'చెప్పు తాతా! నా గుండెలు పగిలిపోతున్నాయి. రాధ ఎక్కడి వెళ్ళింది? ఏం జరిగింది? ఇంట్లో యీ హడావిడి ఏమిటి?'

"జగ్గు తాత నెమ్మదిగా దుఃఖం నుండి తేరుకొని– 'ఏం చెప్పను బాబూ! అంతా సర్వ నాశనమై పోయింది. మీ కలలు పగటి కలలయ్యాయి. ఆ తల్లిని మీ నాన్నగారే స్వయంగా బయటికి గెంటి వేశారు' అన్నాడు.

" 'ఎప్పుడు? ఎందుకు? నా రాధ చేసిన నేరమేమిటి?'

" 'మీరు యింగ్లాండ్ వెళ్ళిపోయిన రాత్రే ఆ సంఘ టన జరిగింది బాబూ! రాధమ్మగారు మీ పైని దిగులుతో ఆ రాత్రి స్పృహ తప్పి పడిపోయారు. పెద బాబుగారు డాక్టర్‌ను పిలిపించుకొచ్చి అమ్మగార్ని పరీక్ష చేయించారు.

రాధమ్మగారు గర్భం దాల్చారని తెలియగానే నాన్నగారు మండిపడ్డారు. పాపం! ఆమె తనలోని ఆవేదన భరించలేక మీకూ, ఆమెకూ అగ్ని సాక్షిగా వివాహం జరిగిందనీ - ఫలితంగా ఆ గర్భం దాల్చిందని చెప్పింది. కాని, పెద బాబుగారు ఆమె మాటల్ని పట్టించుకోలేదు. నోటికి వచ్చినట్లల్లా తిట్టి - మెడ పట్టి గెంటేశారు. ఆ తర్వాత ఆమె ఏమైందో ఎవ్వరికీ తెలియదు బాబూ!'

"ఆ మాటలు వినగానే నా తలపై పిడుగుపడినంత పనైంది. కళ్ళంబడి అశ్రుబిందువులు జలజలా రాలాయి.

"నా రాధ - నా రాధకు అన్యాయం జరిగింది. ధన మదంతో నాన్న నా జీవితాన్ని బుగ్గిపాలు చేశాడు. నిర్మల చరిత్రమైన రాధ శీలాన్ని శంకించాడు. నిజం చెప్పినా విశ్వసించక క్రూరుడై చేజేతులారా యీ యింటి కోడలిని బయటికి గెంటాడు. హే భగవాన్! నేనేం చెయ్యను? రాధ ఎక్కడున్నదని గాలించను? అభిమానవంతురాలైన రాధ జరిగిన యీ అవమానానికి ఎలాంటి అఘాయిత్యమూ చేసి వుండదు కదా!

"జగ్గుతాత నా దగ్గరగా వచ్చి-'బాబూ!...' అన్నాడు రుద్ధమైన కంఠంతో.

" 'రాధమ్మగారికి అన్యాయం చెయ్యకండి బాబూ! ఆ అమాయకురాలికి ద్రోహం చేస్తే యిహ మీకు పుట్టగతులుండవు' అన్నాడు జగ్గు తాత.

" 'అయ్యో! ఒక సామాన్య నౌకరుకున్న అభిమాన మైనా నా కన్నతండ్రికి లేకపోయెనే!' అని నే నా సమయంలో ఎంతగానో విలపించాను.

" 'మీ రీ పెళ్ళికి ఒప్పుకున్నారా బాబూ!' అని తిరిగి అన్నాడు జగ్గుతాత.

" 'ఎవరికి పెళ్ళి! నేను ఒప్పుకోవడమేమిటి?' అన్నాను విస్మయంగా,

" 'ఇంకా మీకు తెలియదా బాబూ! మీ పెళ్ళి!! నాన్నగారు సిరిపురం జమీందారుగారి అమ్మాయిని యీ యింటి కోడలుగా తెచ్చేందుకు అంగీకరించారు. ముహూర్తం కూడా నిశ్చయమైంది. వచ్చే సోమవారమే లగ్నం. అన్ని పత్రికల్లోనూ యీ విషయం ప్రకటించారుకూడాగా! మీకు తెలియనట్లు మాట్లాడతారేమిటి?'

"జగ్గుతాత చెబుతున్న మాటలకు నవ్వాలో, ఏడ్వాలో బోధపడలేదు. రాధను నానుండి దూరంచేసి- ఎవరో ముక్కు మొహం తెలియని స్త్రీని నాకు భార్యగా చేసేందుకు నాన్న పూనుకోవటంలో ఎంత స్వార్థం వుందో నాకు తెలిసివచ్చింది. అంత దుఃఖంలోనూ నాన్నపై నాకు కల్గిన కోపావేశం హద్దు మీరింది.

"ఆ కోపంతోనే మేడ దిగి నాన్న దగ్గరి కెళ్ళాను. నా కోపతాపాలు చూసి ముందుగా ఆయన కొంత కంగారుపడ్డారు.

అంతలోనే తన్నుతాను సమాళించుకొని ఏమీ ఎరగనివారిలా-
'ఏం జరిగింది?' అనడిగారు తాపీగా.

" 'ఏది జరగకూడదో అదే జరిగిపోయింది. నాన్నా! మీరే నా కింత ద్రోహం చేస్తారని అనుకోలేదు. నా రాధను నాకు గాకుండా చేసి- ఏ ముఖంతో యీ పెళ్ళికి పూను కున్నారు?' అనడిగాను తీక్షణంగా.

"కొన్ని క్షణాలు నా ప్రశ్నకు నాన్న సమాధాన మివ్వ లేదు.

" 'ఏం, పలకరేం?'' అన్నాను తిరిగి.

" 'పిచ్చివాడా! ఎందు కలా ఉద్రేకపడతావ్? నిజా నిజాలు తెలుసుకోకుండా ఏమిటా కుప్పిగంతులు?'

" 'నిజానిజాలు మీకన్నా నాకు బాగా తెలుసు. మీరు ఏ నిజాన్ని గ్రహించి నా రాధ శీలాన్ని శంకించారు? ఏ నిజంతో నా భార్యను యింట్లోంచి వెళ్ళగొట్టారు?'

" 'నీ భార్య!...రాధ నీ ఒక్కడికే కాదోయ్ భార్య!!'

" 'నాన్నా! నాలో అగ్ని రగుల్కొల్పకండి. ఈ మాట మీరు అన్నారు గనుక- నా కన్నతండ్రి అనే ఆపేక్షతో ఊరుకున్నాను. మరొకరై వుంటే యీపాటికి...'

" 'ఏం చేసేవాడివోయ్! ఉద్రేకంలో నోరు జారు తున్నావ్. నీకు జన్మ ప్రసాదించిన నాకన్నా నీ బాగోగులు

నీకేం తెలుసు? ఒక శూద్రజాతిదాన్ని పట్టుకొని అది నా భార్య అని చెప్పుతుంటే లోకం హర్షిస్తుందా?'

" 'లోకం హర్షించాలని కాదు నాన్నా, నేను రాధను ప్రేమించిందీ, పెళ్లి చేసుకుందీ! మా ఉభయుల మనస్సులూ ఏకమయ్యాయి. ఒకరి నొకరం అర్థం చేసుకున్నాం. అందుకే దంపతుల మయ్యాం.'

" 'మనస్సులు ఏకమైనంత మాత్రాన్నే! కులమతాలు- అంతస్థులు ఒకటి కావొద్దా?'

" 'మేమిద్దరం ప్రేమించుకోవటానికి మధ్య కులమతాల ప్రసక్తి ఎందుకు?'

" 'సుధా! నీ కింకా సరిగా యీ లోకం సంగతి ఒంట బట్టలేదోయ్! ఉత్కృష్టమైన వంశంలో పుట్టి ఒక నికృష్ట జాతిపిల్లను పెళ్ళిచేసుకుంటే, ఆవల నీ వంశమర్యాదలు- మా పరువు ప్రతిష్టలు ఏమౌతాయో ఆలోచించలేదు నువ్వు. పిల్ల తనంలో ఏవేవో ఆశయాలనుకుంటూ అధఃపతనుడివి కాబో తున్నావ్. నీ కా పిల్లపై అభిమానం వుంటే వుండొచ్చు. కాని, నే నా పిల్లను నువ్వు పెళ్లి చేసుకునేందుకు ఒప్పుకోను.'

" 'ఒకరి యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండానే మేము పెళ్ళి చేసుకున్నాం నాన్నా! ఇప్పుడు మమ్మల్నెవ్వరూ అడ్డు పెట్టలేరు. నాకు కులమూ, మతమూ, మీ ధనమూ ఏవీ అక్కర్లేదు. నా రాధ ఎక్కడున్నా వెతికి ఆమెను తిరిగి

పొందటమే నా జీవిత ధ్యేయం. అంతవరకూ యీ యింట్లో ఒక్క క్షణం కూడా వుండను' అన్నాను నేను దృఢ నిశ్చయంతో.

"సావిత్రీ! ఆ విధంగా నా కన్న తండ్రే నా భావి జీవితాన్ని బలిగొన్నారు. కులమని - మతమని-అంతస్థులని మూఢ నమ్మకాలతో కుళ్ళిపోయి - అమాయకంగా నా హృదయేశ్వరిని బయటికి గెంటారు. నా బ్రతుకును నాశనం చేశారు. తనూ జీవితాంతం చేసిన పాపానికి కుమిలి పోయారు.

"ఆ తర్వాత రాధ కోసం మద్రాసు నగరమంతా కొన్ని నెలలు గాలించాను. కాని, ఎక్కడా ఆమె దర్శనం కన్పించ లేదు. ఈ ప్రపంచంలో ఏకాకి అయిన రాధకు ఎవరున్నారని ఆమెను గూర్చిన వివరాలు సేకరించను?

"మద్రాసు వదిలి ఆంధ్ర దేశ మంతా ఆమె కోసం తిరిగాను గాని, ప్రయోజనం లేకపోయింది. ఆ విధంగా ఒక సంవత్సరం గడచాక - ఒకానొక మిత్రుని సలహా వల్ల పత్రికల్లో ఎక్కడున్నా వెంటనే నన్ను వచ్చి కలుసుకోమని ప్రకటించాను. అయినా, రాధ నన్ను క్షమించ లేదు కాబోలు, ఒక్కసారైనా నాకు దర్శన మివ్వలేదు.

"సంవత్సరాలు గడిచి పోయాయి. నా బ్రతుకే నాకు భారంగా తోచసాగింది. రాధ లేని నా జీవితమూ ఒక జీవితమేనా!

''ఆమె పైని దిగులుతో క్రమంగా నా ఆరోగ్యంకూడా సన్నగిల్ల సాగింది. ఆమెను నా నుండి దూరం చేసిన కుల మతాల పైన-ధన అహంకారం మీాదా వల్ల మాలిన కోపం వచ్చింది. మనుష్యులను అసహ్యించుకోవటం మొదలుపెట్టాను. ఆ నాటి నుండే నాలో మనశ్శాంతి కరువైంది. అప్పుడప్పుడు నాపై నాకే ఎనలేని కోపతాపాలు ఉద్భవించేవి.

''బ్రతుకుపై నాకు నమ్మకంపోయి చాలా కాలమైంది. చివరి ఘడియల్లోనైనా నా రాధను నాకు చూపించమని భగవంతుని ప్రార్థించటం తప్ప ఏమీా చెయ్యలేక పోతున్నాను.

''సావిత్రీ! ఇప్పటికైనా అర్థమైందా, నేనెందు కింత ఆవేదనకు లోనయ్యానో!'' అని కన్నీళ్ళతో సుధాకర్ చెప్పటం ముగించాడు.

సావిత్రి కళ్ళంబడి అశ్రుధారలు కాలువలై ప్రవహించ సాగాయి. ఆమె హృదయమంతా అల్లకల్లోలమైంది. తను ఎక్కడున్నదో కూడా తెలియని స్థితికి దిగజారి పోయిందామె.

కొన్ని క్షణాలు ఆ విధంగా యిద్దరూ మౌనం వహించారు. చాలాసేపటికి సావిత్రి దుఃఖం నుండి తేరుకుంది. పగిలిపోతున్న తన గుండెల్ని చిక్కబట్టుకుంది.

''సుధాకర్ గారూ! మీాకు జరిగిన యీా అన్యాయాన్ని విన్నాక నా గుండెల్లో అగ్ని భాండం బ్రద్దలైంది. ఇంత గొప్ప ఆవేదనను మీారెలా భరించగల్గుతున్నారో ఊహించు

కునేందుకే నాకున్న భావనా పటిమ చాలటం లేదు. మీారు ఎంత గొప్ప నిగ్రహవంతులో, నిర్మల ప్రేమికులో యిప్పు డిప్పుడే అర్థం చేసుకున్నాను. కులమతాల పేరట మీా యిద్దరి జీవితాలూ ధ్వంసమైన సంగతి తలచుకుంటుంటే నా ఎద భగ్గున మండి పోతోంది. మీాకు సంప్రాప్తమైన యీా విషాద జీవి తానికి సానుభూతిగా కన్నీళ్లు విడవటం తప్ప నేనేమీా చెయ్య లేక పోతున్నాను'' అంటూ సావిత్రి కళ్ళనీళ్లు తుడుచుకుంది.

ఆ తర్వాత ఉభయులూ మాట్లాడుకోలేదు. తెల్లవారే వరకు చీకటి మాత్రమే వారికి తోడుగా నిలిచి – యిరువురి దుఃఖాన్ని తనూ పంచుకుంది.

# 11

తెల్లవారింది.

మార్గరెట్ లేచేసరికి ప్రక్కలో బాబు కన్పించలేదు. ఆమె కంగారు పడుతూ కళ్యాణి కోసం చూసింది. కాని, ఆమె కూడా కన్పించక పోయేసరికి మనస్సెందుకో కీడును శంకించ సాగింది. మంచంలో నుండి లేచి, పెరటిలోనూ – యింటి బయటా ఆ యిరువురి కోసం చూసింది. అయినప్పటికీ ఫలితం శూన్యమైంది.

కళ్యాణి బాబుతో కూడా ఎక్కడికి వెళ్ళిందో ఎంత ఆలోచించినా ఆమె ఊహకందలేదు. గుండెలెందుకో

భయంతో వేగంగా కొట్టుకుంటున్నాయి. కుడి కన్ను అదురుతోంది. తనలో ఎందుకింత భీతి ఆవరిస్తోంది? బాబుకు ఎలాంటి కీడు సంభవించ లేదు కదా! లేక... లేక...

ఆ పైన యిహ ఆమె ఆలోచించలేక పోయింది. దిగులుతో ఎక్కడి దక్కడే కూలిపోయింది. అరగంట తర్వాత బయట రిక్షా వచ్చి ఆగిన చప్పుడు విన్పించగానే తిరిగి బాహ్య జగతిలోకి వచ్చి బయటికి పరుగెత్తింది.

రిక్షాలోనుండి కళ్యాణి క్రిందికి దిగి, బాబును ఆమె కందించింది. మార్గరెట్ కళ్ళనీళ్ళు నింపుకొని బాబును తన గుండెలకేసి అదుముకుంది. ఇద్దరూ యింట్లోకి రాగానే, మార్గరెట్ బాబును మంచంలో పడుకోబెట్టింది.

"ఇప్పుడే ఆస్పత్రికి వెళ్ళొస్తున్నాను. డాక్టర్‌గారు ఇంజెక్షన్ యిచ్చారు" అంది కళ్యాణి.

మార్గరెట్ ఏమీ పలకలేదు.

"పాలమనిషి వెళ్ళిపోగానే బాబుకు టెంపరేచర్ వచ్చింది. అప్పటికింకా నువ్వు నిద్రపోతున్నావ్. నిన్ను లేపి ఆ సంగతి చెబుతా మనుకున్నానుగాని- కంగారు పడతావేమోనని లేపలేదు. ఇదుగో, డాక్టర్‌గారు మందులు వ్రాసిచ్చారు. నువ్వు స్కూలునుండి తిరిగి వచ్చేప్పుడు పట్టుకురా."

"స్కూలుకు సెలవు పెడదా మనుకుంటున్నాను. బాబు స్థితి యిలాగుంటే నే నెలా స్కూలు కెళ్ళను?"

"నేనున్నాగా! నీకా భయం అక్కర్లేదు."

"లేదు కళ్యాణీ! మనో నిబ్బరంతో స్కూలుకు వెళ్ళలేను. ఎక్కడున్నా, ఏం చేస్తున్నా నా ధ్యాస అంతా బాబు మీదే! బాబును యిలాంటి స్థితిలో ఒక క్షణమైనా వదలి వుండలేను."

"నువ్విక్కడ వుండీ చేసే దేముంది? నా మాట విను. స్కూల్లో పాఠాలు చెబుతూనైనా కొంతవరకు నీ బాధలను మరచిపోయేందుకు ప్రయత్నించు. నువ్విక్కడ వున్నావంటే ఎప్పుడూ పాత జ్ఞాపకాలతో- బాబుమీది దిగులుతో కంట తడి పెడుతుంటావ్. ఈవిధంగా బాధపడి ఏడ్చిఏడ్చి నువ్వు సాధించగల్గే దేమిటి?"

ఆ ప్రశ్నతో యిహ మార్గరెట్ ఏమీ సమాధానం చెప్పలేకపోయింది. కళ్యాణి ప్రోద్బలంవల్ల అక్కడినుండి లేచి స్నానం చేసింది. ఆమె అందించిన కాఫీ త్రాగి- బాబుప్రక్క కూర్చుంది.

అప్పటికి తొమ్మిది గంటలు కావస్తోంది.

బయట సైకిల్ బెల్ విన్పించగానే కళ్యాణి గుమ్మం వద్దకు నడిచింది. పోస్ట్‌మాన్ అందించిన కవరు నందుకొని ఆమె లోపలికి వచ్చింది. కవరు చింపి లోపలి ఉత్తరాన్ని బయటికి తీసింది.

కళ్యాణి చేతిలోని ఉత్తరం చూసి "ఎవరు వ్రాశారు!" అనడిగింది మార్గరెట్ తాపీగా.

"ఆస్పత్రినుండి వచ్చింది. సావిత్రి వ్రాసింది. చదువు తాను విను" అని కళ్యాణి ప్రకాశంగా ఉత్తరం చదవసాగింది.

"ప్రియమైన కళ్యాణికి...

"నువ్వు వెళ్ళిపోయే ముందు ఎంత ఆవేదనకు లోనయ్యావో నేను తప్ప- మన పేషెంట్ అర్థం చేసుకోలేకపోయినందుకు చాలా విచారించాను. చివరి సారి అతను నీ మనస్సుకు గాయం కల్గేవిధంగా మాట్లాడాడు. అయితే, నిజంగా అతను తెలిసి తెలిసీ ఆ పని చెయ్యలేదు. అతని మనస్తత్వమే అలాంటిది కాబోలు నని యీపాటికి నువ్వు ఊహించి వుంటావ్.

"నిజానికి అతను చాలా ఉత్తముడు. మెత్తనైన మనసు గలవాడు. కాని, పరిస్థితుల ప్రాబల్యానికి తల వొగ్గి యీవిధంగా మార్పుచెంది వుంటాడనుకుంటాను. జీవితంతో పోరాడలేక- పరాజయాన్ని అంగీకరించి- నిస్సహాయుడై తనలో తాను బాధపడుతున్నాడు. అందుకే నీలోని సహృదయతను అతను త్వరలో అర్థం చేసుకోలేకపోయాడు.

"అతని ఆరోగ్యాన్ని గురించి ఎప్పటికప్పుడు

తెలుపుతూ వుండమని ప్రత్యేకంగా నువ్వు నన్ను కోరి నందుకు యీ విషయాలన్నీ వ్రాస్తున్నాను.

"అక్కడి పరిస్థితులు తెలుపుతూ వెంటనే ఉత్తరం వ్రాయి. నీ మిత్రురాలికి నా నమస్సులు తెలుపు. నీనుండి వచ్చే ఉత్తరంకోసం ఎదురు చూస్తుంటాను.

—సావిత్రి."

కళ్యాణి ఉత్తరం చదవటం ముగించిందే కాని, ఆమె దృష్టి అటునుండి ప్రక్కకు మళ్ళలేదు. శూన్యంగా ఆ ఉత్తరం వైపే చూస్తూ అలాగే నిల్చుండిపోయింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అంది మార్గరెట్ ఆమె దగ్గరగా వస్తూ.

"ఏమీ లేదు" అని ముక్తసరిగా సమాధానం పలికింది కళ్యాణి.

"ఏమీ లేకపోతే అంత అకస్మాత్తుగా నీలో మార్పు ఎందుకు వస్తుంది? ఆ పేషెంట్ ఎవరు?"

మార్గరెట్ ప్రశ్నకు చప్పున బదులు చెప్పలేకపోయిందామె. ఆమె కళ్ళముందు క్షణకాలం ఆస్పత్రి వాతావరణం—సావిత్రి, సుధాకర్‌లు నిలిచారు. తను అతనితో చివరిసారిగా మాట్లాడిన మాటలే తిరిగి ఆమెలో మెదలసాగాయి.

ఆ తర్వాత చాలాసేపటివరకు కళ్యాణి మాట్లాడలేదు.

ఆమెలో వచ్చిన ఆకస్మికమైన మార్పుకు- మౌన భావానికి గల కారణ మేమిటో తెలుసుకోలేకపోయింది మార్గరెట్. ఇహ ఆమెతో యీ విషయమై ప్రస్తావించి లాభం లేదనుకుంది.

స్కూలు పుస్తకాలు తీసుకొని బాబు దగ్గరికి వచ్చింది. బాబు కళ్ళు తనవేపే దీనంగా చూస్తుండటం గమనించి గభాలున ఆ బాలుణ్ని కౌగలించుకుంది.

"బాబూ! నేను స్కూలుకు వెళుతున్నానమ్మా! నీ కేమైనా కావలిస్తే చిన్నమ్మ నడుగు. మధ్యాహ్నం వచ్చేప్పుడు నీకు మందులు, పళ్లు తెస్తాను. నేను వెళ్లిరానా!" అంది మార్గరెట్ బాబు తల నిమురుతూ.

అంత జ్వరంలోనూ ఆ బాలుడు వెళ్ళమన్నట్లు తల వంకించాడు. అప్పటికి కళ్యాణి ఆలోచనలనుండి తేరుకుంది. మంచం వద్దకు నడిచి-

"నువ్వెళ్లు మార్గరెట్! బాబువద్ద నేను వుంటానుగా. వచ్చేముందు మెడికల్‌హాల్‌కి వెళ్ళిరా" అంది.

మార్గరెట్ పుస్తకాలు తీసుకొని బయటికి నడిచింది. సిమెంట్‌రోడ్‌మీది కొచ్చేసరికి సరిగ్గా వేళకు హాజరయ్యే రికా కుర్రవాడు ఆ దినంకూడా ఎదురయ్యాడు. ఆమె కన్పించగానే రిక్షా ఆపాడు. మార్గరెట్ అందులో కూర్చోగానే వెంటనే ముందుకు పరుగెత్తింది రిక్షా.

ఆమె స్కూల్లో అడుగు పెట్టేసరికి అప్పుడే సెకండ్

బెల్ కొట్టడం ముగించారు. గబగబా ఆఫీసు రూంలోకి వెళ్ళి సంతకం పెట్టింది. అటెండెన్స్ రిజిష్టర్ తీసుకొని తన క్లాసు కెళ్ళి కూర్చుంది.

కాని, ఎప్పటిలాగే ఆ దినం ఆమె పాఠాలు చెప్పలేక పోయింది. మౌనంగా కుర్చీలో కూర్చొని ఊరకే పిల్లలవైపు చూడసాగింది. ఎంతకూ టీచర్ పాఠాలు మొదలుపెట్టక పోవటంతో పిల్లలు అల్లరి మొదలుపెట్టారు.

ఆ అల్లరి అలాగే కొంతవరకు సాగింది. క్రమక్రమంగా పిల్లలు అల్లరి చెయ్యటం మాని, ఒక్కొక్కరుగా బయటికి వెళ్ళసాగారు. మిగిలిన ఏ కొద్దిమంది పిల్లలో బుద్ధిగా వెనుకటి పాఠాలు చదువుతూ కూర్చున్నారు.

ఆ విధంగా మొదటి పీరియడ్ ముగిసింది. గంట వినగానే మార్గరెట్ త్రుళ్ళిపడి- గబగబా రిజిష్టర్ అందుకొని క్లాసులోనుండి బయటపడింది. ఆఫీసు రూమ్‌లో రిజిష్టర్ పెట్టి తిరిగి మరో క్లాసుకు వెళ్లింది. ఈమారు పాఠాలు చెప్పేందుకు ప్రయత్నించింది కాని ఫలితం లేకపోయింది. తనేం చెబుతున్నదో తనకే తెలియని స్థితిలో వుండటం గమనించి ఏమీ చెయ్యలేక- అంతటితో పాఠం చెప్పటం ముగించింది.

రెండో పీరియడ్ కూడా ముగియగానే టీచర్స్ రూమ్‌లో కెళ్ళి కూర్చుంది. అక్కడకూడా ఆమెకు మనశ్శాంతి లభ్యం కాలేదు. బాబు దీనంగా తనవైపే చూస్తున్న దృశ్యం కళ్ళ

ముందు నిలవసాగింది. బాబును తలచుకున్నప్పుడల్లా గత గాథ అంతా ఆమె మనఃఫలకంపై మెదల నారంభించింది. బాబును తనకు ప్రసాదించిన వ్యక్తిని గురించిన ఆలోచనలనుండి ఎంతగా తప్పుకుందామని ప్రయత్నిస్తున్నప్పటికీ ఆమె చేతకావటం లేదు.

ఇంటర్వెల్ అయిపోయింది. మళ్ళీ ఆమె యింకో క్లాసులోకి యాంత్రికంగా నడిచి వెళ్ళింది. ఆ క్లాసులో కూడా యింగ్లీషు పాఠాలు చెప్పలేక - పిల్లల్ని ఆట స్థలానికి వెళ్ళమని చెప్పి తనొక్కతే ఏకాంతంగా కూర్చుండి పోయింది.

ఆ విధంగా ఆమె ఎంతసేపు కూర్చుండి పోయిందో గాని - లైబ్రరీ రూమ్‌లో నుండి రేడియో గరగర శబ్దం విన్పించగానే - తిరిగి మామూలు స్థితి కొచ్చింది. అక్కడి నుండి లేచిపోదామని అనుకుంటుండగానే విషాదంగా రేడియోలో నుండి పాట విన్పించింది.

ఓ పరమే - శా...!
నా మొర వినవా!...
బాధల గాథల
కన్నిటి నా కథల ॥ఓ॥

ప్రోడు బారె గదరా
నా జీవిత వనము...

విరిగిపోయె గదరా
నా హృదయ వీణా తంత్రిక...
పెను తుఫానులో
ఒరిగిపోయె గదరా
నా బ్రతుకు నావ... ॥ఓ॥

కలలు కరిగెను
వ్యథలు మిగిలెను
హాలాహలమే ఒలికెను
బ్రతుకు అమవశ ఆయెను...
ఓ పరమే – శా!
నా మొర వినవా...!

పాట ఎప్పుడు పూ_ర్తయిందోగాని మార్గరెట్ అక్కడి నుండి లేచేందుకు ప్రయత్నించలేదు. ఆమె కళ్లు వర్షిస్తున్నాయి. హృదయ భాండం పగిలి పోయింది. ఆవేదనా జ్వాలలు ఆమెను చుట్టు ముట్టి చిత్రహింస చేయసాగాయి.

మార్గరెట్ తన్నుతాను భరించలేక పోయింది. తను వున్నది క్లాసు రూమ్ అన్న సంగతైనా మరచిపోయి భోరున ఏడుస్తూ బల్ల మీదికి తలవాల్చింది. కన్నీళ్లు ఆమె పాదాలపై వెచ్చగా వర్షించసాగాయి.

నిజమే! ఇప్పటి తన జీవితమే' ఆ గేయం. తన జీవిత

సత్యాన్ని ఆ పరమేశ్వరుడికి పాట ద్వారా వెల్లడించుకుంటున్న ఆ దీనురాలు ఎవరో - తనంత కష్టాలు, బాధలు పడివుండక పోదు. పాపం! ఎన్ని రాత్రులు యీ విధంగా భగవంతునితో మొరపెట్టుకుందో!

దీనజనుడని సర్వ ప్రపంచంచేత కీర్తించబడుతున్న సర్వాంతర్యామికి నిజంగా ఆ దుఃఖ భాజనురాలి ఆవేదన అర్థం కాలేదా? ఇన్ని వసంతాలుగా తను కూడా ఆ పరమేశ్వరునితో మొరబెట్టుకుంటున్నదే! కాని, యీ నాటి వరకు భగవంతుడు తనపై కరుణ చూపలేదే! భగవాన్, నిజంగా నువ్వెంత కఠిన శిల వయ్యా?

నిన్ను నమ్ముకున్న నా జీవితం ఏమైంది?

ఫలించి- పుష్పించి కలకల లాడవలసిన నా జీవిత వనం నిజంగానే మోడు బారింది!

జీవితాంతం శ్రావ్యంగా - మధురంగా పాడవలసిన నా హృదయ వీణ తొలి యవ్వన ప్రాయంలోనే బద్దలై పోయింది.

సుఖ స్వప్నాలతో-మధురమైన ఊహలతో-యవ్వన వాంఛలతో కూడుకున్న నా కలలు కరిగిపోయ్యాయి. ఆశలు అడియాశ లయ్యాయి. బ్రతుకు నావ శోకాంబుధిలో మునిగి బద్దలైంది. భగవాన్! నన్ను పరీక్షిస్తున్నావా? ఎందుకింత దుర్భర జీవితాన్ని నాకు ప్రసాదించావ్?

అని పరిపరి విధాలుగా ఆమె అదృశ్య రూపుడైన తన ప్రభువును ప్రశ్నించుకుంది.

చివరకు నాలుగో గంట కొట్టారు. అంతటితో ఉదయం స్కూలు ముగిసింది.

మార్గరెట్ లేచి కళ్ళనీళ్ళు ఒత్తుకుంటూ స్కూలు బయటికి నడిచింది. మెయిన్ రోడ్డులో వున్న ఆదిత్య మెడికల్ హోమ్ చేరుకొని కాంపౌండర్‌కు ఒక చీటీ యిచ్చింది. అతను మందులు పార్శెల్ కట్టి పొట్లం చేతి కిచ్చాడు. యజమాని బిల్లు యివ్వగానే ఆమె పైకం చెల్లించి వెనుదిరిగింది

అంతలోనే రోడ్డులో ఒక హృదయ విదారకమైన సంఘటన జరిగింది. అటునుండి కారొకటి రివ్వున దూసుక వస్తోంది. మూడేళ్ల పసి బాలు డొకడు రోడ్డు మధ్యగా నిల్చొని అటూయిటూ దిక్కులు చూస్తున్నాడు. అటు వైపు వున్న బిచ్చగత్తె ఒకటి ఆ పిల్లవాడిని చూస్తూ - "నాన్నా! నాన్నా!" అని ఎలుగెత్తి పిలుస్తోంది. ఆ బాలుడు రోడ్డు దాటి తల్లిని చేరుకోవాలని పరుగెత్త బోయాడు. కాలు జారి క్రింద పడి పోయాడు. అదే సమయంలో శరవేగంతో వస్తున్న కారు బాలునిపై కెక్కింది.

అప్రయత్నంగా ఆ దృశ్యం మార్గరెట్ కళ్ళబడింది. ఆమె హృదయం ఒక్కసారిగా స్తంభించి పోయింది. క్రిందికి దిగి

యాక్సిడెంట్ జరిగిన ప్రదేశం చేరుతుంది. అప్పటికే జనం ఒకరిపై నొకరు త్రోసుకుంటూ మాం[illegible] పేస్తున్నారు.

ఆ పిల్లవాడి తలపై కారు వెళ్ళటంవల్ల శిరస్సు ఒక రక్తం ముద్దగా తయారైంది. చూస్తూ చూస్తూండగానే తన కళ్ళముందే కన్న కుమారుడు దుర్మరణం పాలు కావటంతో- పిచ్చిగత్తె రొమ్ములు బాదుకుంటూ నేలపైబడి రోదించ సాగింది.

ఆమె శోకాన్ని చూసిన మార్గరెట్ గుండెలు వెయ్యి వ్రక్కలయ్యాయి. కళ్ళనీళ్లు వత్తుకుంటూ అలాగే నిల్చుండి పోయింది. ఉన్నట్లుండి అకస్మాత్తుగా ఆమె మనస్సులో బాబు మెదిలాడు. బాబు జ్ఞాపకానికి వచ్చేసరికి ఎందుకో ఆమె కాళ్ళు వణక నారంభించాయి. మాతృ హృదయం 'బాబూ!... బాబూ!' అని ఆక్రోశించింది.

ఇహ ఒక్క క్షణకాలమైనా ఆమె అక్కడ వుండలేక పోయింది. ఆ గుంపులోనుండి బయటపడి రిక్షా చేసుకొని యింటివైపు దారితీసింది.

రిక్షా యింటిముందు ఆగగానే పరుగెత్తుకుంటూ లోపలికి వెళ్ళింది. మంచంమీద నిద్రపోతున్న బాబును కౌగలించుకొని... అంతవరకు పొంగుతున్న దుఃఖాన్ని ఆపుకో లేక భోరున ఏడ్వసాగింది.

వంటగదిలో వున్న కళ్యాణికి ఎవరో ఏడుస్తున్నట్లు

వినిపించగానే ఎక్కడి పని అక్కడే వదిలిపెట్టి గభాలున బయటికి వచ్చింది. బాబును పెనవేసుకొని మార్గరెట్ ఏడుస్తూ వుండటం చూడగానే ఆమె గుండెలు ఝల్లుమన్నాయి. కంగారుగా మంచం వద్దకు నడిచింది.

కళ్యాణి కన్పించగానే మార్గరెట్‌లోని దుఃఖం మరింత అధికమైంది. ఆమె బాబును వదిలిపెట్టి చంటిపిల్లవలె కళ్యాణిని కావులించుకుని ఏడ్వసాగింది.

మార్గరెట్ ఎప్పుడు వచ్చిందో- దేని కలా ఏడుస్తోందో అర్థంగాక ఆరాటపడింది కళ్యాణి. చాలాసేపటివరకు ఆమె ఏడ్చిఏడ్చి గుండె బరువు దింపుకోగానే అక్కడినుండి ప్రక్కకు తీసికెళ్ళింది.

"ఊరుకో మార్గరెట్! సమయా సమయాలను గుర్తించకుండా- అర్థం పర్థం లేకుండా ఎందుకిలా ఏడుస్తావ్! పసిపిల్లలకున్న నిగ్రహ శక్తికూడా నీలో లేదిప్పుడు. దేని కింతగా దిగజారిపోతున్నావ్? నీ దుఃఖానికి కారణమేమిటో చెప్పు?" అన్నది కళ్యాణి ఆమె తల నిమురుతూ.

కాని, మార్గరెట్ ఏమీ పలకలేదు. దీనంగా కళ్యాణి కళ్ళల్లోకి చూసి తల దించుకుంది. ఆపైన ఎన్నివిధాలుగా ప్రశ్నించినా- ఆ ఏడ్పుకు కారణ మేమిటో మార్గరెట్ చెప్పలేక పోయింది. కళ్యాణి లోలోన ఆరాటపడుతూ- ఆమె దీనావస్థకు- మానసిక బలహీనతకు కళ్ళనీళ్లు విడవటం తప్ప ఏమీ చెయ్యలేకపోయింది.

# 12

చీకటి వెయ్యి కరాలు చాచి భూదేవిని కౌగలించుకుంది.
గుడిలో గణగణమని గంటలు మ్రోగ సాగాయి.

మార్గరెట్ ఆలోచనల నుండి తేరుకొని పూజా మందిరంలోకి నడిచింది. నిర్మల వదనంతో చంద్రకాంతుల విర జిమ్ముతున్న ఏసుభగవానుని దివ్య రూపానికి రెండు చేతులూ జోడించి నమస్కరించింది.

"ప్రభూ, ఏసుభగవాన్! చిరంజీవి కోసం నేనెంతగా తపించి పోతున్నానో నీకింకా అర్థం కాలేదా! ఎవరికోసమైతే నేనిలా నిర్జీవంగా బ్రతుకుతున్నానో - నా బాబుకే యింత అనారోగ్యమా, స్వామీ! బాబు కోసం నా హృదయం తల్ల డిల్లి పోతోంది. నా బాబుకు ఆరోగ్యం ప్రసాదించి - నన్ను కరుణించు ప్రభూ!" అని వేడుకుందామె వణుకుతున్న కంఠంతో.

అంతలోనే కళ్యాణి అక్కడికి వచ్చి మోకాళ్ళపై ఆని నిశ్చలంగా కొన్ని క్షణాలు దైవ ప్రార్థన గావించింది.

ఇద్దరూ అక్కడినుండి కదిలి బాబు వద్దకు వచ్చారు. ఆ పసివాడు లేచి మంచంలో కూర్చొని ఎవరి కోసమో దిక్కులు చూస్తున్నాడు. తల్లి కన్పించగానే ఆ బాలుని ముఖంలో తృప్తి గోచరమైంది.

మార్గరెట్ బాబును తన బడిలో కూర్చోబెట్టుకుని—
"ఆకలిగా వుందా బాబూ! పళ్ళ రసం యివ్వనా?" అనడిగింది.

బాబు తల ఊపి సమ్మతి తెలిపేసరికి - కళ్యాణి నారింజ రసం తీసి గ్లాసులో పోసి యిచ్చింది. మార్గరెట్ బాబు చేత రసం త్రాగించి - తిరిగి పడుకోబెట్టింది.

అరగంట తర్వాత బాబు నిద్రాదేవి ఒడిలో వాలి పోయాడు. కళ్యాణి అక్కడి నుండి లేచి వంట గదిలోకి వెళ్ళింది. రెండు ఆకుల్లో వడ్డించి వచ్చి మార్గరెట్‌ను భోజనానికి రమ్మని పిలిచింది. కాని, ఆకలిగా లేదని ఆమె సమాధానం చెప్పేసరికి కళ్యాణికి యింకా ఏం చేయాలో తోచక అక్కడే చతికిల బడింది.

"నువ్వెళ్ళు కళ్యాణీ! నాకు ఆకలిగా లేదు" అన్నది మళ్ళీ మార్గరెట్.

"ఆకలి గాకపోవడం నీ ఒక్కదానికే కాదు, నా కూడానూ" అంది కళ్యాణి.

ఆ సమాధానంతో మార్గరెట్ గాఢంగా నిట్టూర్చింది.

"కళ్యాణీ! నా మాట విను. నిజంగా నాకు ఆకలిగా లేదు. నువ్వెళ్ళి భోంచెయ్యి."

"పిచ్చిదానా! ఆ మాత్రం యథార్థ మేమిటో అర్థం చేసుకోలేని పసిపిల్లనా నేను? బాబు మీది దిగులుతో అన్న పానీయాలకు స్వస్తి పలికి యిలా ఎన్నాళ్ళని జీవించగలవ్ ?"

"బాబు స్థితి ఆ విధంగా వుంటే నేనెలా భోజనం చేసి నా కడుపు నింపుకోను కళ్యాణీ ?"

"ఎవరి స్థితి ఎలాగున్నా మనం చేయగల్గేదేమిటో చెప్పు? మనస్సును నిగ్రహించుకొని దైవంపై భారం వెయ్యటం తప్ప ఏమీ చెయ్యలేం. కన్నీళ్ళతో - ఉపవాసాలతో నువ్వు సాధించగల్గేదేమిటి?"

"ఈ మాత్రం వేదాంతం నాకూ తెలియక పోలేదు కళ్యాణీ! కాని, బాబు కోసం నా హృదయం ఎంతగా తల్ల డిల్లి పోతోందో నీకెలా విశదీకరించి చెప్పను?"

"నీ బాధ ఏమిటో నాకు స్పష్టంగా తెలుసు. అయితే, నువ్వీ విధంగా అనుక్షణం బాధపడుతూ చేయగల్గేదేమిటో చెప్పు!"

"ఫలానిది సాధించాలని కాదు నేనిలా బాధపడు తున్నది. నాతో బాబు బాటు జీవితం కూడా సర్వనాశనమై పోతోందేనని ఆరాటపడుతున్నాను."

"ఏం మాటలివి? ఇప్పుడు నీకేమైందని? నిక్షేపంగా నెలకు వందకు పైగా సంపాదిస్తున్నావ్. నువ్వు జీవించి వుండగా బాబు జీవితం ఏమీ కాదు. లేనిపోని ఆలోచనలతో సతమతమౌతూ - నిన్ను నువ్వు వంచించుకోకు."

"నువ్వు చెప్పేదీ నిజమే కళ్యాణీ! కాని, బాబు పెద్ద వాడయ్యాక 'నాన్న ఎక్కడమ్మా?' అని ప్రశ్నిస్తే నేనేం

సమాధానం చెప్పను ?'' అంటూ కళ్ళ నీళ్లు పెట్టుకుంది మార్గరెట్.

''ఒక్క బాబే కాదు మార్గరెట్! నాతోపాటు సమస్త లోకం కూడా నిన్నీ ప్రశ్న వేస్తుంది. బాబు తండ్రి ఎవరో చెప్పేందుకు నువ్వెందుకింతగా సంకోచపడుతున్నావో ఎన్ని విధాలుగా ఊహించినా నా కర్థం కావటం లేదు. నీ జీవితం అంత గొప్ప రహస్యాలతో కూడి వుందా?'' అన్న కళ్యాణి ప్రశ్నకు మార్గరెట్ బదులు చెప్పలేక పోయింది. ఆమె కళ్ళల్లోకి నిశ్చలంగా చూడలేక తల దించుకుంది.

చాలాసేపటి వరకూ ఉభయులూ మాట్లాడనూ లేదు. కొన్ని క్షణాల తర్వాత మార్గరెట్ యిలా పలికింది :

''కళ్యాణీ! దుఃఖభాజనురాలనైన నా జీవితంలో ప్రవేశించి, నాతోపాటు నువ్వు కూడా వ్యథ చెందుతున్నావ్. నీలాంటి సహృదయురాల్ని నాకు తోడు నీడ చేసిన భగవంతునికి సర్వదా కృతజ్ఞురాలిని. నువ్వు నాయెడ చేస్తున్న యీ మహోపకారానికి నీ ఋణం యెలా తీర్చుకోను?''

''ఆమాత్రం ఒకరి కష్టాల్లో మరొకరు పాలుపుచ్చుకొని సానుభూతితో ప్రవర్తించినంత మాత్రాన్నే ఋణపడినవారెలా అవుతారు మార్గరెట్! నిన్ను పూర్తిగా విషాదం ఆక్రమించింది. ఏ మాట మాట్లాడినా విషాదాచ్ఛాదిత

ధోరణే. సుఖపడటమంటే ఏమిటో— నవ్వుతూ బ్రతకటమంటే ఏమిటో నీకు తెలియదా?"

ఆ ప్రశ్నతో మార్గరెట్ విషాదంగా నవ్వింది.

"ఒకనాడు నవ్వుతూ బ్రతికిన నేనే యీనాడు నవ్వుల పాలయ్యాను. అంతస్థులు విస్మరించి, అందరానిదానికి ఆశపడి— నా జీవితమే నందన వన మనుకొని మురిసిపోయి— నేడీ విషాద జీవితాన్ని వరించాను. ఏమని చెప్పుకోను కళ్యాణీ, నన్ను గురించి?"

"అంత పూర్తిగా నిరాశకు లోనుగాకు. ఈనాడు యింత జీవచ్ఛవంగా వున్న నువ్వే రేపటిదినం కిలకిలలాడు తుండగలవని ఎందు కనుకోకూడదు?"

"ఏనాడో ఆ ఆశ నన్ను విడిచి వెళ్ళింది. కోరి కోరి కష్టాల్నే ఆశ్రయించినందుకు— ఫలితం యీ రూపేణా ప్రత్యక్షమైంది నాకు. కళ్యాణీ! ఈనాడు నా బ్రతుకు యీ విధంగా మారిందేనన్న బాధకన్నా నా తదనంతరం బాబు ఏమవుతాడో ననే వ్యథతో కుమిలిపోతున్నాను. ఎట్టి పరిస్థితుల్లోనైనా నేను బాబుకు దూరమవుతే—నా మాతృస్థానాన్ని నువ్వు స్వీకరించక తప్పదు కళ్యాణీ!"

మార్గరెట్ ఆవిధంగా మాట్లాడేసరికి కళ్యాణి మరింత బాధపడింది.

"చెప్పు కళ్యాణీ! తప్పకుండా బాబుకు నువ్వు తల్లివి అవుతావ్ కదూ!" అంది తిరిగి కంటనీరు పెడుతూ మార్గరెట్.

కళ్యాణి దుఃఖం ఆ మాటతో కట్టలు త్రెంచుకుంది. రుద్ధమైన కంఠంతో—"మార్గరెట్! ఏనాడూ యిలాంటి అశుభ వాక్యాలు పలకకు. నీ జీవితంలో ఏం చూశావని యింత వేదాంతం మాట్లాడుతున్నావ్ ? మనం ఆడవాళ్ళమైనంత మాత్రాన ఏమీ చెయ్యలేమనుకొని చిత్తక్షోభతో కృంగిపోరాదు. భగవంతుడుకూడా ఎప్పుడూ మన మానసిక బలహీనతను చూసి క్షమించడు. అయితే, నీ మనశ్శాంతికోసం ప్రమాణం చేస్తున్నాను—విను. ఎట్టి కష్ట పరిస్థితుల్లోనైనా నీ తర్వాత నేను బాబుకు తల్లి అయ్యేందుకు మనస్ఫూర్తిగా ఒప్పుకుంటున్నాను. బాబు ఆనందమే నా ఆనందంగా నా శేష జీవితాన్ని గడప నిశ్చయించుకున్నాను" అంది.

మార్గరెట్ కళ్ళంబడి ఆనందాశ్రువులు జలజలా రాలాయి. ఆ ఆనందోద్రేకాన్ని భరించలేక గభాలున కళ్యాణిని కౌగలించుకుంది. ఆ విధంగా కన్నీళ్ళతో ఉభయులూ ఒకరి కౌగిలిలో మరొకరు చాలాకాలం గడిపారు.

కొంతసేపటికి కళ్యాణి ఆమె కౌగిలి వీడి—

"నిన్ను యిప్పటినుండి పేరుతో గాకుండా 'అక్కా' అని పిలవాలనుంది... నీకేం అభ్యంతరం లేదుగా?" అంది.

"అంతకన్నా నాకు కావల్సిందేమిటి కళ్యాణీ! నువ్వు

నాకు ప్రసాదిస్తున్న యీ గౌరవాన్ని పొందేందుకు ఎంతో ఆనందపడుతున్నాను.''

''అయితే, యీ నీ సోదరి కోర్కె తీర్చటంలో నీ కే విధమైన బాధ్యతా లేదా, అక్కా!''

''ఎందుకు లేదు కళ్యాణీ! నా కింత మహోపకారం చేస్తున్న నీకు- నువ్వడిగిన సామాన్యమైన కోర్కె తీర్చలేక పోవడ మేమిటి?''

''నీ మాట సమంజసంగానే వుంది. కాని, తీరా నా కోర్కె వెల్లడించాక నువ్వు దాన్ని తీర్చలేకపోతే...''

''ఆ అనుమానం నీకు అక్కర్లేదు. నానుండి నువ్వు కోరదగ్గది ఎలాంటిదైనా సరే- హృదయపూర్వకంగా సమర్పించుకుంటాను. నిస్సందేహంగా అడుగు.''

''అయితే విను అక్కా! నీనుండి ప్రత్యేకంగా నా కేమీ అక్కర్లేదు. కాని, బాబు తండ్రి ఎవరో- నీ జీవిత చరిత్ర ఏమిటో- ఎందు కిలా దుఃఖభాజనురాలవై పరితపిస్తున్నావో- నాకు సమస్తమైన వివరాలు కావాలి. నా కోర్కె మన్నించి- మారు మాటాడకుండా అన్ని సంగతులూ చెప్పు. నీ జీవితంలో ఏం చూశావో- ఏం నేర్చుకున్నావో యీ నీ సోదరికి చెప్పటంవల్ల ముందు ఉపయోగపడొచ్చు.''

కళ్యాణి మాటలు వినగానే తిరిగి మార్గరెట్ ముఖంలో మార్పు వచ్చింది. అప్రయత్నంగా ఆమె కళ్ళల్లో విచార మేఘాలు అలుముకున్నాయి.

"కళ్యాణీ! నీవు తప్ప నాకు ఎవరున్నారని కష్టసుఖాలు చెప్పుకోనేందుకు? నా జీవిత రహస్యం నీతో చెప్పాలని ఎప్పటి కప్పుడు అనుకుంటూనే వున్నాను. కాని, నాలో మనోబలం లేకపోవటంవల్ల, ఏ క్షణానికి ఆ క్షణం పిరికిపంద నవుతున్నాను. అందుకే ఎన్నిమార్లు నువ్వీ ప్రశ్న వేసినా సమాధానం చెప్ప లేకపోయేదాన్ని. ఇన్నాళ్లుగా నాలో గుప్తమైన యీ రహస్యం యిక బయటపెట్టకుండా వుండలేను" అని గాఢంగా నిట్టూర్పు విడిచి ఆమె తన జీవిత కథనం యీవిధంగా చెప్ప సాగింది :

# 13

"నేను జన్మతః చాలా దురదృష్టవంతురాల్ని. మాతృగర్భం నుండి భూమిపైకి జారగానే కన్నతండ్రి అస్తమించాడు. ఆనాటినుండి మా అమ్మ తన సర్వస్వంగా నన్ను భావించి రెక్కల కష్టంతో పెంచి పెద్దచేసింది.

"నలుగురైదుగురు గొప్పవాళ్ళ యిళ్ళల్లో అమ్మ చాకిరీ చేయడంవల్ల- ఆ వచ్చిన డబ్బుతో యిద్దరం బ్రతుకు వెళ్ళబుచ్చేవాళ్ళం.

"ఇంటర్ పరీక్షలో కృతార్థురాల్ని కాగానే యిహ అంతటితో చదువుకు స్వస్తి చెబుతానని అమ్మతో చెప్పాను. కాని, ఆమె అందుకు ససేమిరా ఒప్పుకోలేదు. ధనం లేకున్నా

ఫర్వా లేదుగాని, ప్రపంచంలో విద్య లేకపోతే బ్రతకటం చాలా కష్టమని చెప్పి తిరిగి నన్ను కాలేజీలో బి. ఏ, క్లాస్‌లో చేర్పించింది.

"అప్పటికే నేను యవ్వనంలో అడుగుపెట్టాను. మనుష్యుల తీరుతెన్ను లెలాంటివో— కష్టసుఖాలు మానవుల నెలా కృంగదీస్తవో తెలుసుకోదగిన పరిజ్ఞానంగల రోజులవి. నా కోసం అమ్మ పడుతున్న కష్టాలను కళ్ళారా చూసి భరించ లేకపోయేదాన్ని.

"ఆర్థికంగా చితికిపోయినా అమ్మ అభిమానం గలది. చిల్లిగవ్వ ఆస్తి అయినా లేకుండా యీ ప్రపంచంలో నాన్న మమ్మల్ని ఒంటరిగా వదిలి వెళ్ళిపోయాడు. ఆనాటినుండీ అమ్మ ఒకర్నినైనా యాచించలేదు. ఏ బంధువునూ ఆశ్ర యించలేదు. నాకోసం ఎన్నో అవమానాలకు, బాధలకు తల వంచి— పరాయివాళ్ళ యిళ్ళల్లో చాకిరీ చేయటానికి నిశ్చ యించుకుంది.

"వయస్సు మీరినా అమ్మ నాకోసం పడుతున్న కష్టాలను తలచుకొని అప్పుడప్పుడు కంటనీరు పెట్టేదాన్ని. నా కంటనీరు చూసినప్పుడల్లా అమ్మ గుండె చెరువయ్యేది.

" 'రాధా! ఎందుకే ఏడుస్తున్నావ్?' అని నన్ను ప్రశ్నించేది.

" 'ఏడ్వక ఏం చెయ్యనమ్మా! ఇంత వయస్సు వచ్చినా

నాకోసం నువ్వు పడుతున్న కష్టాల్ని చూస్తూ ఊరకుంటు న్నాను. అమ్మా! యిప్పుడైనా నా మాట విను. నువ్వు చాకిరీ చెయ్యటం మానుకో' అనేదాన్ని అమ్మతో.

" 'నేను చాకిరీ చేయటం మానుకుంటే—మన జీవితాలు గడవటం ఎలాగమ్మా!'

" 'నాకింత వయస్సు వచ్చింది. బీయే, చదువుతున్నాను. ఎక్కడైనా ఉద్యోగం సంపాదించి నిన్ను పోషిస్తానమ్మా!'

" 'బంగారు తల్లీ! నీకింత ఆలోచన ఎక్కడిదే! నీకింకా లోకం సంగతి అర్థం కాలేదమ్మా! బీయే చదువుతున్నంత మాత్రాన్నే నీకెవరిస్తారు ఉద్యోగం? అయినా, మధ్యలో చదువు మానటం మంచిది కాదు. చదువు పూర్తి కానీ, తర్వాత చూద్దాం.'

"ఆ విధంగా అమ్మ నా ప్రయత్నాన్ని మధ్యలోనే త్రుంచి వేసేది. మా ఆలోచనలతోనూ – నిర్ణయాలతోనూ సంబంధం లేని కాలం యథావిధిగా ముందుకు పరుగెత్తి పోయేది.

"నా నిర్ణయాలేవీ అమ్మ ముందు పనిచెయ్యక పోవటంతో కాలేజీ చదువుతో సంవత్సరం కొనసాగింది. మా ఆర్థిక స్థితిగతులు— కుటుంబ వ్యవహారాలన్నీ ఎప్పటి కప్పుడు నా ప్రియస్నేహితురాలూ, సహాధ్యాయినీ అయిన శశికళకు చెప్పేదాన్ని. ఆ అమాయకురాలు మా కష్టాలన్నీ విని నాతోపాటు తను కూడా కళ్ళ నీళ్ళు పెట్టుకునేది.

"మేము రాయపేటలో ఒక చిన్న పెంకుటింటిలో కాపుర ముండేవాళ్ళం. నేను చదువుకుంటున్న ప్రెసిడెన్సీ కాలేజీ అక్కడికి దూరం కావటం వల్ల - ప్రతి రోజూ బస్‌లో వెళ్ళాల్సి వచ్చేది. నాబోటి ఆర్థిక స్థితిగల వాళ్లు నిత్యం బస్‌లో వెళ్ళితే - కుటుంబ స్థితి ఏ విధంగా దిగజారి పోగలదో వేరే చెప్పనక్కర్లేదు. ఈ విషయాలన్నీ స్పష్టంగా తెలిసిన శశికళ రోజూ తన కారులో వుడ్‌ల్యాండ్ బస్ స్టాప్ దగ్గర నుంచి కాలేజీకి నన్ను తీసికెళ్ళేది. మొదట్లో నేను కొంత బిడియ పడినా - నగర జీవితానికి అలవాటు పడటం వల్ల అంతరాలు మరచిపోయి కారులోనే శశికళతోపాటు వెళ్ళే దాన్ని.

"శశికళతోపాటు రఘురామ్ కూడా వచ్చేవాడు. ఆయనే స్వయంగా కారు నడిపేవారు. మమ్మల్నిద్దర్నీ కాలేజీ వద్ద దింపి తను మెడికల్ కాలేజీక వెళ్ళేవారు.

"రఘురామ్ చాలా మంచివాడు, సహృదయుడు, అందగాడు కావటంవల్ల అచిరకాలంలోనే శశికళ ప్రేమకు పాత్రుడయ్యాడు. అంతేగాక శశికళ ఆయనకు స్వంతం మేనత్త కూతురు కావటం వల్ల వాళ్ళ వివాహ విషయంలో కూడా ఎలాంటి అడ్డూ లేక పోయింది.

"ఆ దినం అమ్మకు ఒంట్లో బాగా లేనందువల్ల నేనే

వంటపని ముగించి కాలేజీకి బయలుదేరేసరికి కాస్త ఆలస్య మైంది. శశికళ నేను బస్ స్టాప్ వద్ద కన్పించక పోయేసరికి కాలేజీకి వెళ్ళి వుంటుందేమో ననుకుంటూనే బస్ స్టాప్ చేరు కున్నాను. కాని, నా ఊహ నిజం కాలేదు. శశికళ కారు టాక్సీ స్టాండ్ వద్ద ఆగి వుంది.

"డ్రైవింగ్ సీట్‌లో కూర్చుని వున్న రఘురామ్ నన్ను చూసి - 'హల్లో, రాధా దేవీ! మీ కోసమే వెయిట్ చేస్తున్నాం. ఏమిటీ ఆలశ్యంగా వస్తున్నారు?' అన్నాడు.

" 'అమ్మ ఆరోగ్యం సరిగ్గా లేదండి. అందుకని వంట పని ముగించుకొని వచ్చేసరికి ఆలశ్యమైంది' అన్నాను సిగ్గు పడుతూ.

"నేను లోపల కూర్చోగానే కారు కదిలింది.

"రఘురామ్ డ్రైవ్ చేస్తూనే-'రాధా దేవీ! మీరేమీ కంగారు పడకండి. సాయంత్రం నేను వచ్చి మీ అమ్మగారికి-ట్రీట్ మెంట్ యిస్తాను?' అన్నాడు.

" 'అలాగేనండి' అన్నాను నేను.

"ముందు సీట్లో రఘురామ్ ప్రక్కన కూర్చున్న శశికళ వస్తున్న నవ్వు నాపుకుంటూ - 'రాధా! నిజంగా యీాయన గార్ని యింటికి తీసికెళ్ళేవ్. మీ అమ్మగారికి ఏ కాస్త టెంప రేచర్ వున్నా అది నిమోనియో అనో - టైఫాయిడనో నిన్ను కంగారు పెట్టి నానాహంగామా చేస్తాడు' అంది.

" 'ఓస్! అప్పుడే నా ప్రాక్టీస్ మీద దండయాత్ర మొదలెట్టావూ' అని బిగ్గరగా నవ్వాడు రఘురామ్.

"అతనితోపాటు నేనూ, శశికళా నవ్వుతున్నాం.

"కారు జాంబజార్ చేరుకునేసరికి ఎక్కడి నుండో 'రఘూ! రఘూ!' అన్న కేక విన్పించింది. రఘురామ్ బ్రేక్ వేసి పోలీస్ స్టేషన్ ఆవలి వైపు కారు ఆపాడు. ఆయన ఎప్పుడైతే కారు ఆపాడో అక్కడి కొక వ్యక్తి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

" 'సుధా! నువ్వట్రా!! నీ పొలికేకలు విని ఎవరో ననుకొని హడలిపోయాను సుమా!' అంటూ నవ్వాడు రఘురామ్, ఆ వచ్చిన వ్యక్తి కేసి ఆప్యాయంగా చూస్తూ.

" 'పాపం, హడలి పోయావేగాని – ఆ కంగారులో స్టేషన్ కేసి కారును ఢీ కొట్టించలేదు. ఏమ్మా, శశీ! నువ్వా వీడిలాగే కంగారు పడ్డావా, ఏం?' అన్నాడతను నవ్వుతూ.

" 'లేదు సుధా! ఈ మధ్య యీయనగారి తత్వం పూర్తిగా మారిపోయింది. అందుకే–' అంటూ శశికళ ఏదో చెప్పబోయింది.

"అతనామె మాటలకు అడ్డుపడుతూ – 'అందుకే యింకా ఆ మూడు ముళ్ళయినా పడక ముందే మా వాడితో అన్ని పనులూ చేయించుకుంటున్నావ్. ఎంతైనా గడుసుదానివమ్మా!' అన్నాడు.

"ఆ మాటలతో శశికళ సిగ్గు పడింది. అంతవరకు వాళ్ళ సంభాషణ వింటూ నేను మౌనంగా కూర్చొని వున్నాను. అప్పటిదాకా ఆ వచ్చిన వ్యక్తి చూపు నాపై నిలవ లేదు. ఎప్పుడెప్పుడు నా వైపు అతను చూస్తాడా అనే ఆరాటంతో అటూ యిటూ కదలసాగాను. కాని, ఎంతసేపు వూరకున్నా అతని దృష్టి నాపై మళ్ళలేదు. వాళ్ళు ముగ్గురూ నవ్వుకుంటూ – మాట్లాడుతూ అలాగే వుండిపోయారు.

"అంతలో శశికళ – 'సుధా! మాకు ఎలాగూ కాలేజీ టయం అయిపోయింది గనుక అందరం కలిసి గుప్తా రెస్టారెంట్‌కి వెళదామా?' అంది.

"వెనుక వైపు వచ్చి గభాలున తలుపు తెరిచి నా ప్రక్క కూర్చున్నాడతను. నేను సిగ్గుపడుతూ పయిట సర్దుకొని ప్రక్కకు జరిగాను. నా కదలికవల్ల అప్పటికిగాని అతను నన్ను గుర్తించలేదు. అకస్మాత్తుగా నన్ను చూడగానే కంగారు పడ్డాడు. అంతవరకు గలగలా మాట్లాడుతున్న అతను నన్ను చూడగానే కంగారు పడటంతో – ఎందుకో నా మనస్సు తీయటి బాధకు లోనైంది. క్రీగంట అతని వైపు చూడ సాగాను.

"ఈలోగా రఘురామ్ కారు స్టార్ట్ చేశాడు. కారు ముందుకు కదిలేసరికి తిరిగి నేను మామూలు మానవి నయ్యాను.

" 'శశీ! నన్ను కాలేజీవద్ద దింపు, నేను వెళతాను' అన్నాను.

" 'ఒక్కపూట కాలేజీకి వెళ్ళకపోతే ఏం పొయ్యింది లెద్దూ. కాస్త షికారుగా గడుపుదాం' అంది శశికళ.

"నాకూ మనస్సులో కాలేజీకి వెళ్ళాలని లేదు. కాని, మాటవరసకి అలా అనక తప్పింది కాదు.

" 'మీ మాటల్లో మరిచేపోయాం. సుధా! ఈమె నెరుగుదువా?' అంది శశికళ అతన్ని నావైపు చూపుతూ.

" 'ఊహూఁ! పరిచయం చేయందే ఎలా తెలుసు కోను?' అన్నా డతను.

" 'ఈమె నా క్లాస్‌మీట్. అందులోనూ నా డియరెస్ట్ ఫ్రెండ్. పేరు రాధాదేవి. ఆఁ, రాధా! ఈయన లయోలా కాలేజీలో బి ఏ. సీనియర్ చదువుతున్నారు. పేరు సుధాకర్' అంటూ శశికళ పరస్పరం పరిచయం చేసింది.

"నేను ధైర్యంగా అతనివైపు కళ్ళెత్తి చూసి 'నమస్కార మండి' అన్నాను.

"అతనూ నా కళ్ళల్లోకి ప్రియంగా చూస్తూ 'నమస్తే' అన్నాడు.

"ఆ విధంగా నా జీవిత రంగంలో తొలిసారిగా సుధాకర్ ప్రవేశించాడు.

"కారు మెరీనా రోడ్డుమీదుగా రివ్వున దూసుక

పోతోంది. గాలికి నా పయిట రెపరెపలాడుతూ అప్పుడప్పుడు అతని ముఖంపై పడుతోంది. గాలి యిటు వీచినప్పుడల్లా పయిట తన జోరు తగ్గించసాగింది. అప్పుడు ఆశగా అతని కళ్లు నాపై నిలుస్తూవుండటం నేను గమనించకపోలేదు. ఎందుకోగాని అతను నా కళ్ళల్లో కళ్ళు పెట్టి చూస్తే- ఒళ్ళంతా ఝల్లు మనేది. మా యిద్దరికీ పరస్పరం పరిచయమై కొన్ని క్షణాలైనా గడవకముందే నా మనస్సు నన్ను వీడి అతన్ని చేరుకుంది.

"శాంథోమ్‌వద్ద కారు టర్నింగ్ తిరిగి చర్చి రోడ్డు మీదుగా వెళ్ళసాగింది. నేను అద్దంలోగుండా బయటికి చూస్తూ కూర్చున్నాను. ఎవ్వరూ మాట్లాడుకోవటంలేదు. ముందు సీట్లో కూర్చున్న రఘురామ్ శశికళతో అభినయ పూర్వకంగా ఏదో అల్లరి చేస్తున్నాడు. నా ప్రక్క- కూర్చున్న సుధాకర్ కూడా నాతో ఏమైనా అల్లరిచేస్తే బాగుండు నని పించింది. కాని, ఆ తలంపు నాలో మెదిలాక నా దురాశకు నాకే ఆశ్చర్యం కల్గింది,

"చివరకు కారు గుప్తా రెస్టారెంట్ చేరుకుంది. కారును పార్క్-చేసి అందరం అప్‌స్టయిర్స్ కెళ్ళాం.

"నేనూ, శశికళ ఒకవైపు- సుధాకర్, రఘురామ్‌లు ఒకవైపు కుర్చీల్లో కూర్చున్నాం. సర్వర్‌కు నాలుగు కాఫీకి ఆర్డర్ యిచ్చి- సుధాకర్ సిగరెట్ వెలిగించుకున్నాడు. అతను

విడుస్తున్న పొగ రింగులు రింగులు తిరుగుతూ నా ముందు వచ్చి ఎగరసాగింది. నేను ఊరుకోలేక ఆ పొగను తిరిగి గాలి లోకి వూదసాగాను. నా చర్యల్ని ఎప్పటికప్పుడు గమనిస్తున్న సుధాకర్ ముఖంపై సంతృప్తి రేఖలు గోచరం కాసాగాయి. సూటిగా అతను నా కేసి చూస్తున్నప్పుడు ఆ చూపులు నాలో తూట్లు పొడవసాగాయి.

"సర్వర్ మా ఏకాంతాన్ని భంగం చేస్తూ కాఫీ తెచ్చి పెట్టాడు. నలుగురం కప్పు లందుకొని త్రాగసాగాం. కాఫీ పూర్తి చెయ్యగానే రఘురామ్ సంభాషణకు వుపక్ర మించాడు.

" 'సుధా! ఇంతకీ నీ రాక మా అందరి కాలేజీలకు తిలోదకా లిచ్చింది' అన్నా డాయన.

" 'ఏ సమయంలో ఏం జరుగబోతుందో మనం కల కన్నామా ఏమిటి? ఈ విధంగా జరగటంకూడా ఒకందుకు మంచిదేనేమో' అన్నాడు సుధాకర్ నావైపు అదోవిధంగా చూస్తూ.

" 'సరి– సరి– ఆ మంచితనం వూసుకోబోయే అదృష్ట వంతు లెవరో?' అని ప్రశ్న వేసింది శశికళ.

" 'మన మందరం ఎందుకు కాకూడదు?' అన్నాను నేను మౌనవ్రతాన్ని యిహ భరించలేక.

" 'ఓహో! నువ్వుకూడా సుధను సమర్థిస్తున్నావా!

అయితే యిహ యింతటితో మన ఆట కట్టినట్లే' నవ్వుతూ అంది శశికళ.

" 'మీ అందరికీ ఒక శుభవార్త చెప్పాలని వచ్చాను' అన్నాడు సుధాకర్.

" 'శుభం కల్గించే వార్త ఏదైనా సరే చప్పున చెప్పేయ్. ఆలస్యం చేయకూడదు' అన్నాడు రఘురామ్.

" 'రేపు నా పుట్టినరోజు పండగ. అందుకని మిమ్మ ల్నందర్నీ ఆహ్వానించేందుకు వచ్చాను. తప్పకుండా ఉదయం పదింటికల్లా రావాలి.'

" 'హరి పిడుగా! ఇంతసేపు ఏ విశేషమూ లేనట్లుగా మాట్లాడావేం! ఒక్క విందుభోజనమే ఏర్పాటు చేశావా, లేక వినోదాలు ఏమైనా...'

" 'వినోదాల రాయుడివి నువ్వున్నావ్ గా! ఆ కార్య క్రమానికి నువ్వే యిన్‌చార్జి తీసుకోవాలి. శశి మన ఫ్రెండ్స్ కంతా విందు ఏర్పాట్లు చేస్తుంది. ఇహ మీరు-' అంటూ అతను నావైపు చూసి ఏదో చెప్పబోయాడు. కాని, అంత లోనే ఏమని ఆలోచించుకున్నాడో ఠక్కున ఆగిపోయాడు.

"అతని సందిగ్ధావస్థను గమనించి శశికళ నవ్వుతూ- 'ఆమె వచ్చిన అతిథులందర్నీ తన ముగ్ధమోహన వీణా రవంతో ముగ్ధుల్ని చేస్తుంది' అంది.

"ఆ మాటలు వినగానే సుధాకర్ ముఖం వికసించింది.

ఆశ్చర్యంగా నావైపు క్షణకాలం చూసి - 'నిజంగానా!' అన్నాడు అప్రయత్నంగా.

" 'ఆ సంగతి రాధాదేవిని కాదు అడగవలసింది, నన్నడుగు చెబుతాను. ఆమె వీణ అందుకుందంటే దాని కదే ప్రాణం తెచ్చుకొని మధురంగా మ్రోగుతుంది. నువ్వెప్పుడూ రేడియోలో ఆమె పాడిన పాటల్ని వినలేదా?' అన్నాడు రఘురామ్.

"నన్నుగురించి ఆయన గావిస్తున్న పొగడ్తకు సిగ్గు పడ్డాను. నిర్భయంగా తలెత్తి ఎవ్వరి కళ్ళల్లోకీ చూడలేక పోయాను.

" 'విన్నానేమోకాని నా కంతగా జ్ఞాపకం లేదు' అని సమాధాన మిచ్చాడు సుధాకర్.

" 'అయితే యిప్పుడు ప్రత్యక్షంగానే విందువు లే!' అని నవ్వాడు రఘురామ్.

"నే నేమీ మాట్లాడలేదు. వాళ్ళ సంభాషణ వింటూ అప్పుడప్పుడూ దొంగచాటుగా సుధాకర్‌ను చూడసాగాను. అతనూ వీలు దొరికినపుడల్లా నా కళ్ళల్లోకి దృష్టి నిలప సాగాడు.

"కొంతసేపటికి అందరం హోటల్‌నుండి బయటపడి కారులో బయలుదేరాం. రాయపేటలో మా యింటిముందు కారు ఆగగానే నేను క్రిందికి దిగాను.

"అప్పుడు సుధాకర్ ముఖంలో అసంతృప్తి కన్పించింది నాకు. నా మనస్సుకూడా అతనినుండి అంత త్వరగా విడి పోయేందుకు సమ్మతించటం లేదు. కాని, సభ్యతకోసం నాలోని కోర్కెను చంపుకోవాల్సి వచ్చింది.

" 'నా పుట్టినరోజు పండుగకు రావటం మరచిపోకండి. నేనే స్వయంగా రేపు ఉదయం వచ్చి మమ్మల్ని తీసికెళతాను' అన్నాడు ఆశగా నా కళ్ళల్లోకి చూస్తూ సుధాకర్.

"ఆ చూపుల్లో- 'నువ్వు తప్పక రావాలి. వస్తావనే ఆశతోనే వెళ్ళిపోతున్నాను. నా ఆశ నిరాశ చెయ్యకు. నీ మీదే నా మనస్సంతా లగ్నమై వుంది' అన్న భావాల్ని నేను చదువుకోగల్గాను.

"కాని, నే నెలాంటి సమాధానం యివ్వక పోయేసరికి అతను నాకేసే ఆత్రంగా చూడసాగాడు. అంతలో శశికళ అందుకుంది :

" 'సుధా! రేపు నీ ఏర్పాట్లల్లో నువ్వుండు. రాధను నేను తీసుకొస్తాను.'

"ఆ మాటతో సుధాకర్ ఏమీ మాట్లాడలేకపోయాడు. మరోమారు నావైపు ఆశగా చూస్తూ 'తప్పకుండా రండి' అన్నాడు.

"అప్పటికికూడా నే నేమీ బదులు చెప్పలేక అందరికీ 'టా! టా!' చెప్పి యింట్లోకి పరుగెత్తాను.

"ఏమిటోగాని ఆ దినమంతా నా మనస్సు గాలిలో తేలి పోసాగింది. ఎందుకో నన్ను నేనే పరీక్షగా చూసుకోవా లను కున్నాను. అద్దంముందు కెళ్ళి అందులో నా ప్రతిబింబాన్ని చూసుకొని మురిసిపోయాను అదేమి విచిత్రమో-ఎన్నడూ కన్పించని గొప్ప సౌందర్యం నాలో ఆ క్షణం కన్పించింది. నా అందచందాలు- యవ్వన సంపదలు నన్నే ముగ్ధురాల్ని చేశాయి. నా హృదయంలోకి సుధాకర్ తొంగిచూసిన క్షణంనుంచి నా సౌందర్యంపై నాకే ఆలోచనలు కల్గసాగాయి. సుధాకరుడు తన చూపుల చల్లదనాన్ని నా మేనికి సోకించా డేమో! లేకపోతే ఎన్నడూ నాలో రేకెత్తని యవ్వన వాంఛలు ఆ దినం ఒక్కసారిగా విజృంభించడ మేమిటి! మాటిమాటికీ అతని రూపురేఖలనే నా కళ్ళముందు నిలుపుకొని- నాలో నేనే నవ్వుకోసాగాను. అతన్ని కారులో వదిలిపెట్టి కొన్ని గంటలైనా గతించకముందే- నాలో విరహతాపం అంకురించ సాగింది.

"యవ్వన వాంఛలకు మానవుల మధ్యనున్న అంతస్థులు అంతరాలు తెలియవు కాబోలు- అందుకే నాలోని కోర్కెలు సుధాకర్‌ను పొందేందుకు వెర్రితలలను వేశాయి.

"ఆ రోజంతా ఏ పనీ చెయ్యలేకపోయాను. వంట చేస్తున్నా- పుస్తకం చదవబోయినా నా కళ్ళముందు సుధా కరుడే నిలవసాగాడు. ఈలాంటి క్రొత్తరకపు రోగం ఎప్పుడూ

నన్ను కాపులించుకొని వుండకపోవటంతో— ఆ దినం నేను పడిన బాధ అంతా యింతా కాదు.

"ఆ రాత్రి నేను పడుకోబోతూ 'సుధాకర్‌ను ప్రేమిస్తున్నానా!' అని ప్రశ్నించుకున్నాను.

"అందుకు నాలోని రాధా దేవి 'కాదా మరి! ఏమీ తెలియనిదానివలె నేను ప్రేమిస్తున్నానా అని ప్రశ్నించుకుంటావెందుకు? నువ్వతన్ని ప్రేమిస్తున్నావ్ గనుకనే యిన్ని విధాలుగా అతన్ని గురించి ఆలోచిస్తున్నావ్! లేకపోతే ఎందుకీ ఆలోచనలు! నీలో నువ్వు నవ్వుకునే ముసిముసి నవ్వులు!! నిజంగా నువ్వతన్ని ప్రేమిస్తున్నావు గనుకనే— నీపై నీకు అనురాగం జనించింది. నీ రూపురేఖలపై వంపుసొంపులు తిరిగిన నీ యవ్వనంపై నీకే మోహావేశం కల్గింది' అని సమాధానం పలికింది.

"చివరకు చాలాసేపు నాలో నేనే తర్కించుకొని — 'అవును, నేను సుధాకర్‌ను గాఢంగా ప్రేమిస్తున్నాను' అని నిశ్చయించుకున్నాను.

"ఆ రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు. మధురమైన ఊహాలతో నన్ను నేనే మరచి స్వప్నసీమల్లో విహరించ సాగాను.

"అర్ధరాత్రి దాటినా నేను నిద్రపోక అటూయిటూ మసలుతుండటం అమ్మ గమనించిందేమో – 'ఏమిటమ్మా ఆలోచిస్తున్నావ్?' అనడిగింది.

" 'ఏమీ లేదమ్మా' అని తప్పుకో చూచాను.

"కాని, అమ్మ నా మాట నమ్మలేదు.

" 'మధ్యాహ్నం నుండి ఎంతో వుత్సాహంగా వున్నావ్ తల్లీ! ఏం జరిగింది?' అంది తిరిగి అమ్మ.

" 'రేపు నా స్నేహితురాలు ఒకామెది పుట్టిన రోజు పండుగమ్మా! నన్ను తప్పకుండా రమ్మని మరీమరీ పిలిచింది. అక్కడ వాళ్ళింట్లో నన్ను వీణ కూడా వాయించమంది. ఏరాగం ఆలపించనా అని ఆలోచిస్తున్నాను' అంటూ అమ్మతో అబద్ధం పలికాను.

" 'పిచ్చిపిల్లా! ఈ మాత్రానికే అంతగా పొంగి పోతు న్నావా? రేపు నువ్వా అమ్మాయి జన్మదినానికి వట్టి చేతు లతో వెళితే నలుగురూ ఏమనుకుంటారు. జన్మదినపు పండు గలూ, పబ్బాలూ, వినోదాలూ, విలాసాలూ మనలాంటి బీదలు పాల్గొనేందుకు కాదమ్మా! డబ్బున్న వాళ్ళకే అవన్నీ చెల్లగలవ్. ధనహీనురాలివి ధనవంతుల మధ్య ఎలా మెలగ గలవ్? డబ్బులేని వాళ్ళను యీ మనుష్య జాతి నీచంగా చూస్తుంది. నా మాట విని- ఎంత గొప్ప సహృదయులైనా డబ్బున్న వాళ్ళయితే వాళ్ళతో నీ స్నేహం తగ్గించుకో. అను భవించి చెబుతున్న యీ నా మాటలు నీ జీవితంలో ఎప్పటి కైనా వుపయోగపడగలవ్.'

"అమ్మ పలికిన మాటల ప్రభావం ఆ రాత్రి నాలో

గొప్ప సంచలనం కల్గించింది. నిజమే! డబ్బున్న వాళ్ళతో స్నేహం పాముతో చెలగాటం వంటిది. తనకై తానే కొరివితో తల గోక్కునే లాంటిది. ధనవంతుల మనఃప్రవృత్తి ఏక్షణంలో ఏవిధంగా మార్పు చెందుతుందో తెలుసుకోవటం బహు కష్టతరమైనది.

"అలాంటి ఆలోచనతో సాధ్యమైనంతవరకు ధనవంతులకు దూరంగా మెలగాలనే నిశ్చయించుకున్నాను. కాని, వెంటనే సుధాకర్ నా కళ్ళ ముందు ప్రశ్నార్థకంగా నిలిచాడు.

"ఔను! నా నిర్ణయాన్ని అమలు జరపటం తప్పని సరి అవుతే సుధాకర్‌ను కూడా వదులుకోవాల్సి వస్తుంది. ఈ దినమే అంకురించిన మా యిద్దరి స్నేహలత అంతలోనే అంత రించి పోవాల్సిందేనా! ఊహుఁ! ఇందుకు నేనెంత మాత్రమూ ఒప్పుకోను. మా యిద్దరి స్నేహం ధృడపడవలసిందే! మూడు పువ్వులూ ఆరు కాయలుగా దినదినాభివృద్ధి చెందవలసిందే! తప్పకుండా నేను నేనతని జన్మదిన పండుగకు వెళ్ళవలసిందే!!

"కాని, అంతలోనే అమ్మ చెప్పిన మాటలు నా మదిలో మెదల నారంభించాయి :

"సుధాకర్ జన్మ దినానికి వట్టి చేతులతో వెళితే నిజంగా అక్కడి వారంతా ఏమనుకుంటారు?

"ఈ ప్రశ్న ప్రశ్నగానే తెల్లవార్లూ నాలో మిగిలి పోయింది.

"తెల్లవారింది. లేచి స్నానం చేశాను. ఆస్పత్రి కెళ్ళి అమ్మకు మందు తీసుకొచ్చాను. బయట ఏ కారు శబ్దం విన్పించినా శశికళే వచ్చిందేమో ననుకుంటూ - ఎటూ తోచక నా గదిలో కూర్చుండి పోయాను.

"చివరకు శశికళ కారు హారన్ విన్పించింది. పరుగెత్తు కుంటూ బయటికి వచ్చాను. అప్పటికే రఘురామ్ సుధాకర్ యింటికి వెళ్ళాడేమో - శశికళే స్వయంగా డ్రైవ్ చేస్తూ వచ్చింది.

"నన్ను చూడగానే- 'యింకా ముస్తాబు కాలేదేమిటి! అరెరె! టయమౌతోంది. త్వరగా బయలుదేరు' అంది.

"నేను ఏమీ మాట్లాడలేక పోయాను.

" 'రాధా! ఏమిటి ఆలోచిస్తున్నావ్. వీణ గురించేనా! సుధాకర్ ఆ ఏర్పాట్లన్నీ స్వయంగా చేస్తానన్నాడులే. మన కోసం కాచుకొని వుంటాడు. రఘు బావ కూడ అప్పుడే వెళ్లి పోయాడు. మనిద్దరిదే ఆలశ్యం' అంది తిరిగి శశికళ.

"ఇహ నాకు మాట్లాడటం తప్పనిసరి అయ్యింది.

" 'క్షమించు శశీ! నేను రాలేను' అన్నాను క్లుప్తంగా.

" 'ఏం? ఎందుకని రాలేవు?' తిరుగు ప్రశ్న వేసింది శశి.

" 'అతనెవరో నాకు సరిగ్గా పరిచయమైనా లేదు. అంతా తెలియని వాళ్ళే అక్కడికి వస్తారు. అంత మందిలో నాకు సిగ్గేస్తుంది' అన్నాను.

"నా మాటలకు శశికళ విరగబడి నవ్వుతూ— 'ఓహో! అదా సంగతి. అక్కడ నువ్వు సిగ్గుపడటం చూసి ఎవ్వరూ హాస్యం చెయ్యరులే. నీ సంగీతం వినాలని సుధాకర్ చాలా ముచ్చటపడుతున్నాడు. నువ్వు తప్పకుండా రావల్సిందే' అంది.

"ఇహ నా స్థితి చెప్పనలవి కాదు. మనస్సులో ఒక వైపు వెళ్ళాలనే వుంది. ఆశగా సుధాకర్ కళ్ళల్లోకి చూసి నాలోని రాధాదేవిని సంతృప్తి పరచాలనే వుంది. కాని, నా స్థితి అనుక్షణం కళ్ళముందు నిల్చొని భయంకరంగా శాసించ సాగింది. అమ్మ మాటలు నా చెవుల్లో గంటలు కొట్టినట్లు మ్రోగసాగాయి.

" 'ఈ నాటికి క్షమించు శశీ! నిజంగా నేను రాలేను. అమ్మకు కూడా ఒంట్లో బాగా లేదు. ఈలాంటి స్థితిలో నేను వస్తే ఏమనుకుంటుంది?' అన్నాను.

" 'ఏమీ అనుకోదులే! కావలిస్తే అమ్మకు నేను చెప్పనా !'

" 'అమ్మయ్యో! ఆ పని మాత్రం చెయ్యకు. నిన్ను బ్రతిమాలుకుంటున్నాను. నాపై దయవుంచి బలవంతం చెయ్యకు' అన్నాను ప్రాధేయపడుతూ.

"నా మాటలతో శశికళ ఏమని ఆలోచించుకుందో గాఢంగా నిట్టూర్పు విడిచింది.

" 'సరే. నీయిష్టం. నేను వెళ్ళిరానా!' అంది కారు స్టార్ట్ చేస్తూ.

"నా తలమీది గొప్ప బరువు తొలగిపోయినట్లుగా తేలికపడుతూ_ 'థాంక్స్! వెళ్ళిరా' అన్నాను.

"ఇంటో అడుగు బెట్టగానే నా మనస్సులో అలజడి ప్రారంభమైంది, చూస్తూ చూస్తూ ఒక మంచి అవకాశాన్ని పోగొట్టుకున్నదాన్ని అయ్యానే అని విచారం కల్గింది. నేను రాకపోయానని అత నెంతగా బాధపడతాడో! శశికళ నా యీ మూర్ఖత్వాన్ని ఏ విధంగా అర్థం చేసుకుందో! సభ్యత తెలియని దాన్నని రఘురామ్ అనుకోడు కదా!

"ఈ విధంగా సాగాయి నా ఆలోచనలు. వాటినుండి తప్పుకోలేక ఒడ్డున బడిన చేపవలె గిలగిలా తన్నుకున్నాను.

"నా ముఖం కళ తప్పివుండటం గమనించి కాబోలు అమ్మ నన్ను పిలిచింది. మంచంవద్ద కెళ్ళి కూర్చున్నాను.

" 'ఏమిటమ్మా అలా వున్నావ్? కారులో వచ్చిం దెవరు?' అనడిగింది అమ్మ.

" 'శశి నన్ను పిలచేందుకు వచ్చిందమ్మా! నేను రానని చెప్పి పంపించాను' అన్నాను.

"నా సమాధానంతో అమ్మ యిం కే విధంగానూ మాట్లాడలేకపోయింది. కళ్లు మూసుకొని వత్తిగిలి పడుకుంది.

నేను నా గదిలో కెళ్ళి కూర్చున్నాను. శరీరంమాత్రం గదిలో వుంది. మనస్సేమో సుధాకర్ మీదికి మళ్ళింది. ఎంతో సంతోషంగా గడపబోతున్న తన యీ జన్మదినపు పండుగలో నేను రాకపోయేసరికి అతను ఎంత చిన్నబుచ్చుకుంటాడో నని ఆలోచన కల్గసాగింది నాలో. నేను తప్పకుండా వస్తానని తన యింట్లో ఒక పెద్ద వేదిక తయారుచేసి వుంటాడు. ఆ వేదికమీదున్న వీణ తన నెవరు ప్రయోగించబోతారోనని ఆశగా ఎదురు చూస్తుంటుంది. కాని, తీరా తన నెవరూ పరిశీలించకపోయే సరికి నిరుత్సాహపడి వుంటుంది. పాపం! సుధాకర్ తొలి ఆశనే నిరాశ చేశానే!...

"ఒకవేళ అతను నాకోసం తనే స్వయంగా కారు తీసుకొని వస్తాడేమో! వస్తే... వస్తే... గట్టి చిక్కే. నా ఊహే నిజమైతే— అతను వచ్చి కాదు కూడదంటే వెళ్ళటం తప్పనిసరి అవుతుందేమో! అప్పుడు అమ్మ ఏమనుకుంటుంది? తన బిడ్డ అబద్ధీకురాలని బాధపడదూ! తన కళ్ళముందే ఒక మగవాడితో తిరుగుతుందని కుమిలిపోదూ!...

"ఈ ఆలోచన నాలో మెదిలి 'భగవాన్! ఏది ఏమైనా సుధాకర్ యిక్కడికి రాకుండా చెయ్యి' అనుకున్నాను.

"నా ప్రార్థన ఫలించిందో— లేక సుధాకర్ నా గురించి ఆలోచించలేదోగాని ఆ దినం ఎవ్వరూ యిహ మా యింటికి రాలేదు.

"మరుసటి దినం కారులో వెళుతుండగా రఘురామ్ మళ్ళీ ఆ ప్రసక్తి తెచ్చాడు.

" 'రాధాదేవీ! నిన్న ఫంక్షన్‌కు మీ రెండుకు రాలేదండి?' అని.

"నేను సమాధానం చెప్పలేక తొట్రుపడ్డాను. ఆయన ప్రశ్నకు బదులు చెప్పమన్నట్లుగా శశికళ కళ్ళల్లోకి దీనంగా చూశాను. నా స్థితి గమనించి శశి చిరునవ్వు నవ్వింది.

" 'ఆమెగారి మనస్సు నిన్న ఏమీ బాగా లేదట. అందుకని రాలేదు' అని రఘురామ్ ప్రశ్నకు శశికళ బదులు చెప్పగానే- 'అమ్మయ్య' అని నిట్టూర్చాను.

" 'పాపం! వాడు నిన్నంతా మీరు రాలేదనే బాధపడ్డాడు. ఏ వందమార్లయినా మీరు వచ్చారా అని నన్ను ప్రశ్నించాడనుకోండి. శాస్త్రీయ సంగీతమంటే వాడు చెవి కోసుకుంటాడు. అయినా, మీరు నిన్న మమ్మల్నందర్నీ డిసప్పాయింట్ చేశారు. ఇది క్షమించరాని నేరం' అంటూ గట్టిగా నవ్వాడు రఘురామ్.

" 'నేరానికి తగిన శిక్ష ఏమిటో చెప్పండి' అంది శశికళ నవ్వుతూనే.

"ఆయన ఏ శిక్ష నిర్ణయిస్తారోనని నేనూ కుతూహలంగా ముందుకు వంగాను.

" 'శిక్ష ఏమిటో నిర్ణయిస్తాను గాని దాన్ని అమలు జరిపేలా చూసేదెవరు?' అన్నాడు రఘురామ్.

" 'ఆ భయం తమరికి అక్కర్లేదు. నేనున్నాగా! అమలు పరుస్తాను' అంది ధీమాగా శశి.

" 'అయితే సంక్షేపంగా శిక్ష ఏమిటో వినొచ్చు. రాధాదేవి సుధాకర్ ఆహ్వానం మీదట హాజరు కానందువల్ల చట్ట రీత్యా ఆమెకు శిక్ష విధింపబడుతోంది. ఆ శిక్ష ఏమనగా—దోషి చేసిన తప్పుకు పరిహారంగా - మరో ఏ సందర్భంలోనైనా సుధాకర్‌తో పాటు మా కందరికీ తన గానామృతాన్ని చవి చూపించవలసి వున్నది. స్థలము, కాలము, దోషి నిర్ణయాను సారముగా నిశ్చయింపబడును' అంటూ నటుని ధోరణిలో రఘురామ్ పలికి, నవ్వుతూ– 'ఎలా వుంది మన శిక్ష?' అన్నాడు శశికళతో.

"ఆయన విధించిన శిక్ష విన్నాక నాకు నవ్వాగింది కాదు. ఫకాలున నవ్వాను. నాతో పాటు వారిద్దరు కూడా నవ్వకుండా వుండలేక పోయారు.

" 'ఈ శిక్ష తమరు నిర్ణయించిందా, లేక సుధాకర్ నిర్ణయించిందా?' అనడిగింది శశికళ కొంతసేపటికి.

" 'ఎవరు నిర్ణయిస్తేనేమి పూచీ పడినవారు శిక్ష అమలు జరిగేలా చూడవలసిన బాధ్యత కల్గి వున్నారు కదా!' అని తిరిగి నవ్వాడు రఘురామ్.

"అంతలో మా కాలేజీ ముందుకు కారు వచ్చి ఆగటం వల్ల సంభాషణకు స్వస్తి పలికి మేమిద్దరం క్రిందికి దిగాము. రఘురామ్ 'టా! టా!' చెప్పి ముందుకు వెళ్ళిపోయాడు.

"ఇద్దరం క్లాసు రూమ్‌లోకి నడుస్తుండగా తిరిగి శశికళ అంది:

"'నువ్వు వచ్చి వుంటే అతనెంతగా సంతోషించే వాడోగాని - రానందుకు తెగ బాధపడ్డాడు. ఎందుకలా చేశావు?'

"నేను నిస్సహాయంగా శశి కళ్ళల్లోకి చూడటం తప్ప ఏమీ సమాధానం చెప్పలేకపోయాను.

"వారం రోజులు గడిచాయి. అమ్మ జ్వరంనుండి తేరు కొని యధావిధిగా చాకిరీ కెళ్ళి వస్తోంది. ఈ మధ్య కాలంలో సుధాకర్ ఎప్పుడూ, ఎక్కడా నాకు తటస్థపడలేదు. అతను నన్ను మరిచిపోయాడేమో నని అప్పుడప్పుడు నాలో దిగులు ప్రవేశించేది. కాని, నా ఊహ తప్పని నిరూపించేందుకు కాబోలు ఒక దినం ఒక సంఘటన జరిగింది.

"నేను మామూలుగా కాలేజీకి బయలుదేరి శశికళ కారుకోసం వుడ్‌ల్యాండ్ బస్‌స్టాప్ వద్ద నిల్చొని వున్నాను. కాలేజీకి వెళ్ళేందుకు యింకా అరగంట టయిముంది. ఎప్పుడూ నాకన్నా ముందు వచ్చే శశికళ ఆ దినం ఎంతసేపటికీ రాక పోవటంతో అలాగే ఆమెకోసం ఎదురు చూడసాగాను.

''అంతలో ఒక కారు వచ్చి నా ముందు ఆగింది. ఎవరా అని అటువైపు దృష్టి నిలిపాను. డ్రైవింగ్ సీట్‌లో సుధాకర్ కూర్చొని వున్నాడు. నాకేసి రెప్ప వాల్చకుండా చూస్తూ-మందహాసం చేస్తున్నాడు.

''అతన్ని అకస్మాత్తుగా చూడగానే మొదట్లో నాకు కంగారు కలిగింది. కాని, అతను నా చూపుల్లో చూపు నిలిపి వుండటంవల్ల పయిట సవరించుకొని సిగ్గుపడ్డాను.

''కొంతసేపటికి అతను నావైపు చిలిపిగా చూడటం మాని 'నమస్తే' అన్నాడు.

''నేను తొట్రుపడుతూ 'నమస్కారమండి' అన్నాను దిక్కులు చూస్తూ.

'' 'మీ కేమీ అభ్యంతరం లేకపోతే కారులో కూర్చోండి. కాలేజీవద్ద దింపి వెళతాను' అన్నాడతను.

''నా కెటూ పాలుపోలేదు. వెళ్ళడమా, వద్దా అని క్షణకాలం సందిగ్ధావస్థలో పడ్డాను. నేను ఎటూ నిర్ణయించుకోక ముందే అతను వెనుక తలుపు తెరిచి మళ్ళీ మందహాసం చేశాడు. నాలోని ఏ శక్తులు బలవత్తరంగా పని చేశాయో కాని, యింకేం ఆలోచించకుండా వెంటనే కారులో ఎక్కాను. రివ్వున కారు ముందుకు దూసుకు వెళ్ళింది.

''కారులో కూర్చున్నా నన్నమాటేగాని నా గుండె లెందుకో వూరికే కొట్టుకోసాగాయి. అతనేం మాట్లాడతాడో,

నేనే సమాధానం చెబుతానో నని_ నాలో నేనే లక్ష ప్రశ్నలు వేసుకోసాగాను.

" 'నా ఆహ్వానాన్ని మీరు మన్నించి రాలేదు. కారణం తెలుసుకోవచ్చా?' అనడిగా డతను.

" 'శశికళతో చెప్పానండి. మా అమ్మ ఒంట్లో బాగా లేదు. అందుకే రా లేదండి. ఈ నా తప్పిదానికి తప్పకుండా మీరు మన్నించాలండి' అన్నాను ఎలాగో ధైర్యం చేసి.

"నా మాటలకు అతను చిరునవ్వు నవ్వాడు.

" 'ఈ ప్రశ్న అడిగి మీ మనస్సును కష్టపెట్టానేమో! ఇందుకు మీరే నన్ను క్షమించాలి. అమ్మగారికి మందులు యిప్పిస్తున్నారా!'

" 'ఆస్పత్రి మందే యిప్పిస్తున్నానండి.'

" 'ఆ రంగు నీళ్ళా! బాగుంది. ఆస్పత్రి మందులు వాడిన వాళ్ల ఆరోగ్యం ఎప్పుడూ బాగుపడగా నేను చూడ లేదు. ఎవరికైనా ప్రయివేట్ డాక్టర్‌కు చూపించక పోయారా?'

"అందుకు నేనేమీ బదులు చెప్పలేదు. మా ఆర్థిక దుస్థితి నాకళ్ళ ముందు నిల్చొని భయంకరంగా వికటాట్ట హాసం చేయసాగింది.

" 'ఇంతకీ మీ అమ్మకేం జబ్బు?' అన్నాడతను తిరిగి.

" 'గుండె జబ్బండి. రాత్రిళ్లు విపరీతంగా దగ్గుపొర

వస్తుంటుంది. దాదాపు ఒక సంవత్సరమైందండి, అమ్మాకా విధంగా వుండబట్టే...'

"ఈ మాటలు చెబుతూ వుండగా నా కళ్లు చెమ్మగిల్లాయి. అతను నా బేలతనాన్ని చూసి ఏమనుకుంటాడోనని ముఖం చాటు చేసుకున్నాను.

" 'దిగులు పడకండి. మీ స్థితిగతులన్నీ శశికళ నాతో చెప్పింది. ఆమె ఆర్థికంగా మీకు సహాయపడతానంటే ఎందువల్ల తిరస్కరించారు మీరు?'

"నేనేమీ పలకలేదు.

" 'నేనో మాట చెబుతాను, ఏమీ అనుకోకండి. మీరు ఎందువల్ల శశి చేస్తానన్న సహాయాన్ని త్రోసిపుచ్చారో అర్థంచేసుకున్నాను. మనం కష్టాల్లో వున్నప్పుడు ఎవరైనా సహృదయులు - మన ఆ కష్టాల్ని తొలగించేందుకు పూనుకున్నప్పుడు - మనం వారి సహాయాన్ని పొందకపోతే - ఆ తర్వాత మనల్ని చుట్టుకున్న కష్టాలు ఎంతటి విపరీతమైన నష్టాల్ని కల్గిస్తాయో మీకింకా అనుభవపూర్వకంగా అర్థం చేసుకోలేదు. ఒకరి దయాధర్మాలు మనకు అక్కర్లేదని- అభిమానంతో భీష్మించుకొని కూర్చుంటే అందువల్ల మనకు కీడు తప్పదు. మీకూ నాకూ వున్న యీ కొద్దిపాటు పరిచయాన్ని పురస్కరించుకొని యీ విధంగా చెపుతున్నందుకు అన్యథా భావించకండి.'

"అతని హేతువాదనకు- విశాల భావుకత్వానికి నే నెంతో అచ్చెరువు పొందాను. నా కనుదోయికి ఆనాడే- జీవిత సత్యాలను వడబోసి పిండిన మేధావంతునిలా అతను కన్పించాడు. అంతవరకు నా దృష్టిలో అతను కేవలం అంద గాడే! కాని, ఆ కొద్ది మాటలు వినేసరికి- వెన్నలాంటి మనసు కలవాడూ, బుద్ధిమంతుడూ అనికూడా తెలుసుకోగల్గాను.

"కాలేజీవద్ద అతను నన్ను దింపి- చిరునవ్వుతో వెళ్ళి పోయేసరికి- నే నేదో పోగొట్టుకున్నదానివలె అడుగులో అడుగు వేస్తూ క్లాసురూమ్‌లోకి వెళ్ళిపోయాను. ఆ దినమంతా కాలేజీలో వున్నానన్న మాటేగాని లెక్చరర్స్ ఏం చెబు తున్నారో- నేను ఏం వింటున్నానో నాకే తెలియదు. అసలు శశి కాలేజీకి ఎందుకు రాలేదోకూడా నేను ఆలోచించలేదు. నా ఆలోచనలన్నీ పూర్తిగా సుధాకర్‌వైపే మళ్ళి వుండటంతో యితరత్రా ప్రపంచమే నా కళ్ళకు కన్పించలేదు.

"సాయంకాలం నేను కాలేజీనుండి బయటపడగానే మళ్ళీ సుధాకర్ కారుతోపాటు కన్పించాడు. నన్ను చూస్తూనే కారు దిగి ముందుకు వచ్చాడు.

" 'ఉదయం మాటల్లో చెప్పటమే మరచిపోయాను. శశి కళ రఘుతో కలిసి బెంగుళూరు వెళ్ళిపోయింది. ఒక వారం రోజులకు కాని తిరిగి రాదు. అర్జంట్‌గా వెళ్ళిపోవటం వల్ల యీ విషయం మీతో చెప్పమని నాకు ఆదేశించింది. ఆమె

వచ్చేవరకూ మిమ్మల్ని కారులో తీసికెళ్ళే డ్యూటీ నాకు అప్పచెప్పింది. అభ్యంతరం లేకపోతే—'

"అంటూ అతను మాట పూర్తి చెయ్యకుండానే మంద హాసం చేశాడు. ఆ సమయంలో ఏమని సమాధానం చెప్పాలో నాకు తోచిందికాదు. నిశ్శబ్దంగా అతని కళ్ళల్లోకి చూడటం తప్ప ఏమీ చెయ్యలేక పోయాను.

"ఈలోగా అతనేం ఆలోచించుకున్నాడో—'రండి—పోదాం...' అన్నాడు.

" 'ఎక్కడికి?' అని చప్పున నేను ప్రశ్నిద్దామనుకున్నాను కాని, నా నోటంట మాట పెగలలేదు. మంత్రించినదానివలె అతని వెంట నడిచి కారులో కూర్చున్నాను. వెంటనే కారు కదిలింది.

"మెరీనా కేఫ్ వద్ద కొచ్చి కారు ఆగగానే తుళ్ళి పడ్డాను. సుధాకర్ కారు దిగి, తలుపు తీస్తూ—'రండి-కాఫీ తీసుకుందాం...' అనేసరికి ఏంమాట్లాడలేక క్రిందికి దిగాను.

"హోటల్‌లో కాఫీ త్రాగుతున్నంతసేపూ నే నెంత సిగ్గుపడ్డానో ఇప్పుడు చెప్పలేను. అతను మౌనంగా కూర్చొని—నా కళ్ళల్లోకి సూటిగా చూస్తూండటం భరించలేకపోయాను. అయినా, తప్పనిసరి అవటం వల్ల నేనూ ఎదురుగా కూర్చున్న అతనికేసి అప్పుడప్పుడు క్రీగంట చూడసాగాను.

"ఎలాగో కాఫీ త్రాగటం ముగించి యిద్దరం తిరిగి కారులో కూర్చున్నాం.

" 'మీ కేమీ అభ్యంతరం లేకపోతే కాస్సేపు బీచిలో కూర్చుందాం...' అన్నాడతను నా కేసి చూస్తూ.

"నేను తల ఊపి సమ్మతి తెల్పాను. ఆ సమయంలో అతని ముఖమండలంపై ఎన లేని తృప్తి నాకు స్పష్టంగా గోచరమైంది.

"బీచిలో దూరంగా యిద్దరం కూర్చున్నాం. అత నేదో మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు గాని- ఆ పనిలో కృత కృత్యుడు కాలేక పోతున్నాడు. అత నేం మాట్లాడాలను కుంటున్నాడో నేను ఊహించుకోలేక పోయాను.

"మా ముందు సముద్రుడు నురుగలు గక్కుతూ తన తరంగ కరాలు చాచి ముందు వెనకలకు ఊగుతున్నాడు. దూరంగా రెండు స్టీమర్లు కదిలిపోతున్నాయి. మేము కూర్చున్న చోటికి నౌకాశ్రయం వద్ద వెలుగుతున్న దీపాలు అక్షరాకారంలో ప్రకాశిస్తూ చూడ ముచ్చట గొల్పు తున్నాయి. ఉదయమనగా సముద్రంలోకి ఉరికిన బెస్తవాళ్లు ఒక్కొక్కరే తమ తమ పడవలతో ఒడ్డు చేరుకుంటున్నారు. అంతవరకు వాళ్ళకోసం వెయ్యి కళ్ళతో కాచుకొని వున్న వాళ్ళ పిల్లలు, ఆడవాళ్లు పడవలోని చేపల్ని చూసుకుని మురిసి పోతూ_వాటిని తమ బుట్టల్లో వేసుకుంటున్నారు. కాలం గడిచే

కొద్దీ స్త్రీ పురుషులు జంట జంటలుగా వచ్చి బీచిలో వాలుతున్నారు.

"నేను చాలాసేపు ఆ నిశ్శబ్దాన్ని భరించలేకపోయాను. అతనేదైనా మాట్లాడితే బాగుండుననిపించింది. నేనే ఆ సాహసం చేద్దామనుకున్నానుగాని, ఏ విషయమై మాట్లాడాలో అర్థంగాక ఊరకున్నాను.

"కాస్సేపటికి అతను నా మనోగతాభిప్రాయాన్ని గుర్తించాడేమో, నెమ్మదిగా మాట కలిపాడు.

" 'చూడండీ! ప్రకృతి రమణీయత ఎంత ముచ్చట గొల్పుతోందో!'

" 'అవునవును.'

" 'ఈ తరంగాల వేగం ఎందుకంటారు?'

" 'ఒడ్డు నొరిసి కరిగి తిరిగి లీనమై పోయేందుకు.'

" 'ఈమాత్రానికే అవి ఎందుకంత వేగంగా ముందుకు పరుగెత్తి రావాలో!...అంతు తెలియని యీ సముద్రం—అలాగే ఆకాశం—తరంగాలు, మేఘమాలికలు—పక్షులు, జంతువులు, మనుష్యులు— పృథివీతలం—యివన్నీ ఎందుకు సృష్టించబడ్డాయో, ఏమో! ఏదీ అర్థం కాదండి...'

" 'సృష్టి రహస్యం పురాణ పురుషులకే బోధపడలేదు. ఇహ మన కెట్లా అర్థమాతుందండి?'

" 'ఏమో! ఒక్కమారు యీ ప్రపంచాన్ని గూర్చి

ఆలోచించేకొద్దీ అన్నీ సమస్యలుగానూ-దుర్భరమైన రహస్య విషయాలుగానూ నాకు తోస్తుంది. సృష్టిలోని ప్రతి ప్రాణికి జననమెందుకో-మరణమేలనో - ఏడ్పులు, నవ్వులు, కష్టాలు సుఖాలు, మమతలు, అనురాగాలు, ఆరాటాలు, ఆవేదనలూ, యివన్నీ ఎందువల్ల ఉద్భవించాయో—దేనికోసం ప్రాణుల నావరించి యీ జగన్నాటకాన్ని ఆడిస్తున్నాయో ఎంత ఆలోచించినా అంతు చిక్కదు. మీరు ఏవైనా వేదాంత గ్రంథాలు చదివారా?'

" 'లేదండి- ఒకటి రెండు పురాణాలు, ప్రబంధాలు మాత్రం చదివాను.'

" 'వాటిపై మీ అభిప్రాయ మేమిటి?'

" 'ప్రత్యేకంగా వాటిపై నాకో అభిప్రాయమంటూ లేదండి.'

" 'నేనూ చాలామటుకు పూర్వీకులు మనకు ప్రసాదించిన గ్రంథాలను పరిశీలించాను. కాని, వాళ్ళ గ్రంథాల్లో మనకు కన్పించే కొందరు పురుషులు ఏవో కొన్ని మహత్కార్యాలు చేసి దైవస్వరూపు లనిపించుకుంటారు. నిజానికి వాళ్ళనే మనం దైవసమంగా పూజించాలంటారా?'

" 'ఈ విషయంలో మన నిర్ణయాలు ఎలాగున్నప్పటికీ భగవంతుడనేవాడు ఒకడున్నాడనే నగ్నసత్యాన్ని మీరు కాదనలేరుగా?'

" 'అవును.'

" 'అలాంటప్పుడు ఆ గ్రంథాల్లో మనకు కన్పించే మహా పురుషులనే దైవ స్వరూపులని అనుకోవటంలో తప్పే ముంటుంది?'

" 'నిజమే!'

" 'మీరు ఎన్ని విధాలుగా, ఎంత కాలం ఆలోచించినా సృష్టి అంటే ఏమిటో—మూల పురుషుడెవ్వరో తెలిసి రాదండి. ఈ విషయాలను ఆమూలాగ్రంగా తెలుసుకునేందుకు మన కున్న యీ జీవితం చాలదేమో!'

" 'ఈ మీ అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తున్నా నండి...' అన్నాడతను.

"అప్పటికే బీచిలో చీకట్లు ఆవరించసాగాయి. క్రమ క్రమంగా జనం పలచబడసాగారు. ఈపాటికి అమ్మ యింటి కొచ్చివుంటుంది. నేనింకా రాలేదని కంగారుపడుతూంటుంది. అతనేమో యిప్పుడిప్పుడే లేచేట్లు లేడు. ఏం చెయ్యాలి అనుకుంటూ అలాగే కాస్సేపు కూర్చుండిపోయాను.

"నా అభిప్రాయాన్ని అతను కొన్ని క్షణాల అనంతరం గుర్తించాడేమో నన్నట్లుగా అక్కడినుండి లేస్తూ— 'పోదాం, పదండి. చాలా ప్రొద్దుపోయింది' అన్నాడు.

"నేను ఇంటికి చేరుకునేసరికి దైవవశాత్తు అమ్మ ఇంకా రాలేదు. నావద్ద నున్న మారుతాళం చెవితో తలుపు తెరచు

కొని- గదిలో కూర్చున్నాను. అమ్మ వచ్చేసరికి రాత్రి చాలా ప్రొద్దు పోయింది.

"ఏమిటోగాని నేనెంత ప్రయత్నించినా ఆ రాత్రి నిద్ర పట్టలేదు. కారులో అతనితోపాటు వెళుతున్నప్పటి-బీచిలో మాట్లాడుతున్నప్పటి దృశ్యాలే అనుక్షణం నా కళ్ళముందు నిల్చి-తీయని భావపరంపరలతో శరీరమంతా గగుర్పొడిచింది.

"మరుసటిదినం కూడా సుధాకర్ కారుతోపాటు బస్ స్టాప్ వద్ద హాజరయ్యాడు.

" 'మీకు చాలా శ్రమ యిస్తున్నాను...' అన్నాను అతనితో.

" 'ఇందులో శ్రమ ఏముందీ! ఈమాత్రమైనా మీకు సహాయపడుతున్నందుకు గొప్పగా పొంగిపోతున్నాను...' అన్నాడు నాకేసి చిలిపిగా చూస్తూ.

" 'దయచేసి యికనుండి నన్ను 'రాధా' అని పిలవండి. అలా పిలిస్తే చాలా సంతోషిస్తాను.'

" 'నన్నూ 'సుధా' అని పిలిస్తే మరింత సంతోషిస్తాను' అన్నాడతను నవ్వుతూ.

"ఇద్దరమూ హృదయపూర్వకంగా నవ్వుకున్నాం. క్షణంలో కనులూ కనులూ కలుసుకొని ఏవేవో రహస్యాలు మాట్లాడుకున్నాయి. ఆ విధంగా మా యిద్దరి హృదయాలు వాటికవే పెనవేసుకున్నాయి.

"వరుసగా నాలుగైదు రోజులు గడిచిపోయాయి. ఆ రోజుల్లో ప్రతి దినం బీచి కెళ్ళేవాళ్లం. కొంతసేపు సాహిత్యం మీదా_మరి కొంతసేపు సంగీతంమీద చర్చించుకునేవాళ్లం. ఈ చర్చల ఫలితంగానూ యిరువురి మనస్తత్వాలు, అభిరుచులు, ఆశయాలు స్పష్టంగా బహిర్గతమయ్యేవి.

"చూస్తూ చూస్తూండగానే ఎప్పుడో వారం రోజులూ పూర్తయ్యాయి. ఒక దినం సుధాకర్‌కు బదులు శశికళ కారులో రావటం చూసి మొదట్లో కాస్త తొట్రుపడ్డాను. అయినా, నన్ను నేను సమాళించుకొని మందహాసం చేశాను.

" 'ఎప్పుడొచ్చావ్, శశీ!...' అనడిగాను ముందుకు వెళ్ళి.

" 'నిన్ననే వచ్చాను రాధా! మా రఘుబావ బెంగుళూరులోనే వుండిపోయాడు. అక్కడే యీ మూడు రోజులూ చదివి పరీక్షలకు మాత్రం వస్తాడట' అంది శశి.

"ఆమె చెబుతున్న మాటలు వింటున్నానో లేదో కాని, నా దృష్టంతా సుధాకర్ కారుకోసం రోడ్డుమీదికి మళ్ళింది.

"నాలోని ఆరాటాన్ని శశి గమనించిందేమో, నవ్వుతూ 'ఎందు కలా దిక్కులు చూస్తున్నావ్? టయమైంది. పోదామా?' అంది.

" 'ఆఁ! ఆఁ!' అన్నానే కాని, ఎంతసేపటికీ నేను కారులో కూర్చోలేదు.

"అంతలో తిరిగి శశికళ అందుకుంది: 'రాధా! ఎవరి కోసమే అలా ఆరాటపడుతున్నావు! ఈ వారం రోజుల్లో ఎవరినైనా క్రొత్త స్నేహితుల్ని సంపాదించుకున్నావా?'

" 'అబ్బే! లేదే.'

" 'మరి ఏమిటా చూపులు?"

" 'ఆఁ! ఆఁ! ఏమీ లేదు. పద, వెళదాం...' అని వెళ్ళటం తప్పనిసరి కావటంతో కారులో కూర్చున్నాను.

"వెంటనే కారు కదిలింది.

" 'నువ్వెదురు చూస్తున్న మనిషి యీ దినం రాడు లేవే!—' అంది శశి.

"నేను ఆశ్చర్యపోతూ—'ఎవరే నేను ఎదురు చూసే మనిషి...' అన్నాను.

" 'ఇంకా నా ముందు దాపరికమెందుకు? సుధ కోసం కాదూ, నువ్వింతసేపట్నుంచి ఆరాటపడుతోంది. అవునుగాని మీ యిద్దరి ప్రణయం ఎంతవరకు వచ్చింది.'

"శశి ఆ విధంగా మాట్లాడేసరికి— ఆమెకు మా యిద్దరి విషయం తెలిసిపోయిందనుకొని బిడియపడ్డాను. ఏం మాట్లాడకుండా మౌనంగా కూర్చుండిపోయాను.

" 'రాధా! నా ఊహ నిజమేనా?' అనడిగింది, కొంత సేపటికి శశి.

" 'నిజమే శశీ...' అన్నాను ఎలాగో ధైర్యం చేసి.

" 'సుధాకర్ యింతకు మునుపే నా కన్ని సంగతులూ చెప్పాడు. స్త్రీని గనుక అతనిపై నీకెలాంటి అనురాగముండేదీ స్పష్టంగా తెలుసుకోగల్గాను. నిజంగా మీ యిద్దరూ అదృష్ట వంతులు.'

"శశి ధోరణి చూసి నా నోటంట మాట పెగల లేదు. ఆమె కళ్ళల్లోకి ప్రియంగా చూస్తూ కూర్చున్నాను.

" 'రాధా! ఈ సమయంలో నీకో విషయం చెప్ప దలచాను. సుధాకర్ నిన్ను తన ప్రాణప్రదంగా ప్రేమించు కుంటున్నాడు. ఎట్టి పరిస్థితుల్లోనూ అతని ప్రేమను నువ్వు శంకించకు. నీకన్నా అతని హృదయ నైర్మల్యం స్పష్టంగా నాకు తెలుసు. నీ కోసం అతనేమైనా చేసేందుకు వెనుదియ్యడు. అలాంటి త్యాగమూర్తి నిన్ను కోరటమే ఒక మహా అదృష్టం. ఇహ నీ జీవితంలో ఎలాంటి లోటూ వుండబోదు.'

"నేనామె మాటలు వింటూ ఎక్కడో ఆకాశ పథాల్లో విహరించసాగాను. సుధాకర్ నన్ను గాఢంగా ప్రేమిస్తున్నాడని శశికళ ముఖతః వినేసరికి నేను పొందిన మధురానుభూతి వర్ణింప శక్యం గానిది. నా జీవితంలో యిక చీకటి వుండబోదనీ – బ్రతుకంతా వెన్నెలమయమేననీ పొంగి పోయాను.

"శశికళ వాచా వాత్సల్యానికి– ఆమె చెప్పిన సంతోష వార్తకు ముచ్చటపడుతూ – ఆ దినంతో పాటు మరికొన్ని దినాలు ముందుకు సాగాను.

''మార్చి నెల ఆరంభం కాగానే పరీక్షల విషయంలో అమ్మ హెచ్చరించింది. క్షణక్షణం సుధాకర్ విగ్రహమే నా కళ్ళముందు నిలిచి మనస్సును గజిబిజి చేస్తున్నా - నన్ను నేను నిగ్రహించుకొని రాత్రింబగళ్లు చదువు సాగించాను.

''క్రమంగా ఎదురు చూసిన పరీక్షలూ వచ్చాయి. వచ్చినవి వచ్చినట్టుగానే తిరిగి వెళ్ళిపోయాయి. అన్ని పరీక్షా పత్రాలూ బాగా వ్రాసినప్పటికీ నాలో ఎందుకో అసంతృప్తి మిగిలిపోయింది. ఒక దినం నాతో ఏకాంతంగా కలుసుకున్న సుధాకర్‌తో యీ విషయమై చెప్పాను.

''అతను నవ్వి - 'అయితే నువ్వు తప్పకుండా పరీక్షల్లో కృతార్థురాలివి అవుతావు' అన్నాడు.

'' 'నాతో హాస్యమాడుతున్నావా?' అనడిగాను.

'' 'కాదు రాధా! నువ్వు తప్పక పాసవుతావ్. ఏమీ చదవని వాళ్ళకు తాము అన్నింటిలోనూ నెగ్గుతామనే ధీమా వుంటుంది. కాని, అన్నీ చదివిన వాళ్లు పరీక్షలంటేనే హడలి పోతుంటారు. ఈ సైకాలజీ చూస్తే నీ విషయంలో - తప్పక పాసవుతావనే బోధపడుతోంది. అవునుగాని, నీ భవిష్య త్కార్యక్రమ మేమిటో నిర్ణయించుకున్నావా?'

'' 'లేదు సుధా!'

'' 'ఏం ?

'' 'నా భవిష్యత్తును నిర్ణయించవలసింది మా అమ్మ.'

'' 'నువ్వన్నదీ నిజమే. మీ అమ్మ ఆరోగ్యం ఎలా వుంది?'

''ఆ ప్రశ్నతో నా ముఖంలో విచారమేఘాలు అలుము కున్నాయి.

'' 'ఏం జరిగింది రాధా? మీ అమ్మ ఆరోగ్యంగా లేదా?' అని ఆత్రుతగా సుధ ప్రశ్నించాడు.

'' 'ఆమె నా పైని దిగులుతో దినదినాకి కృంగి పోతోంది సుధా! తన తర్వాత నాగతి ఏమవుతుందోనని ఆమె బాధంతాను. ఎన్ని విధాలుగా వూరడించినా – నన్ను గురించి చింతించటం మానుకోదు. ఏం చెయ్యను నేను?'

'' 'ఇందులో నువ్వు చెయ్యగల్గింది ఏమీ లేదు రాధా! ప్రతి మాతృహృదయం తమ సంతానం కోసం ఆ విధంగానే వ్యథ చెందుతుంటుంది' అన్నాడతను.

''అంతటితో మా సంభాషణ ఆగిపోయింది. నేను తిరిగి యింటికి వచ్చేసరికి అమ్మ మంచంలో పడుకొని వుంది. కంగారుపడుతూ ఆమె వద్ద కెళ్ళి మంచంలో కూర్చున్నాను. ఆమె చెప్పిందంతా వినేసరికి నా గుండెలు గుభేల్ మన్నాయి.

''అమ్మకు తిరిగి వుదయం నుండి గుండె జబ్బు ఆరంభ మైందట. పూర్తిగా ఆయాసపడుతూ వుండటంవల్ల ఏమీ చెయ్యలేక యింటికి తిరిగి వచ్చింది. వెంటనే ఆస్పత్రి వెళ్లి మందు తీసుకొచ్చాను.

''ఆ దినమంతా అమ్మ మంచం దిగలేదు. ఆయాస పడుతూ అలాగే మంచంలో పడుకొని వుండిపోయింది. అమ్మ స్థితికి నా కళ్ళంబడి అశ్రువులు స్రవించాయి. ఆమెను కావులించు కొని భోరున ఏడ్చాను.

" 'పిచ్చిపిల్లా! ఎందుకే ఏడుస్తావ్? ఇప్పుడు నాకేమైందని?' అంది అమ్మ.

"కేవలం నన్ను వూరడించేందుకే ఆమె అలా మాట్లాడుతోందని నాకు తెలుసు.

" 'అమ్మా! నువ్విలా అయాసపడుతూంటే చూస్తూ నేను భరించలేనమ్మా!' అని రెండు చేతులతో ముఖం కప్పుకొని ఏడ్వసాగాను.

" 'నా కోసం దిగులు పడకు తల్లీ! నువ్వు కంటతడి పెడుతూంటే చూస్తూ నేనూరుకోలేను. భగవంతుడు మన నొసట యింతవరకే వ్రాశాడు కాబోలు! ఏడ్చి ప్రయోజన మేమిటమ్మా?'

" 'అమ్మా! నీ రెక్కల కష్టంతో నన్నింత దాన్ని చేశావ్. బి. ఏ. వరకూ చదివించావ్. ఇప్పుడైనా నేను ఉద్యోగం చేసి- నీ బరువును తొలగిస్తానమ్మా!'

"అందుకు అమ్మ గాఢంగా నిట్టూర్చి 'పిచ్చిదానా! నాపై నీ కెంత ప్రేమే!' అని కళ్లు మూసుకుంది.

"ఆ రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాల్లో శశికళ మా యింటికి వచ్చింది. తన పెళ్ళి బెంగుళూరులో జరగబోతోందనీ- వచ్చే గురువారంనాడు ముహూర్తమనీ- తప్పకుండా నన్నూ, అమ్మను రమ్మనీ చెప్పింది. నే నా సమయంలో వున్న పరిస్థితిని యధాతథంగా చెప్పేందుకు ఎందుకో జంకాను. నేను వచ్చేందుకు వీలుకాని స్థితిలో వున్నానని చెబితే ఆమె

ఏమనుకుంటుందోనని - మాటవరసకి అలాగే నన్నాను. సంతృప్తితో శశికళ వెళ్ళిపోయింది.

"నిజంగానే నేనామె పెళ్ళికి వెళ్ళలేకపోయాను. సుధాకర్ బెంగుళూరునుండి తిరిగి వచ్చాక- నేను పెళ్ళికి రానందుకు శశికళ, రఘురామ్‌లు చాలా బాధపడ్డారని చెప్పాక- నా బేలతనానికి కృంగిపోవటం తప్ప ఏమీ చెయ్యలేకపోయాను.

"పెళ్ళి కాగానే దంపతు లిద్దరూ హనీమూన్‌కు కాశ్మీర్ వెళ్ళిపోయారని తెలిసింది. ఆనాటినుండి యింతవరకు వాళ్ళు ఎక్కడున్నారో- ఏం చేస్తున్నారోకూడా నాకు తెలియదు.

"పరీక్షా ఫలితాలు ప్రకటించబడ్డాయి. నేనూ, సుధాకర్ యిద్దరం ఫస్ట్ క్లాస్‌లో ప్యాసయ్యాం. ఆ దినం సాయంకాలం బీచిలో కూర్చొని భావి జీవితాన్ని గురించి ఎన్నెన్నో కలలు కన్నాం. కాని, నా కలలు కొన్ని మాసాలైనా గడవక ముందే కల్ల లయ్యాయి. ఎంతో మధురంగా ఊహించుకున్న జీవితంలో పెనుతుఫాన్ లేచింది.

"ఒక దినం సూర్యాస్తమయంతోపాటు- అకస్మాత్తుగా గుండె ఆగిపోవటంవల్ల అమ్మ అస్తమించింది. అన్నాళ్ళూ నన్ను పెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించిన అమ్మ కొన్ని క్షణాల తేడాతో నన్ని లోకంలో ఏకాకిని చేసి వెళ్ళిపోయింది. ఒక్క డిగ్రీ తప్ప యీ ప్రపంచంలో నాకేమీ మిగల లేదు.

"అమ్మ అస్తమయంతో అన్ని ఆశలకూ నాలోనే

సమాధి గట్టుకున్నాను. ఆత్మీయులు లేని బ్రతుకు అంధకారం వలె తోచింది నాకు. కాని, నన్ను నేను పోషించుకునేందుకు ఏదో ఒక దారి వెతుక్కోక తప్పలేదు. తత్ఫలితంగా మైలాపూర్‌లోని ఒక జమీందారు కుటుంబానికి ఆయాగా వెళ్ళ వలసి వచ్చింది.

"ఆ జమీందారిణి అంధురాలు కావటంవల్ల నే నామెను అంటిపెట్టుకొని వుండటమే నాకు పనిగా నిర్ణయించారు. అంత పెద్ద భవంతిలో ఎక్కడెక్కడ ఎవరెవరు వుంటున్నారో తెలుసుకునేందుకు- నేను పనిలో చేరిన ఆ ఒక్కదినం చాలలేదు.

"జమీందారు విజయశర్మగారు ఆ సాయంకాలం నన్ను జగ్గుతాతను పిలుచుకొని రమ్మని మేడపైకి పంపించారు. నేను మేడమెట్లెక్కి పైకి వెళుతుండగా అకస్మాత్తుగా సుధాకర్ నాకు ఎదురయ్యాడు.

"ఉభయులం క్షణకాలం చేష్టలుదక్కి ఎక్కడివాళ్ళ మక్కడే నిల్చుండిపోయాము. కొంతసేపటికి నేను సమా ళించుకున్నాను.

" 'రాధా! ఎప్పుడొచ్చావ్?' అనడిగాడు సుధాకర్.

"అతను వేసిన ప్రశ్నవల్ల నాకు సమస్తమూ బోధ పడింది. నే నెవరినైతే మనసారా ప్రేమిస్తున్నానో- ఆ నా హృదయేశ్వరుని యింటిలోనే ఆయాగా ప్రవేశించానని తెలుసు కున్నాను. అనుకున్న దొకటి- జరిగింది మరొకటి.

" 'ఉదయంనుండి యిక్కడే వుంటున్నాను' అన్నాను ఎలాగో తడబడుతూ.

" 'మరి నాకు కబురు చెయ్యలేదేం?'

" 'నీకోసం కాదు నేను వచ్చింది; ఈ యింట్లో నౌఖరీ చేసేందుకు...'

" 'నౌఖరీయా?'

" 'అవును. ఎందుకలా ఆశ్చర్యపోతావ్ సుధా! నేను డ్యూటీలో చేరి యిప్పటికే ఆరుగంటలైంది.'

" 'నేను కలగంటున్నానా! లేక, నువ్వు హాస్యమాడుతున్నావా? ఏది నిజం రాధా!' అన్నాడతను ఉద్రేకంగా.

"అప్పటికి అతని వాలకాన్ని చూసి నిజంగానే నేను హడలిపోయాను.

" 'ఉష్! గట్టిగా మాట్లాడకు. మీ నాన్నగారు క్రింద వున్నారు. మన మాటలు వింటే అనుమానపడతారు. నేను యింతవరకూ చెప్పింది అక్షరాలా నిజమే. తీరిక చూసుకొని మళ్ళీ అన్ని విషయాలూ మాట్లాడుకుందాం. ఇప్పటికి నన్ను వెళ్ళనివ్వు' అని నేను అతని సమాధానం కోసమైనా ఎదురు చూడకుండా గబగబా ముందుకు వెళ్ళిపోయాను.

"ఆ రాత్రి నేను తిరిగి యింటికెళ్ళేందుకు వీలులేకపోయింది. జమీందారుగారు నన్ను పిలిచి– ఆ బంగళాలోనే మేడపైన నాకోసం ఒక గది ఏర్పాటు చేసినట్లు– అక్కడే వుండిపొమ్మని ఆదేశించారు.

"ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయాక సుధాకర్ నా గదిలోకి వచ్చాడు. అప్పటి అతని ముఖ కవళికల్ని చూసి

అత నెంతో బాధపడుతున్నాడని సులభంగా అర్థం చేసుకున్నాను.

" 'కూర్చో' అంటూ కుర్చీ చూపించాను.

"సిగరెట్ వెలిగించుకుంటూ కుర్చీలో కూర్చున్నాక-అతనే ముందుగా మాట కలిపాడు.

" 'రాధా! నువ్విలా ప్రవర్తించటం ఏమీ బాగా లేదు. నువ్విలా చెయ్యటంవల్ల నే నెంత మధనపడుతున్నానో నీ కెలా విశదీకరించి చెప్పను? ఈ యింటి కోడలిగా రావలసిన నువ్వు- సామాన్యమైన ఒక నౌకరుగా ప్రవేశించటమా?'

" 'ఉద్యోగం చెయ్యాలనుకున్నా నేగాని- ఆ చెయ్యబోయే ఉద్యోగమిదనీ, యిక్కడే చెయ్యవలసి వుంటుందని అనుకోలేదు. విధి నిర్ణయం మన ఎడ ఏ విధంగా వ్రాసివుందో, ఏమో- సుధా! నా విషయంలో నువ్వేమీ దిగులుపడకు. ఈ యింటి కోడలిగానైనా- నౌకరుగానైనా మీ కుటుంబానికి సేవ చెయ్యటంలోనే నేను గొప్ప సంతృప్తి పొందుతున్నాను. నేను తృప్తిపడటం నీ కిష్టం కాదా?'

" 'అదేం మాట రాధా! నువ్వు దేనిలోనైతే ఆనందాన్ని పొందగలవో - అది మాత్రం నాకు ఆనందాయకమైనది కాదా! కాని, నువ్వు తొందర పడ్డావ్. నాతో ఒక్క మాటైనా చెప్పకుండా వుద్యోగంలో ప్రవేశించవలసినంత అవసరమే మొచ్చింది?'

"అందుకు నేనేమీ బదులు చెప్పలేక పోయాను.

కాసేపు ఉభయులమూ ఏమీ మాట్లాడుకోలేదు. నిశ్శబ్దం గదిని ఆక్రమించుకుంది.

"కొంతసేపటికి అతనా నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ నెమ్మదిగా_ 'రాధా!' అని పిలిచాడు.

"నేను తలెత్తి అతని కళ్ళల్లోకి చూడసాగాను.

" 'ఒక్క మాట అడగనా? నువ్వేమీ అనుకోవుగా?'

" 'ఫరవాలేదు. చెప్పు సుధా!'

" 'నన్ను గురించి నువ్వెప్పుడైనా ఆలోచించావా, రాధా?'

" 'ఇదేం ప్రశ్న! నిన్ను గురించే నేను ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటాను.'

" 'అయితే నాపై నీ అభిప్రాయ మేమిటి?'

" 'నువ్వు సహృదయుడివి. కనుకనే నీతో యింత చనువుగా నేను మాట్లాడగలుగుతున్నాను.'

" 'ఇంతేనా! మరి నాపై నీకు విశ్వాసం లేదా?'

" 'ఎందుకు లేదు. నువ్వు ఆడి తప్పని వాడివి.'

" 'నిజం నువ్వే ఒప్పుకుంటావు. అయితే, యిప్పుడు నువ్వు చేసిన పనేమిటి? నాపై విశ్వాసం వుండబట్టా, లేకనా నువ్వీ వుద్యోగంలో చేరింది? దాపరికం లేకుండా నీ మనసులోని అభిప్రాయ మేమిటో స్పష్టంగా చెప్పు రాధా!'

" 'అమ్మ పోయాక నాలో మనోబలం అంతరించింది సుధా! ఆశయాలు, ఆవేశాలు నిత్యజీవితంలో ఎంతమాత్రం వుండరాదనుకుంటున్నాను. నీపై నాకు ఎనలేని విశ్వాస ముంది.

కాని, నీ అంతస్థు చూడగానే - నాలోని ఆశ అణగారి పోసాగింది. నీ జీవిత భాగస్వామినిగా పాలు పుచ్చుకునేందుకు నాకున్న యీ అర్హత చాలదనుకుంటున్నాను. అందుకే-'

'' 'అందుకే యీ వుద్యోగంలో చేరానంటావు. నన్ను మరచిపొమ్మని చెప్పేందుకు నిర్ణయించుకున్నానంటావు? ఇదే నీ అభిప్రాయమైతే నా జీవితం విచ్ఛిన్నమై పోతుందనే నగ్న సత్యాన్ని తెలుసులేక అపోహపడుతున్నావు. నాకు నువ్వు దూరమైతే - నేనేదో గొప్పింటి పిల్లను పెళ్ళాడి సుఖించ గలనని భ్రమసి పోతున్నావే కాని, అందువల్ల నా జీవిత శిఖరం శిథిలమై పోతుందనే నిజాన్ని ఊహించలేక పోయావు? రాధా! నీపై నేనెన్ని ఆశలు పెట్టుకున్నాను. నిన్ను గూర్చి ఎన్ని కలలు కన్నాను. నా ఆశలు, కలలు అన్నీ కరిగి పోవల్సిందేనా? నా బ్రతుకు ఎడారి పాలు కావల్సిందేనా? చెప్పు రాధా! నేనేమై పోను?' అంటూ సుధాకర్ నావైపు దీనంగా చూశాడు. అతని ఆవేదనను గుర్తించగానే నా కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి.

'' 'సుధా! నువ్వింత బాధపడతావని అనుకోలేదు. నా కోసం నువ్వింత దృఢ నిశ్చయుడవయ్యావని తెలుసుకోలేక పోయాను. ఈ ప్రపంచంలో నువ్వు తప్ప నాకెవరున్నారు? నేను చేసిన యీ తప్పిదానికి నువ్వే శిక్ష విధించినా అనుభవించేందుకు సిద్ధంగా వున్నాను' అన్నాను నేను.

''ఆ మాటలతో సుధాకర్ ముఖం వికసించింది. ఆ

ఆనందో(ద్రేకాన్ని భరించలేక గభాలున నన్ను కావులించు కున్నాడు.

" 'రాధా! నా రాధా! నిజంగా నేను విధించే శిక్షను హృదయపూర్వకంగా మన్నిస్తావా? అయితే, నువ్వు నాకు భార్యవు కావటమే నేను విధించబోతున్న శిక్ష' అన్నాడతను ఆనంద బాష్పాల్ని రాలుస్తూ.

" 'ఈ మన పెళ్లికి మీ నాన్నగారు ఒప్పుకోవద్దా?' అని సందేహం వెలిబుచ్చాను.

" 'మన పెళ్ళినిక ఎవ్వరూ ఆపలేరు రాధా! నాన్న ఒప్పుకోకపోయినా యీ పెళ్ళి ఆగదు. అయినా, యీ విష యాన్ని యిప్పుడే ఆయనకు చెప్పటం ఉత్తమం కాదు. మంచి ముహూర్తం చూసి యిద్దరం మహాబలిపురంలో అగ్ని సాక్షిగా వివాహం చేసుకుందాం. కొన్నాళ్లు పోయాక వారికీ సంగతి తెలిసినా - చేసేదేమీలేక ఊరకుండిపోతారు. అంతవరకు మనమీ రహస్యం ఎక్కడా బయటపెట్టకూడదు. ఏమంటావు రాధా?"

" 'ఈ క్షణం నుండి మీరేం చెబుతే దాన్ని అక్షరాలా పాటించేందుకు సిద్ధంగా వున్నాను. అయితే, నాదో చిన్న మనవి. నేను యిక్కడే మీ సమక్షంలో యీ యింటి నౌకరుగా వుండేందుకు ఎలాంటి అభ్యంతరం చెప్పకూడదు' అన్న నా అభి(ప్రాయానికి అతను కూడా ఏకీభవించటంతో నాకెంతో ఆనందమైంది.

"మేము నిర్ణయించుకున్న (ప్రకారం ఒక మంచి

ముహూర్తంలో మహాబలిపురం వెళ్ళి అగ్నిసాక్షిగా వివాహం చేసుకున్నాం. ఆ మా పెళ్ళికి ముఖ్యంగా జగ్గు తాత సహకరించాడు. ఆ రాత్రే సుధాకర్‌కు నా సర్వస్వాన్ని అప్పచెప్పి - అతనితోపాటు నేనూ ఆనంద సామ్రాజ్యంలో విహరించాను.

"ఆ విధంగా కొన్ని మాసాలు కాలగర్భంలో లీనమైపోయాయి. అప్పటికే నేను గర్భం దాల్చాను. సుధాకర్‌కు యీ విషయం చెప్పగానే అతను మహదానంద భరితుడయ్యాడు.

"కాని, ఆ సంతోషం మా యిరువురి మధ్యా చాలా కాలం వుండలేదు. సుధాకర్‌ని బారెట్లా చదివేందుకు ఇంగ్లాండు వెళ్ళవలసిందిగా వాళ్ళ నాన్న నిర్బంధం చెయ్యటంతో నాకేమీ తోచలేదు. రెండు రోజులు దీర్ఘంగా ఆలోచించాను. చివరకు అతను విదేశాల కెళ్ళి - గొప్ప చదువులు చదవటమే అన్ని విధాల శ్రేయస్కరమైనదని నిర్ణయించుకున్నాను.

"ఆ రాత్రి సుధాకర్‌తో ఆ విషయమై ప్రస్తావించాను : 'నీ అభ్యున్నతే నా అభ్యున్నతి కాదా, సుధా! నా కోసమని నువ్విక్కడే ఆగిపోవటం మంచిది కాదు. నాకేమీ భయం లేదు. నువ్వు తప్పకుండా యింగ్లాండు వెళ్లు' అన్నాను.

"ఈ మాటలు అన్నానేగాని నా హృదయ మెందుకో అశాంతిపూరితమై వుంది. గుండె లెందుకో ఊరకే కొట్టుకో సాగాయి. మాటిమాటికీ కుడి కన్ను అదర సాగింది. ఇన్ని

అశుభాలకు కారణమేమిటో బోధపడక నాలో నేను మథన పొందాను.

"ఏమైతేనేమి, నా సుధాకర్ నన్ను విడిచి విదేశాలకు వెళ్ళిపోయే దినం దగ్గరపడింది. ఆ దినం నేనుకూడా ఎలాగో వీలు చూసుకొని విమానాశ్రయంకి వెళ్ళాను. చివరిసారిగా అతనికి వీడ్కోలు చెప్పి- కన్నీళ్ళతో తిరిగి యింటికి వచ్చాను. ఈ జీవితానికి కక అదే చివరిసారి నే నతన్ని చూడటం. విధి యింత త్వరలో నాపై పగ బూనుతుందని ఏనాడూ ఊహించ లేదు. అలాంటిది జరిగింది కళ్యాణీ!

"ఆ రాత్రి నేనే పనీ చెయ్యలేకపోయాను. శరీరం స్వాధీనం తప్పింది. ఆలోచించి, ఆలోచించి మస్తిష్కం మొద్దుబారింది. చాటుగా బాత్ రూమ్‌లో కెళ్ళి రెండు మూడుసార్లు వాంతులు కూడా చేసుకున్నాను. అదేమి చిత్రమోకాని, కళ్ళు గిర్రున తిరగసాగాయి. నన్ను నేను నిగ్ర హించుకోలేక మధ్య హాలులో తూలి క్రింద పడిపోయాను. అంతే!అటు తర్వాత ఏం జరిగిందో నాకు తెలియదు.

"అర్ధరాత్రప్పుడు కళ్లు విప్పి చూశాను. జగ్గు తాత నాతోపాటు మేడమీద నా గదిలో వుండటం చూసి లేచి కూర్చున్నాను.

" 'పడుకోండమ్మా! మీ ఒంట్లో బాగాలేదు...' అన్నాడు జగ్గుతాత.

" 'ఏం జరిగింది తాతా! నేను క్రింద పడిపోయానే, ఇక్కడి కెవరు చేర్చారు?' అనడిగాను.

" 'నువ్వు స్పృహతప్పి క్రింద పడిపోయావమ్మా! అప్పుడు పెద్ద బాబుగారు చూశారట. వెంటనే నన్ను పిలిచి లేడీ డాక్టర్‌ను పిలుచుకొని రమ్మని కారులో పంపారు. నేను కొన్ని క్షణాల్లో డాక్టరమ్మను తీసుకొచ్చాను. ఆమే స్వయంగా పరీక్షచేసి మీకు మూడుమాసాలు నిండాయని బాబుగారితో చెప్పింది. ఆ పైన నేనే మిమ్మల్ని పైకి మోసుకొచ్చాను.'

" 'బాబుగారు ఏమైనా అన్నారా?'

" 'లేదమ్మా! ఆయన అంతర్యంలో ఏముందో బ్రహ్మకైనా అంతుపట్టదు. ఉదయం వారేమైనా ప్రశ్నిస్తే- తప్పని సరి అయితేమాత్రం యదార్థం చెప్పండమ్మా! ఎన్నాళ్ళని నిజాన్ని దాచిపెడతారు? ఏనాటికైనా యీ విషయం చెప్పక తప్పదుగా!'

" 'నిజమే తాతా! పరిస్థితి తలక్రిందులయ్యే పక్షంలో నిజం చెప్పి తీరుతాను. ఆవల భగవన్నిర్ణయం ఎలా వుంటే అలా జరిగి తీరుతుంది' అన్నాను నేను.

"ఉదయం ఎనిమిది గంటలకల్లా బాబుగారినుండి పిలుపు వచ్చింది. ఆయన నన్నేం ప్రశ్నిస్తాడో నని లోలోపల భయ పడుతూనే- వారి గదిలోకి వెళ్ళాను.

"ఆయన నన్ను చూడగానే- 'అమ్మాయ్! మొదట్లో నీకు పెళ్ళి కాలేదని యీ ఉద్యోగంలో చేరబోతూ చెప్పావ్, జ్ఞాపకముందా?' అనడిగాడు.

" 'జ్ఞాపక ముందండి' అన్నాను జంకుతూనే.

" 'మరి నీకీ గర్భం ఎట్లా వచ్చింది?' అని చట్టున

ఆయన ప్రశ్నించేసరికి నా నోటంట మాట పెగలలేదు. స్తబ్ధురాలనై అలాగే చూస్తూ వూరకున్నాను.

" 'పలకవేం అమ్మాయ్! ఇంత నీచానికి పాల్పడిన ఆ దౌర్భాగ్యుడెవరో చెప్పు. నువ్వే యీ పాపానికి ఒడిగట్టి ముందుగా సాహసించావా? లేక, ఆ నీచుడే నిన్నీ స్థితికి తీసుకు వచ్చాడా? రాత్రింబగళ్లు యిక్కడే వుంటూ— ఆ నీచునితో నువ్వెట్లా రహస్యకాపురం చేశావ్?' అని ఆయన కఠినంగా అడిగినదానికి నే నేమీ బదులు చెప్పలేకపోయాను.

" 'బండరాయిలా పలకవేం అమ్మాయ్! మర్యాదస్తుల కుటుంబంలో పనిచేస్తూ— మా అందరికీ మచ్చ తెచ్చేలా ప్రవర్తించటం మంచిది కాదు. చదువుకున్నదానివని ఆదర్శ స్త్రీ-యిలాంటి నీచపు పనులకు పూనుకుంటావని అనుకోలేదు. అందుకే కులమైనా— బుద్ధి అయినా మనిషికి వున్నతంగా వుండాలన్నారు ఆర్యులు. నువ్వు శూద్రదానివి కావటం వల్లనే— ఒళ్లు మరచి యిలా ప్రవర్తించావ్. ఛీ! ఛీ! ఆడజాతి నీలాంటి వాళ్ళవల్ల భ్రష్టు పడిపోతోంది.'

"ఆ మాటలు నా గుండెల్లో తూట్లు పొడిచాయి. ఆయన నన్ను అపార్థం చేసుకొని నోటికొచ్చినట్లల్లా మాట్లాడటంతో నాలో చెప్పలేనంత ఆవేశం కల్గింది. ఆ సమయంలో ఎక్కడినుండి వచ్చిందో నా కంత ధైర్యం— ఆయనని ఎదిరించి మాట్లాడాను.

" 'మీరు అనుకున్నంత నీచమైన పని ఏదీ నేను చెయ్యలేదండి. నాకూ ఆత్మాభిమానం వుందనే సంగతి గమనించి

వుంటే మీ రిలా మాట్లాడేవారు కారు. మీ రన్నట్లు కులం తక్కువదాన్నే అయినా, నాలో గుణం లోపించ లేదు. ఆడ జాతికి మచ్చ తెచ్చే కళంకమైన నీచ కృత్య మేదీ నేను చేసి వుండ లేదు. మనసారా ప్రేమించిన వ్యక్తిని అగ్నిసాక్షిగా వివాహం మాడాను. తత్ఫలితమే యీ గర్భం. అంతేకాని, మీరు లేనిపోని అపోహలతో కించపడ నవసరం లేదు. అయినా, యిది నా వ్యక్తిగతమైన విషయం. ఇందులో మీరు జోక్యం కల్గించుకోవటం మంచిది కాదు' అని నేను పలికేసరికి ఆయన మహోగ్రు డయ్యాడు.

" 'పిల్ల వచ్చి గ్రుడ్డును వెక్కిరించినట్లుంది నీ వ్యవహారం. అమ్మాయ్! మంచిగా చెబుతున్నాను నా మాట విను. లేకపోతే చెడిపోతావ్. నన్ను ఎదిరించి మాట్లాడినంత మాత్రాన్నే తీరిపోయిం దనుకుంటున్నావేమో! నే నొక్కన్నే కాదు, యీ ప్రపంచమంతా నువ్వు చేసిన యీ పనికి అసహ్యించుకుంటుంది. ఛీ- ఛీ అని తూలనాడుతుంది. అప్పుడైనా నువ్వు నిజం బయటపెట్టక తప్పదు. ఇప్పుడైనా చెప్పు, నువ్వు ఏ నీచునితో కలిసి యీ పాపానికి ఒడికట్టావు?'

" 'నిజం చెప్పినా మీరు నమ్మరేమో!'

" 'తగిన సాక్ష్యాలు వుంటే నమ్మకపోవడమేమిటి?'

" సాక్ష్యాలతో ఋజువు చేసేందుకు నే నిక్కడ కోర్టులో నిలబడి వుండలేదు. దోషినీ కాను. పంచ భూతాల సాక్షిగా పరిణయమాడిన వ్యక్తివల్లనే నాకీ గర్భం కల్గింది.'

" 'నీ వుపోద్ఘాతం చాలించి ఆ నీ భర్త ఎవరో చెప్పు. ఇప్పుడే అతనివద్దకి నిన్ను పంపిస్తాను.'

" 'మీ రంత శ్రమ తీసుకోవలసిన అవసరం లేదు నా భర్త యింట్లోనే నేను వున్నాను.'

"అకస్మాత్తుగా నేనా మాట వినేసరికి ఆయన కళ్లు క్రోధారుణపూరితా లయ్యాయి. నఖశిఖ పర్యంతం వుద్రేకంతో వూగిపోతూ నా ముందు కొచ్చి నిల్చున్నాడు.

" 'ఏమిటే కూస్తావు! ఇది నీ భర్త యిల్లా? ఈ మాట మరోసారి అన్నావంటే నీ చర్మం ఒలిపిస్తాను. జాగ్రత్త!' అన్నాడు క్రూరంగా.

" 'నే నేమీ తప్పుగాని- అబద్ధంగాని పలకటం లేదు గనుక, మీ బెదిరింపులకు లోను కాను. నన్నూ, నా వ్యక్తిత్వాన్నీ శంకించి మీ రీ విధంగా తూలనాడుతున్నందుకు యీ విధంగా సమాధాన మివ్వవలసి వచ్చింది. ఒక్కసారి కాదు, లక్షసార్లయినా యిదేమాట చెబుతాను. నే నీ యింటి కోడలిని. మీ కుమారుడు మనోవాక్కాయ కర్మల సాక్షిగా నన్ను వివాహం చేసుకున్నాడు' అంటూ నేను చెబుతున్నానో లేదో అంతలో నా చెంపపై ఛెళ్లున దెబ్బ పడింది. క్షణ కాలం నా కళ్ళల్లో నీళ్లు నిలిచాయి.

" 'కులటా! ఇదా నీ ఎత్తు. నంగనాచిలా వుంటూ యిదా నువ్వు పన్నిన పన్నాగం? నా కొడుకు పెళ్ళి చేసుకున్నాడట- పెళ్ళి! ఎవరు చూశారే నీ పెళ్ళి? ఎక్కడ నేర్చావే, యీ మాయ మాటలు? హీనజాతిదానివి- 'నా'

అనే దిక్కు-లేని పక్షివి- నిన్ను నా కొడుకు పెళ్ళిచేసుకున్నా డటే! ఇప్పుడే పోలీసులకు ఫోన్ చేసి నీ ఆట కట్టిస్తాను. నన్నే మోసం చేద్దా మనుకున్నావా?'

" 'మిమ్మల్నేగాదు- మరెవరినైనా మోసం చేసే అవసరం నాకు లేదు. నా మాటమీద నమ్మకం లేకపోతే యీ ఫోటోలో ఏముందో చూడండి. నిజమేమిటో తెలుస్తుంది' అంటూ నేను ఆయన చేతికి మా పెళ్ళినాటి ఫోటోను అందించాను. దానిని చూడగానే ఆయన కోపం హద్దు మీరింది. పళ్లు పటపట కొరుకుతూ నావైపు మరింత క్రూరంగా చూశాడు.

" 'ఇన్ని అబద్ధాలు నేర్చినదానివి- యీమాత్రం ఫోటో తయారు చేయలేవా? నావద్ద యీ దొంగ వేషాలు పనికిరావు. నా కొడుకు నీలాంటి ముండలతో నేస్తం చేసే నీచుడు కాదు. వాడు నా కొడుకే, నా కొడుకు! డబ్బు ఆశతో యింత నాటకం ఆడతావా? అమాయకుణ్ణి పట్టుకొని పెళ్ళి చేసుకున్నాడని వాగుతావా? ఫో! నీ పాపిష్టి ముఖం నాకు చూపించకు. తక్షణం యిక్కడినుండి వెళ్ళిపో! నీకు దిక్కున్న చోట బ్రతుకు-ఫో!' అంటూ ఆయన బలవంతంగా నన్ను గదిలోనుండి బయటికి నెట్టాడు. అంతవరకు నాలో గూడు కట్టుకొనివున్న ధైర్యం ఆ సమయంలో సడలింది. మనోబలం లేనిదానినై ఘోరున ఏడవసాగాను.

" 'నీ కన్నీళ్ళు నా మనస్సు కరిగిస్తాయనుకున్నావేమో! నాది రాతి గుండె. నీలాంటి గడుగ్గాయిల నెందరినో చూశాను.

నువ్వొక లెఖ్ఖా! వెళ్లు. తక్షణం యిక్కడి నుండి వెళ్ళిపో'' అంటూ తిరిగి ఆయన గర్జించాడు.

''ఇహ నాలో సహనం చచ్చిపోయింది. అవమాన భారంతో భగ్గున మండిపోయాను.

'' 'వెళతాను. తప్పకుండా వెళ్ళిపోతాను. కాని, వెళ్లే ముందు ఒక మాట చెప్పి మరీ వెళతాను. ఏనాటికైనా మీరు నన్ను అర్థం చేసుకోగలరు. నిజం తెలుసుకోగలరు. అప్పుడు పశ్చాత్తాపంతో నిజంగానే కుళ్ళికుళ్ళి పోతారు. నన్ను గురించి ప్రశ్నించే మీ కొడుకు బదులు చెప్పకోలేక మీలో మీరు క్షోభపడి మండిపోతారు. నా ఆవేదన యిప్పుడు అర్థం కాదు. నావలె మీకు ఒక కూతురుండి యిలాంటి పని చేసి - యిప్పటి నా స్థితినే పొందివుంటే - నా బాధ ఏమిటో తెలిసి వచ్చేది. అయినా, నిజం ఏనాటికీ దాగదు. సత్యాన్ని ఆశ్రయించిన నాకు అపజయం ఎదురు కాదు.'

''అని నేను క్షణమైనా అక్కడ నిలవలేక గబగబా ముందుకు నడిచాను. ఎదురుగా కన్నీళ్లతో జగ్గు తాత కన్పించాడు. అతన్ని చూడగానే నాలోని దుఃఖం కట్టలు త్రెంచుకొని బయటపడింది. పసిపాపవలె భోరున ఏడుస్తూ రెండు చేతుల్లో ముఖం దాచుకున్నాను.

'' 'ఏడవకు తల్లీ! నీ అదృష్టం వక్రించింది. కష్టాలు మంచివాళ్లకే ఎదురౌతుంటాయి. ఇది నీ జీవితానికొక అగ్ని పరీక్ష లాంటిది. భయపడకు. అన్నింటికీ పైన భగవంతుడున్నాడు. మన నిర్ణయాల కన్నా ముందు భగవంతుని నిర్ణయ

మన్న దొకటి వున్నది గనుక - మానవ మాత్రులం మన మేమీ చెయ్యలేం. అంతా ఆ భగవంతునిపై భారముంచి జీవితంతో పోరాడు. తప్పకుండా నువ్వే జయించగలవు.'

"జగ్గు తాత మాటలు నాలో క్రొత్త ధైర్యాన్ని రేకెత్తించాయి. నా హృదయంలో ఎక్కడో ఆశాకిరణం తళుక్కుమంది.

"'నిజంగా నాకు మంచి రోజులు వస్తాయంటావా తాతా?' అనడిగాను కన్నీళ్ళతోనే.

"'తప్పకుండా వస్తాయమ్మా! ఈ మాత్రానికే ఆశ్చర్యపడితే ఎలా? చదువుకున్న దానివి. కాస్తోకూస్తో లోకాన్ని చూసిన దానివి. నువ్వే ఇలా పిరికిపడితే ఎలాగమ్మా! ఒక్క సంవత్సరం ఓపిక పట్టావంటే బాబుగారు యింగ్లాండు నుండి తిరిగి వస్తారు. వారు రాగానే నీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి. వెళ్ళిరా, తల్లీ! నీకు శుభం కల్గుతుంది.'

"అని జగ్గు తాత కన్నీళ్ళతో నన్ను ఆశీర్వదించాడు. ఒక వైపు ఆవేదనా భరితమైన హృదయంతో - మరో వైపు అవమాన భారంతో కృంగిపోతూ నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ గేటు దాటి రోడ్డుమీద పడ్డాను. తిరిగి నేను జీవితంలో ఏకాకి నయ్యాను.

"కోడంబాకంలో ఒక చిన్న గది అద్దెకు తీసుకొని మళ్ళీ వుద్యోగం కోసం గాలించసాగాను. ఒక దినం ఎలక్ట్రిక్ ట్రయిన్‌లో పారిస్ పోయి వస్తుండగా నా పాత స్నేహితు రాలు ఒకామె కన్పించి - ఎగ్మూర్‌లో ఒకరిద్దరు అమ్మాయి

లకు వీణ నేర్పేందుకు టీచర్ కావాలని చెప్పింది. ఆమె నడిగి ఆ యింటి అడ్రస్ తీసుకొని మరునటి దినం ఎగ్మూర్ వెళ్ళాను.

"నేను బయలుదేరిన వేళా విశేషం ఎలాంటిదో గాని ఆ యింట యిద్దరమ్మాయిలకు ట్యూషన్ చెప్పేందుకు నెలకు వంద రూపాయల జీతం కుదిరింది. ప్రతి దినం వుదయం, సాయంకాలం అక్కడికి వెళ్ళి ఆ పిల్లలకు సంగీత సాధన చేయించేదాన్ని.

"ఆ విధంగా ఒక మాసం రోజులు గడిచాయి. జీవితం నిర్విచారంగా గడిచిపోతోంది కదా అని అనుకుంటుండగానే తిరిగి ఒక సంఘటన జరిగింది.

"నేను వీణ నేర్పుతున్న ఆ పిల్లలకు వయస్సొచ్చిన ఒక అన్నగా రుండేవాడు. నేనా పిల్లలతో సంగీత సాధన చేస్తున్నప్పుడల్లా – వాళ్ళ ప్రక్క నొచ్చి కూర్చొని నాకేసి అదేపనిగా చూసేవాడు. నేను అతనేదో అమాయకుడని సరి పెట్టుకొని – నా పనిలో నేను నిమగ్నురాల్ని అయ్యేదాన్ని.

"కాని, ఆ దినం నేను కాస్త చీకటి పడ్డాక ఆలశ్యంగా ఎగ్మూర్ వెళ్ళాను. వీణ ముందు ఆ అబ్బాయి కూర్చొని సరి గమలు అలాపిస్తున్నాడు. నన్ను అదోరకంగా చూసి మంద హాసం చేశాడు. ఆ అబ్బాయి ప్రవర్తన చూశాక చెంప మీద నాలుగు అంటిద్దా మనుకున్నాను. అయినా, నన్ను నేను నిగ్రహించుకొని – 'అమ్మాయిలు లేరాండి?' అనడిగాను.

" 'ఎందుకు లేరండి. అటు వైపు గదిలో వున్నారు. వెళ్ళి అక్కడే పాఠాలు చెప్పండి' అన్నాడా అబ్బాయి.

"నేను గబగబా ముందుకు వెళ్ళి ఆ అబ్బాయి చెప్పిన గదిలోకి వెళ్ళాను. కాని, అక్కడ ఎవ్వరూ లేకపోవటంతో ఆశ్చర్యపోతూ వెనక్కు తిరిగాను. అయితే, అంతకన్నా ఆశ్చర్యంగా తలుపులవద్ద ఆ అబ్బాయి కన్పించాడు.

" 'అమ్మాయిలు లేరు కదండీ! ఎక్కడికి కెళ్ళారు?' అనడిగాను.

" 'వాళ్లు లేకపోతేనేం, నేనున్నాగా! నాకు చెప్పండి మీ పాఠాలు' అన్నాడా అబ్బాయి గొంతు సవరించుకుంటూ.

"నే నతని మాటల్నేమీ పట్టించుకోకుండా అక్కడి నుండి ముందుకు కదిలాను. అయితే, ఆ అబ్బాయి అడ్డు నిలిచి ఏవేవో వికార చేష్టలు చెయ్యబోయ్యాడు. క్షణంలో పరిస్థితి నంతా అర్థం చేసుకున్నాను. ఇన్ని దినాలుగా ఆ అబ్బాయి నాపై ఎలాంటి దురభిప్రాయంతో సంచరించాడోకూడా తెలుసుకున్నాను. అంతే! నాలోని రక్తం పొంగింది. అడ్డు నిలిచిన ఆ అబ్బాయి ముఖం వాచేలా నాలుగు లెంపకాయలు వేసి గబగబా అక్కడినుండి తప్పించుకొని బయటపడ్డాను. ఇల్లు చేరుకునేంతవరకూ నా గుండెల్లో అగ్ని ప్రజ్వరిల్లుతూనే వుంది.

"ఇంట్లో అడుగుబెట్టి మంచంపై మేను వాల్చేసరికి నాలోని దుఃఖం పొంగి పొర్లింది. ఛీ! భగవంతుడు నా కెందుకింత పాడు బ్రతుకు ప్రసాదించాడు అని వ్యసన పడాను. బీదరికంలో జన్మించటమే గాకుండా అందగత్తెను కావటం కూడా— నా బ్రతుకేక్క గొప్ప ప్రతిబంధకమైంది. ఆడదానిని—

ఒంటరిదాన్ని కావటంవల్ల కదా అడుగడుగునా నా కిన్ని అవమానాలు ఎదురౌతున్నాయి. భగవంతుడు నన్ను ఆడదాన్నిగా గాక ఏ చెట్టుగానైనా పుట్టించకూడదా? అప్పు డిన్ని దిగుళ్లూ, బాధలూ, అవమానాలూ లేకపోయేవిగా! ఇలాంటి వంచితుల మధ్య- కుచ్చితుల నడుమ ఎలా యీ జీవితాన్ని సాగించను?

"ఆ మరుసటి దినం ట్యూషన్ చెప్పేందుకు ఎగ్మూర్ వెళ్ళలేదు. కాముకత్వంతో పొరలు కప్పిన ఆ అబ్బాయిని చూసేందుకే అసహ్యం జనించింది. తత్ఫలితంగా ఆ వృత్తి మానుకొని- మళ్ళీ వుద్యోగం కోసం నగరంలోని ప్రతి ఆఫీసు చుట్టూ తిరిగాను. టైపు చెయ్యటం నాకు తెలియకపోవటంతో ఎక్కడి కెళ్ళినా ప్రయోజనం లేకపోయింది.

"చివరకు మాంబళంలో ఒక తెలుగు ప్రెస్‌లో వుద్యోగం దొరికింది. అదైనా ప్రూఫ్ రీడింగ్ పని. చాలీ చాలని జీతం అయినప్పటికీ విధిలేక ఆ పనిలో ప్రవేశించాను. మొదట్లో ప్రూఫ్‌లు దిద్దటం చాలా కష్టమనిపించింది. కాని, క్రమంగా ఆ పనికికూడా అలవాటు పడ్డాను.

"అయితే, కొన్ని మాసాలు గతించగానే అక్కడ సైతం విధి నన్ను వెక్కిరించింది.

"ఒక దినం ప్రెస్ యజమాని ఏదో అత్యవసరమైన పని వుందని నన్ను వాళ్ళ యింటికి రమ్మన్నాడు. నేను అదెంత అత్యవసరమైన పనో అనుకొని ఎక్కడి పనులక్కడే వదిలిపెట్టి ఆయన యింటికి వెళ్ళాను. కాని, ఆయన కూడా మోసంతో నన్ను మానభంగం చేసేందుకు ప్రయత్నించేసరికి ఎలాగో

తప్పించుకొని బయటపడ్డాను. వయస్సులో పెద్దవాడూ - కొన్ని దశాబ్దాలు లోకాన్ని చూసిన వాడూ అయిన ఆయన - బిడ్డ లాంటి నన్ను కాంక్షించగానే యీ ప్రపంచం మీదా - మానవ జాతి మీద చెప్పలేనంత అసహ్యం కల్గింది.

"నా అందాన్ని, యవ్వనాన్ని దూషించుకుంటూ రోడ్డు మీద నడవసాగాను. అవమానాగ్ని నా శరీరమంతా మండించసాగింది. ఇహముందు ఏం చెయ్యాలో - నా బ్రతుకు తెరువు కోసం ఏ మార్గాన్ని అవలంబించాలో ఆలోచించు కుంటూ వెళ్ళసాగాను.

"ఆ సమయంలో నేనెటు వెళుతున్నానో - నాకే తెలియదు. నా కళ్ళ ముందు జీవితాన్ని గూర్చిన ప్రశ్నలే నిలిచి కలవరపరచసాగాయి. రోడ్డుమీద నాతోపాటు నడుస్తున్న జనం కాని - కార్లుగాని ఏవీ కన్పించటం లేదు. కాళ్లు ఎక్కడికి లాక్కెళుతున్నాయో అటే వెళ్ళసాగాను.

"అంతలో నా ముందు శరవేగంతో ఒక కారు రావటం భయంకరంగా కన్పించింది. దాని బారి నుండి తప్పించుకునేందుకు ప్రయత్నిస్తుండగానే వెనుక నుండి మరో కారు రివ్వున దూసుకు రాసాగింది. ఎటు తప్పించు కునేందుకు బోధపడక కెవ్వున కేక వేస్తూ భయం వల్ల అక్కడే కుప్పగా కూలిపోయాను.

"కళ్లు విప్పి తెరిచేసరికి నేను ప్రయివేట్ ఆస్పత్రిలో వున్నట్లు తెలిసింది. నాముందు ధవళ వస్త్రాలు ధరించి - చిరు

అందులో సుధాకర్‌కు, వనజ అనే అమ్మాయితో వివాహం నిశ్చయింపబడిందని - చదవగానే నా కళ్ళు బైర్లు క్రమ్మాయి. అగ్నిసాక్షిగా నన్ను వివాహ మాడి - బాబును ప్రసాదించిన సుధాకరేనా యీ మళ్ళీ పెళ్ళికి ఒప్పుకున్నది అని నాలో నేను ప్రశ్నించుకున్నాను. కాని, ఒక్క సంవత్సర కాలం మా యిరువురి మధ్యా గతించి పోవటంతో - అతని మానసిక ప్రవృత్తి ఏ విధంగా మార్పు చెందినదో సులభంగా అర్థం చేసుకోలేకపోయాము. ఆనాటినుండే మనస్సును బండ చేసుకొని- అన్ని ఆశలనూ నిరాశ చేసుకొని కేవలం ఒక్క బాబు కోసమే బ్రతుకుతున్నాను. కళ్యాణీ! ఒక్క సంవత్సరం తిరిగి కాల గర్భంలో లీనం కాగానే సుధాకర్ మనస్సులో ఏవిధమైన సంచలనం కల్గిందో కాని - నన్ను ఎక్కడున్నా వెంటనే బయలుదేరి వచ్చి కలుసుకోమని పత్రికల్లో ప్రకటించాడు. నేనా ప్రకటన చదువుకొని ఎంతగా ఆవేదనకు లోనయ్యానో యిప్పుడు చెప్పలేను. నేను బ్రతికి వుండగానే మరో వివాహం చేసుకొని - తిరిగి ఓ సంవత్సర కాలానికి నేను జ్ఞాపకం రాగానే ఆ విధంగా ప్రకటించటంలో అతని వుద్దేశ్య మేమిటో ఎంతగా ఆలోచించినా బోధపడిందే కాదు.

"కాని, కేవలం ఆ ఒక్క ప్రకటనతో నా మనో నిశ్చయం మారలేదు. అందుకే నేను మళ్ళీ సుధాకర్‌ను చేరు కోలేదు" అన్న రాధ మాటలు వినగానే కళ్యాణి కలవరపడింది. ఆమె కళ్ళముందు ఆస్పత్రిలో క్రొత్తగా చేరిన పేషెంట్ సుధాకర్ క్షణకాలం నిలిచాడు. అతని మాటలు, చేష్టలు

ఒక్కొక్కటే క్రమంగా స్మృతిపథంలో మెదలసాగాయి. అప్రయత్నంగా ఆమె కళ్ళంబడి ఆనందాశ్రువులు జలజలా రాలాయి.

"అక్కా! నిజంగా నువ్వు ధన్యజీవివి. ఇన్ని కష్టాలు నీ జీవితంలో ఎదురైనా మనోనిగ్రహంతో అన్నింటినీ ఎదుర్కొని చివరకు విజయం పొందావ్. నీ కథంతా విన్నాక విధి ఎంత గొప్ప బలీయమైనదీ అని ఆశ్చర్యం కలుగుతోంది. నేను యిన్నాళ్ళుగా పనిచేస్తున్న ఆస్పత్రి డాక్టరే రఘురామ్! శశికళకూడా అక్కడే వుంది. ఇహ పోగా నీ జీవిత వినాశ కర్త- నీ భర్త అయిన సుధాకర్‌కూడా ఆస్పత్రిలోనే పేషెంట్‌గా చేరాడు. అతను నీపైని దిగులుతో పూర్తిగా కృంగి కృశించిపోయాడు. చివరకు మీరంతా ఆస్పత్రిలో కలుసుకోబోతున్నారు. భగవంతుని నిర్ణయం కడకు యీ విధంగా వ్రాసి వుందేమో!" అంది కళ్యాణి ప్రియంగా రాధ కళ్ళల్లోకి చూస్తూ.

కళ్యాణి చెప్పిన మాటలు వినగానే ఒక్కసారిగా రాధ నిశ్చేష్టితయైంది. ఆమె నోటంట మాట పెగలలేదు. అమాయకంగా కళ్యాణి కళ్ళల్లోకి చూడసాగింది.

"నిజమక్కా! నా మాటపై విశ్వాసం లేదా? సావిత్రి నాకు వ్రాసిన ఉత్తరంలోకూడా సుధాకర్‌ను గురించే తెలిపింది. అతను తన పంచప్రాణాలూ నీపైనే పెట్టుకొని వున్నాడు. నా ఊహే నిజమైతే అతను నువ్వనుకుంటున్నట్లు మరో వివాహం చేసుకొని వుండడు. పవిత్ర ప్రేమైక స్వరూపుడైన

సుధాకర్ నీ కెన్నటికీ అన్యాయం చెయ్యడని నా హృదయం ఘోషిస్తోంది. రేపు వుదయమే బయలుదేరి మనం అక్కడికి వెళదామక్కా! నువ్వు, అతనూ ఏకమైతే చూసి సంతో షించాలని వుంది. కనీసం నా కోర్కె నెరవేర్చేందుకైనా నువ్వు బయలుదేరక తప్పదు. ఏమంటావ్ అక్కా!"

అంటూ వుద్రేకంతో కళ్యాణి చెప్పుకపోసాగింది.

కాని, రాధ స్తబ్ధురాలై అలాగే కూర్చుండిపోయింది. ఆమె కళ్యాణి చెబుతున్న మాటలు వింటున్నదో లేదోగాని భయంకరంగా సైరన్ గర్జించేసరికి త్రుళ్ళిపడి లేచి నిల్చుంది.

# 14

సూర్యోదయం అయ్యేంతవరకూ అలాగే నిశ్శబ్దంగా సావిత్రి, సుధాకర్‌లు కూర్చుండిపోయారు. అతను తన జీవితంలో జరిగిన దుర్ఘటనల గురించి ఆమూలాగ్రంగా తెలిపేసరికి—సావిత్రి మనస్సు వికలమైంది. అత నెంత బాధామయుడు కానిది యీ స్థితికి దిగజారిపోయి వుంటాడని సులభంగా అర్థం చేసుకుం దామె. అతనిలాగే ఎంతమంది భగ్న ప్రేమికులు యీ విశాల విశ్వంలో కృంగి కృశించిపోతున్నారో! ఆశలు నెరవేరక— ఆశయాలు కొనసాగక అనుక్షణం ఆరాట పడుతున్నారో!!

పాపం, ఏకాకి అయిన రాధాదేవి జీవితం చివరకు ఏమైందో! ఆమె బీదరికంలో జన్మించటమే పాపమైంది! అన్య జాతి యువకుణ్ణి ప్రేమించటమే నేరమైంది!! చిన్నతనంనుండి

కష్టాలమధ్య దుఃఖాలమధ్య పెరిగిన ఆ సహనమూర్తి యింకా ఎన్ని అగచాట్లకు లోనైందో! ఆమె పవిత్ర ప్రేమకు ఫలితంగా ప్రసాదించబడిన గర్భంలోని శిశువు ఏమైనదో! సుధాకర్ అన్నిమార్లు పత్రికల్లో ప్రకటించినా ఆమె ఎందుకు అతన్ని చేరుకోలేదు? కనీసం తను ఎక్కడున్నదీ- ఏం చేస్తున్నదీ కూడా తెలపలే దెందుకు? అసలు ఆమె యీ ప్రపంచంలో వున్నదా? లేక... లేక...

ఆపైన యిహ ఆమె ఆలోచించ లేకపోయింది. జాలిగా అతనివైపు చూడటం తప్ప ఏమీ చెయ్యలేక పోయింది. సుధాకర్ నిశ్చలంగా కళ్ళు మూసుకొని కూర్చున్నాడు. అదేమిటోగాని ఎన్నడూ అతని ముఖంలో కన్పించని వెలుగు సావిత్రి కా సమయంలో స్పష్టంగా గోచరమైంది. అందుకు కారణంగా- అతని హృదయంలో ఏదైనా పరివర్తన కల్గ బోతోందేమో నని ఆమె తృప్తిపడింది.

గడియారం ఆరుగంటలు కొట్టింది.

సావిత్రి అక్కడినుండి లేచి నెమ్మదిగా గది బయటికి నడిచింది. ఎదురుగ్గా చిరునవ్వు ముఖంతో సంధ్య రావటం కన్పించింది.

"హల్లో, గుడ్ మార్నింగ్ సావిత్రీ! మీ పేషెంట్ ఎలాగున్నాడు? ఏం? నీ కళ్ళు ఎర్రగా వున్నాయి. రాత్రంతా మేల్కొన్నావా?" అనడిగింది గబగబా సంధ్య నవ్వుతూనే.

సావిత్రి ఆమె ప్రశ్నల కేమీ బదులు చెప్పకుండానే- "డాక్టర్‌గారు వచ్చారా?" అంది.

"ఇంకా రాలేదు. ఏం, మీ పేషెంట్ కేసైనా సీరియస్‌గా వుందా?"

ఆ మాటతో సావిత్రి నిజంగానే కోపం కలిగింది. కాని, తన కోపాన్ని తనలో అణచుకుంటూ—"ఛీ! ఎప్పుడూ అలాంటి అశుభాలు పలకకు. అతని ఆరోగ్యం బాగానే వుంది" అంది.

"మరి యింత పెందరాళే డాక్టర్‌తో నీకేం పని?"

"రెండు రోజులు సెలవు కావాలి. నా మనస్సేమీ బాగాలేదు."

ఆ మాటతో సంధ్య ఫకాలున నవ్వింది. ఆమె ఎందువల్ల నవ్వుతోందో సావిత్రికి అర్థం కాలేదు.

"ఏమిటా నవ్వు, వేళాపాళా లేకుండా?" అని విసుక్కుందామె.

"పాపం, సావిత్రీ! నీకూడా యీ పేషెంట్‌తో తల ప్రాణం తోకకు వచ్చినట్లుందే! అందుకే సెలవు పెడుతున్నావ్. నిజమే కదూ!"

సంధ్య అమాయకత్వానికి సావిత్రి జాలిపడింది. మనుష్యుల తీరుతెన్నులను - మనఃప్రవృత్తులను ఏనాటికీమె అర్థం చేసుకుంటుందా అని క్షణకాలం ఆలోచించింది.

"మన పేషెంట్ విషయంలో నువ్వు అపార్థం చేసుకుంటున్నావ్ సంధ్యా! అతను నువ్వనుకుంటున్నట్లు సామాన్యుడు కాదు. నీతో అతను ముభావంగా మాట్లాడినంత మాత్రాన్నే - అతని వ్యక్తిత్వం ఫలానిదని వెంటనే ఒక నిర్ణయానికి రాకూడదు. అతను తన జీవితంలో పోగొట్టుకున్న

వస్తువును - అతని కన్నీళ్ళ బాధల గాథను నువ్వూ వినగల్గితే యిలా మాట్లాడలేవు. తప్పకుండా అతనిపై సానుభూతి చూపగలవ్. ఎప్పుడూ అతన్ని గురించి యిక చులకనగా మాట్లాడకు. నేను సహించలేను.''

అని సావిత్రి అక్కడ ఒక క్షణమైనా నిల్చోకుండా గబగబా ముందుకు సాగిపోయింది.

# 15

సంధ్య క్షణకాలం నిరుత్తరురాలై అలాగే నిల్చుండిపోయింది. సావిత్రి అక్కడి నుండి వెళ్ళిపోగానే - కొంతసేపటికి తేరుకొని నెమ్మదిగా అడుగులో అడుగు వేస్తూ గది లోపలికి ప్రవేశించింది అక్కడ కన్పించిన దృశ్యం చూడగానే ఎటూ ఆలోచించుకోలేక త్వరత్వరగా సుధాకర్‌ను సమీపించింది.

అతను మోకాళ్ళ మధ్య తలపెట్టి మౌనంగా కూర్చొని వున్నాడు. తన పూర్వ బాధల మననంతో దుఃఖిస్తున్నాడో - లేక యింకా నిద్రపోతున్నాడో చప్పున ఆమె తెలుసుకోలేక పోయింది.

''మిష్టర్! ఏం చేస్తున్నారు? తెల్లవారిందండి'' అంది సాదరంగా.

అతను నెమ్మదిగా తల పైకెత్తి ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు. ఆ చూపుల్లోని ఆవేదనను సంధ్య అర్థం చేసుకోలేక పోయింది.

"కాలకృత్యాలు తీర్చుకోండి. కాఫీ తెస్తాను" అందామె.

అతనేం మాట్లాడకుండా మంచం మీది నుండి లేచి తూలుతూ బయటికి వెళ్ళిపోయాడు. అతను తిరిగి వచ్చేసరికి సంధ్య కాఫీ తయారుగా పెట్టింది. రెండు గుటకలు త్రాగి మిగిలిందంతా అతనలాగే వదిలిపెట్టాడు.

"మిస్టర్! కాఫీ బాగా లేదా? పోనీ, ఓవల్టీన్ యిచ్చేదా?" అనడిగింది సంధ్య.

"ఏమీ వద్దు నర్స్! నన్ను కాస్సేపు పడుకోనివ్వు" అన్నాడతను.

సంధ్య యింకేం మాట్లాడలేక పోయింది. సుధాకర్ మంచంపై పడుకొని నెమ్మదిగా కళ్ళు మూయగానే - ఆమె స్టూల్‌ను కిటికీ వద్దకు జరుపుకొని కూర్చుంది.

ఎనిమిది గంటల ప్రాంతాల్లో డాక్టర్ రఘురామ్ అక్కడికి రాగానే సంధ్య లేచి నిల్చొని విష్ చేసింది. అక్కడి పరిస్థితినంతా ఆమె విశదీకరించి చెప్పగానే రఘురామ్ గాఢంగా నిశ్వసించాడు. సుధాకర్ దగ్గరగా వెళ్ళి అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ నాడి చూశాడు. వెంటనే అతని ముఖకవళికల్లో మార్పులొచ్చాయి.

"ఏం జరిగింది డాక్టర్?" అంటూ తొట్రుపడుతూ సంధ్య ముందుకొచ్చింది.

"ఒళ్లు సలసలా కాగిపోతోంది. రాత్రి కూడా యిలాగే వుందని సావిత్రి చెప్పిందా?"

"లేదు డాక్టర్ ఆమెకు సెలవు కావాలని మీ వద్దకే బయలుదేరి వెళ్ళింది."

"అవును. సెలవు గ్రాంటు చేశాను. నా కూడా వీడిని. గురించి ఏమీ చెప్పలేదు. ఈ రెండు రోజులూ నైట్ డ్యూటీ కూడా నువ్వే చెయ్యి. వీడు లేవగానే నాకు కబురు పెట్టు. వచ్చి యింజెక్షన్ యిస్తాను."

అని రఘురామ్ అక్కడి నుండి వెళ్ళిపోయాడు. డాక్టర్ నిష్క్రమణతో సంధ్య స్టూల్‌ను మంచం వద్దకు జరుపుకొని కూర్చుంది. ఎంతసేపు ఆ విధంగా ఆమె కూర్చున్నా సుధాకర్‌లో మార్పు రాలేదు. నిద్రలో కలవరిస్తున్నాడో - లేక జ్వర తీవ్రతవల్ల బాధపడుతున్నాడో తెలియదుగాని అప్పుడప్పుడు హృదయ విదారకంగా మూలుగుతున్నాడు.

సంధ్య కేమీ అర్థం కాలేదు. రెండు మూడు సార్లు నాడి చూసింది. క్రమక్రమంగా జ్వరం తీవ్రరూపం దాలుస్తోందే గాని తిరుగు ముఖం పట్టడం లేదు. అంతేగాక, సుధాకర్ ఒక్క సారైనా కళ్ళు విప్పి చూడకపోవటంతో ఆమె కంగారు పడింది. ఇహ ఒక్క క్షణమైనా ఆలశ్యం చెయ్యకుండా డాక్టర్ వద్ద వెళ్ళి అతని పరిస్థితి వివరించింది.

రఘురామ్ సైతం లోలోన విస్తుబోతూ సుధాకర్ గదిలోకి వచ్చాడు. తిరిగి అతన్ని పరీక్ష చేస్తుండగా క్రమంగా ఆయన ముఖం నల్లబడ సాగింది. సంధ్యకు ఏవో యింజెక్షన్‌లు తెమ్మని చెప్పి - ఆమె తేగానే అతని కుడిచేతికి యింజెక్ట్ చేశాడు.

కొంతసేపటికి సుధాకర్ మనుష్యుల స్వాధీనంలోకి వచ్చాడు. కళ్లు తెరిచి మెల్లగా రఘురామ్ వైపు దృష్టి సాగించాడు.

"ఎలా వుంది సుధా?" అనడిగాడు రఘురామ్.

సుధాకర్ మాట్లాడేందుకు ప్రయత్నించాడు కాని, ఆ ప్రయత్నంలో సఫలీకృతుడు కాలేక పోయాడు. క్షణకాలం అతని పెదవులపై జీవం లేని హాసం లాస్యం చేసింది.

"ఒక్కసారిగా నీ శరీరంలో గొప్ప మార్పు వచ్చింది, సుధా! గత రాత్రంతా నిద్ర మేల్కొన్నట్లున్నావ్. అందుకే యీ విపరీత స్థితి తటస్థించింది. దేన్ని గురించీ నువ్వెక్కువగా ఆలోచించకూడదు" అన్నాడాయన.

కాని, యీమారు కూడా సుధాకర్ ఏమీ పలక లేదు. దీనంగా రఘురామ్ కళ్ళల్లోకి చూడసాగాడు.

"శశి నీ విషయమంతా చెప్పింది. నీ అదృష్టం యీ విధంగా వక్రిస్తుందని నేను కలలో కూడా అనుకోలేదు. జరిగిందాన్ని గూర్చి కలత చెందకు. రాధను గూర్చిన ఆలోచనలు నీలో నుండి దూరమయ్యే వరకూ – నీ ఆరోగ్యం బాగుపడదు. నిశ్చింతంగా కళ్లు మూసుకొని పడుకో. నేను తిరిగి సాయంకాలం వస్తాను."

అని డాక్టర్ రఘురామ్ ఆ గదిలో నుండి నిష్క్రమించాడు. ఆయన వెళ్ళిపోగానే సుధాకర్ గాఢంగా నిట్టూర్పు విడిచి ఒత్తిగిల్లి పడుకున్నాడు. సంధ్య చేసేదేమీ లేక అతని కేసి జాలిగా చూస్తూ అలాగే నిల్చుండి పోయింది.

# 16

మరుసటి దినం తెల్లవారే వరకూ సుధాకర్ ఆరోగ్యంలో ఎలాంటి మార్పూ కలగలేదు. వేడి నిట్టూర్పులు వదులుతూ - బరువుగా అటూ యిటూ మంచంలో కదలసాగాడు.

తెల్లవారినా ఎంతసేపటికీ అతను పడకనుండి లేవక పోయేసరికి సంధ్యకేదో అనుమానం కల్గింది. ఆమె వెంటనే సుధాకర్ వద్ద కెళ్ళి- అతను ముఖానికి కప్పుకున్న రగ్గును ప్రక్కకు తొలగించింది. షర్ట్ మీదా, దిండు ప్రక్కా రక్తపు చారలు కన్పించేసరికి ఆమె తెల్లబోతూ అతనికేసి చూసింది.

సుధాకర్ ముఖం పూర్తిగా పాలిపోయి వుంది. నోట్లోంచి రక్తం స్రవించినట్లు స్పష్టంగా మరకలు కన్పించాయి. గతరాత్రి అతను రక్తం గక్కాడని సంధ్య గ్రహించేసరికి- అదోవిధమైన భయంవల్ల ఆమె ఒళ్ళంతా కంపించసాగింది.

అంతలో డాక్టర్ రఘురామ్‌కూడా అక్కడికి వచ్చి ఆ దృశ్యాన్ని తిలకించి చకితుడయ్యాడు. ఎన్నడూ లేనిది సుధాకర్ ఆ విధంగా ఎందుకు రక్తం గక్కుతున్నాడో అర్థం కాలేదు ఆయనకు. వెంటనే సుధాకర్‌ను లేపి విషయమేమిటో తెలుసుకోవాలనుకున్నాడు. కాని, పూర్తిగా స్పృహ లేని స్థితిలో వున్న అతను లేవకపోయేసరికి- తనే స్వయంగా అతని పడక - గుడ్డలు మార్పించాడు. ముఖాన్ని సైతం శుభ్రం చేయించి, ఏవో రెండు యింజక్షన్‌లు ఒకేమారు

యిచ్చాడు. అయినా, చాలా సేపటివరకు సుధాకర్ స్పృహ నుండి తేరుకోలేదు.

తొమ్మిది గంటల ప్రాంతాల్లో అతను కళ్లు విప్పి చూడగానే- సంతోషంతో రఘురామ్ ముఖం వికసించింది. కాని, పూర్తిగా అతను నీరసించి వుండటంవల్ల ఏమీ మాట్లాడ లేక పోవటంతో- ఆయనలోని వుత్సాహం అంతలోనే అంత రించి పోయింది.

సుధాకర్ మనుష్యుల స్వాధీనంలోకి రావటంతో యిహ భయం లేదనుకొని రఘురామ్ మిగిలిన పేషెంట్లను చూసేందుకు బయటికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రికూడా సుధాకర్ ఎవ్వరితోనూ మాట్లాడలేక అందరి కళ్ళల్లోకి నిస్సహాయంగా చూడటం తప్ప ఏమీ చెయ్య లేకపోయాడు. తిరిగి తెల్లవారేసరికి గతరాత్రికన్నా రెం డింతలుగా అతను రక్తం గ్రక్కి- వుండటం చూసి సంధ్య హడలెత్తిపోయింది. రఘురామ్ సైతం అతని స్థితి చూసి ఏమీ చెయ్యలేక ఖిన్నవదనుడయ్యాడు.

సాయంకాలం ఆరుగంటలప్పుడు సావిత్రి డ్యూటీలో ప్రవేశిస్తూ- సంధ్యద్వారా సుధాకర్ పరిస్థితి విని కంగారు పడింది. గదిలో ప్రవేశించి సుధాకర్‌ను చూడగానే ఆమె కళ్ళు గిర్రున తిరిగాయి. తను స్వప్నంలో చూస్తున్నదా- లేక జాగృతిలో వున్నదో తెలుసుకోలేనంత స్థితికి దిగజారిపోయిం దామె. గబగబా మంచంవద్దకు వచ్చి అతని ముఖంలోకి పరి శీలనగా చూసింది.

రెండు రోజుల్లోనే అతనిలో చెప్పనలవికానంత గొప్ప మార్పు వచ్చింది. శరీరం పూర్తిగా శుష్కించిపోయింది. కనురెప్పలపై నల్లటి ఛాయలు నిలిచి వున్నాయి. ముఖం కళావిహీనమై పాలిపోయింది. అప్పటి స్థితి చూడగానే ఆమె కళ్ళంబడి కన్నీళ్ళు కాలువలై ప్రవహించసాగాయి. అక్కడి నుండి కిటికీవద్ద కెళ్ళి కన్నీరు మున్నీరుగా విలపించసాగింది.

తనెవరో! అతనెవరో!! కాని, అతనిపై తనకు కల్గిన అభిమానం మాటలతో చెప్పనలవి కానిది. అతనికీ తనకూ ఏ జన్మ సంబంధమో- యీనాడు యీ రూపంగా ముడి పెట్టింది. లేకపోతే ఎవరో అపరిచిత వ్యక్తికోసం తనెందుకు మథన పడాలి? అతనికోసం గుండెలు పగిలేలా దేనికి ఏడ్వాలి?

పాపం! అతని బ్రతుకు నేడు గాలిలో దీపంవలె కొట్టు కుంటున్నది. ఎంత నిర్మల ప్రేమికు డతను! కాని, అతని మంచి తనం అతని కేవిధంగానూ వుపకరించలేకపోయింది. నిర్మల ప్రేమికుడైనంత మాత్రాన్నే నిజ జీవిత సౌఖ్యాలను అనుభ వించలేకపోయాడు. నిజంగా విధి అతనియెడ బహు క్రూరంగా ప్రవర్తించింది. మంచివాళ్ళకే కాబోలు కష్టపరంపరలు చుట్టుముట్టేది?

ఆ విధంగా సావిత్రి దుఃఖపడుతూ మంచంవద్ద కొచ్చి స్టూల్ మీద కూర్చుంది. అప్పటికికూడా అతను తేరుకో లేదు. ఏ మాయారోగపు కరాళ హస్తాల్లో బంధీకృతు డయ్యాడో- ఏఏ లోకాల్లో తన ప్రేయసికోసం గాలిస్తున్నాడో గాని, మూసిన కన్ను తెరవలేదు. శోక సముద్రంలో మునిగి

తేలుతున్న సావిత్రి అతని దీనస్థితికి ఏమీ చెయ్యలేక అలాగే కూర్చుండిపోయింది.

ఏ ముహూర్త బలం వల్లనో కాని రాత్రి ఎనిమిది గంటల ప్రాంతాల్లో సుధాకర్ నెమ్మదిగా కళ్ళు విప్పి సావిత్రిని చూశాడు. ఆమెను చూడగానే అతని ముఖంపై క్షణకాలం సంతృప్తి వెలిసి మాయమైంది.

"సుధాకర్ గారూ! ఎలాగుందండీ? రెండు రోజుల్లోనే యింత అన్యాయమైపోయా రేమిటండీ?" అందామె కళ్ళనీళ్లు తుడుచుకుంటూ.

ఆమె కన్నీళ్ళు చూడగానే సుధాకర్ ముఖంలో మార్పు వచ్చింది. రెండు రోజులుగా పెదవి కదపని అతను నెమ్మదిగా మాట్లాడాడు.

"నాకోసం కంటతడి బెడుతున్నావా?" అన్నాడు అస్పష్టంగా.

"మీరు ఆరోగ్యవంతు లయ్యేందుకు నేనేం చెయ్యా లండీ?" అందామె గద్గద స్వరంతో.

"ఎవ్వరూ ఏమీ చెయ్యలేని సమయం ఆసన్నమైంది సావిత్రీ! నా బ్రతుకు యీ విధంగా తెల్లవారుతుం దనుకోలేదు. నాకై పరితపించే నీలాంటి సౌజన్యవతిని చూస్తుంటే- ఏ విధంగా కృతజ్ఞత చెప్పుకోవాలో తెలియని స్థితికి దిగజారి పోతున్నాను."

"ఉద్రేక పడకండి. త్వరలో మీకు నయమౌతుంది. మామూలు ఆరోగ్యాన్ని పుంజుకోగలరు."

"నా ఆత్మ తృప్తికోసం యీ విధంగా మాట్లాడకు సావిత్రీ! నిజం నీకు తెలుసు, ఈ జీవి యిక చాలారోజులు ఈ భువిపై నిలవదని" అని అత నంటుండగానే ఆమె పెదవులపై చేతులుంచి- "దయచేసి అలా మాట్లాడకండి. తప్పకుండా మీ జీవితంలో వెలుగు ప్రసరిస్తుంది" అంది.

"హుఁ! ఈ చివరి క్షణాల్లోకూడా నాలో ఆశలు పుట్టిస్తున్నావా, సావిత్రీ! నా హృదయం మరుభూమియై చాలా వసంతాలు గడిచిపోయింది. నేనే నిర్మలమైన వెలుగు వద్దకు రెక్కలు గట్టుకొని పోబోతున్నాను."

"అలా అనకండి..." అంటూ సావిత్రి ఏదో చెప్ప బోయి, దుఃఖభారంవల్ల కంఠం రుద్ధం కాగా, ఏమీ మాట్లాడ లేకపోయింది.

"సావిత్రీ!" అన్నా డతను ఆత్రంగా.

ఆమె తలెత్తి అతని కళ్ళల్లోకి చూడసాగింది.

"కంట తడి బెట్టకు. ఏనాటి ఋణ సంబంధమో మన యిద్దరి మధ్యా యీనాడు నిలిచి తీరని ఆవేదనకు గురి చేస్తోంది. సావిత్రీ! నీ జీవితంలో ఎప్పుడైనా రాధ ఎదురైతే- చే నామెకు అన్యాయం చెయ్యలేదని చెప్పు. ఈ చివరి క్షణాల్లో యింతకన్నా ఏమీ చెప్పలేను" అంటూ అతను కళ్ళనీళ్లు పెట్టుకున్నాడు. తనలోని ఆవేదన ఆమె గమనించ కుండా వుండేందుకు ముఖం ప్రక్కకు త్రిప్పుకొని ఒత్తిగిలి పడుకున్నాడు.

సావిత్రి ఏమీ చెయ్యలేక నిస్సహాయంగా అతనివైపు

చూస్తూ– పొంగుతున్న దుఃఖాన్ని ఆపుకోలేక మంచంపై తల పెట్టి– కన్నీటి వర్షంతో కుమిలిపొయ్యింది.

ఆ తర్వాత సుధాకర్ ఏమీ మాట్లాడలేదు. అంతే గాక మూసిన కన్ను కూడా తెరవలేదు. డాక్టర్ రఘురామ్, శశికళ సైతం ఆ రాత్రంతా అక్కడే వుండి– అతని పరిస్థితికి అప్పుడప్పుడు కళ్ళనీళ్లు వదుల్తూ కూర్చున్నారు.

తెల్లవారినాకూడా సుధాకర్ కళ్లు తెరవకపోయేసరికి– రఘురామ్ ముఖం ముకుళించింది. డాక్టర్‌గా యిహ తన అవసరం తీరిపోయిం దనుకున్నా డాయన. శశికళ సైతం భగ వంతునిపై భార ముంచటం తప్ప ఏమీ చెయ్యలేకపోయింది.

## 17

సావిత్రి క్వార్టర్సుకు తిరిగి వచ్చిందే కాని ఆమె మనస్సు మనస్సులో లేదు. గుండెలపై కొన్ని మణుగుల రాళ్ళ బరువు ఎత్తినట్లుం దామెకు. ఏదో చేయా లనుకుంటుంది. కాని, ఏ పనీ చెయ్యలేకపోతోంది. ఆవేదనారాటాలతో అను క్షణం ఆమె హృదయం భగ్గున మండిపోసాగింది. కళ్లు మూసినా– తెరచినా– ఏ పనిలో లీనమైవున్నా ప్రతి క్షణం సుధాకర్ దీనావస్థే ఆమె ముందు మెదల సాగింది.

తనలోని ఆవేదనను ఎవరితోనైనా చెప్పుకుంటే కాని ఆ బరువు తొలగదనుకుందామె. కాని, తను సుధాకర్‌పై యింతగా వ్యథ చెందుతోందని తెలిస్తే తోటి నర్సులు ఏమనుకుంటారు ? ఏవేవో కల్పిత గాథలు సృష్టించి అపనింద లతో గాయపరుస్తారు. తనలోని ఆరాటాల్ని చెప్పుకునేందుకు

సమయానికి కళ్యాణి అయినా యిక్కడ లేదు. ఆమె నుండి యింతవరకు బదులు ఉత్తరం కూడా రాలేదు. ఎప్పు డొస్తుందో, ఏమో! అక్కడి పరిస్థితులు ఎలాగున్నాయో ఏమిటో!

కళ్యాణి కూడా సుధాకర్‌ను క్షుణ్ణంగా అర్థం చేసుకుంది. అందుకే అతను జీవితంపై ఎంత నిరుత్సాహంగా మాట్లాడినా - అతనిలోని మనో రోగాన్ని జయించేందుకు ప్రయత్నించేది. పాపం! సుధాకర్ పరిస్థితి యీ విధంగా వుందని తెలిస్తే ఆమె ఎంతగా బాధపడుతుందో! అయినా, తను ఆమె వెళ్ళేప్పుడు తప్పకుండా సుధాకర్ ఆరోగ్యాన్ని గురించి ఎప్పటి కప్పుడు తెలియపరుస్తానని మాట యిచ్చింది. కనుక, తను తప్పకుండా ఆమెకిక్కడ సంగతులు తెలియ పరచాలి. పాపం! చివరి క్షణాల్లోనై కళ్యాణి అతన్ని చూసే అదృష్టానికి నోచుకుందేమో!

ఆ విధంగా సావిత్రి తలపోస్తూ-వెంటనే తన లెటర్ పాడ్ తీసుకొని ఉత్తరం వ్రాయ నారంభించింది :

"కళ్యాణీ!

"నీ నుండి ఉత్తరం రాలేదు. కారణం తెలియదు. ఇప్పుడు నా ప్రక్క నువ్వు వుండి వుంటే- నే నెంత ఆవేదనకు లోనై వున్నానో తెలుసుకునేదానివి. ఇక్కడి మన పేషెంట్ సుధాకర్‌ను గురించి ఎప్పటికప్పుడు వివరంగా అన్ని విషయాలూ తెలుపుతూ వుండమని నువ్వు కోరినందున- సమగ్రంగా ఆ విషయాల నన్నింటినీ నీకు వ్రాస్తున్నాను.

"అతని బాధామయ జీవితాన్ని గురించి ఏమని వ్రాయను? తన జీవిత కథంతా సవిస్తరంగా నాతో చెప్తూవున్నాడు. అంతా విన్నాక నా హృదయ మెందుకో బరువెక్కిపోయింది. నిర్మల ప్రేమికుడైన అతని జీవితం యీ విధంగా రూపు దాల్చేందుకు కారణ మేమిటో బోధపడుతున్నా- యీ సమయంలో మన మేమీ చెయ్యలేము.

"తను ప్రేమించిన రాధాదేవికోసం కన్న తల్లిదండ్రులకు దూర మయ్యాడు. సమస్త సంపదలనూ, భోగభాగ్యాలను త్యజించాడు. ఈ విశాల విశ్వంలో ఆమె తప్ప యిహ తన కెవ్వరూ లేరనుకొని- అజ్ఞాతంలో వున్న ఆమెకోసం సంవత్సరాల తరబడిగా గాలించాడు. కాని, అతని దురదృష్టంవల్ల ఆమె యింతవరకూ కన్పించ లేదు. అందుకే, అతను మానవ మాత్రులు భరించలేనంత గొప్ప ఆవేదనను అనుభవిస్తూ- ఆమెకోసం అనుక్షణం పరితపించిపోతూ- ఒళ్లు గుల్ల చేసుకున్నాడు.

"పాపం! తన ప్రియ బాంధవిని చివరి నిముషాల్లోనైనా చూసుకోకుండా అంతరించిపోయే సమయం ఆసన్నమైందతనికి. గత రెండు దినాలనుండి రక్తం గ్రక్కుతుంటున్నాడు. ఏ కొన్ని నిముషాల్లోనో తప్ప- మన స్వాధీనంలో పూర్తిగా వుండటం లేదు. అతనికి ప్రాణదానం చేసేందుకు డాక్టర్ రఘురామ్‌గారు పడుతున్న శ్రమ అంతా యింతా కాదు. శశికళగారు కూడా రాత్రింబగళ్లు అతనివద్దనే వుండి పరిచర్యలు చేస్తున్నారు. కాని, మృత్యువు అతన్ని సమీపించినట్లుంది.

మానవ ప్రయత్నాలేవీ ఫలించటంలేదు. నీకు అవకాశం వుంటే వెంటనే బయలుదేరు. ఆఖరి ఘడియల్లోనైనా అతన్ని చూడగలవేమో!

—సావిత్రి."

ఆమె ఉత్తరం వ్రాయటం పూర్తిచేసి, తిరిగి ఓమారు చదువుకుంది. దాన్ని కవరుల్లో పెట్టి, పైన అడ్రస్ వ్రాయటం ముగించి తనే స్వయంగా పోస్ట్ చేసేందుకు బయలుదేరింది.

# 18

ఉదయం నుండి ఎడతెగక వర్షం వర్షించ సాగింది. భూ నభోంతరాలు దద్దరిల్లేలా ఉరుములు ఉరిమ సాగాయి.

కళ్యాణి పడక కుర్చీలో పడుకొని దీర్ఘంగా ఆలోచించ సాగింది. ఎన్నివిధాలుగా ఆలోచించినా ఆమెకు రాధాదేవి తత్వం అర్థం కాలేదు. ఎందువల్ల ఆమె సుధాకర్‌ను చేరు కునేందుకు యిష్టపడటం లేదో తన ఊహ కందలేదు. ప్రస్తుతపు అతని పరిస్థితి ఆమె కన్నా తనకే స్పష్టంగా తెలుసు. నిజంగా రాధ కోసమే ఆ ప్రేమికుడు పరితపించి పోతున్నాడు. మరి దేనికి రాధాదేవి అతన్ని చేరుకునేందుకు ప్రయత్నించదు?

తన ప్రార్థనను కూడా ఆమె మన్నించలేదు. సుధాకర్ విషయం తెలిసిన నాటినుండి మరింత గంభీరంగా తిరుగుతోంది. అదృష్టవశాత్తు యీ మూడు రోజులుగా బాబు తేరుకుంటు న్నాడు. చీకట్లు ముసురుకున్న ఆమె జీవితం తిరిగి వెలుగు

కోణంలోకి వెడుతున్న సమయంలో - యీామె మనస్సెందు కిలా మార్పు చెందింది?

ఆ విధంగా కళ్యాణి ఆలోచనల్లో మునిగివుండగా అక్కడికి రాధాదేవి బాబుతో సహా వచ్చింది. ఆ పిల్లవాడు తల్లి కౌగలి వీడి కళ్యాణి ఒళ్ళో వాలిపోయాడు.

"కళ్యాణీ! ఎందుకలా దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?..." అనడిగింది రాధాదేవి నెమ్మదిగా.

"నీ గురించే అక్కా!..."

"నా గురించా? పిచ్చిదానా! నాపై నీకెందు కింత అభిమానం?"

ఆ మాటతో కళ్యాణి తలెత్తి దీనంగా ఆమె కళ్లల్లోకి చూసింది.

"తెలిసీ తెలిసీ నువ్వెందు కలా ప్రవర్తిస్తున్నావో నాకు అర్థంకావటం లేదక్కా! నీ అంతరార్థమేమిటో నాకు చెప్ప కూడదా, ఏమిటి? నీకోసం అక్కడ సుధాకర్ అలమటించి పోతున్నాడని నాకు స్పష్టంగా తెలుసు? ఏ కారణం వల్ల నువ్వు అతన్ని చేరుకోవు?"

కళ్యాణి మాటలు వినగానే రాధాదేవి ముఖంలో నీలి మబ్బులు అలుముకున్నాయి.

"నా కోసం ఆరాటపడకు కళ్యాణీ! సర్వమూ త్యజించి-అన్ని ఆశలనూ అణచుకొని బ్రతుకుతున్న నేను యిలాగే నా జీవితాన్ని సమాప్తి చేసుకోవాలనుకుంటున్నాను. ఇన్నాళ్లుగా నేనే వుద్దేశ్యంతో అతన్ని చేరుకోలేదనుకుంటున్నావో - ఆ

వుద్దేశ్యంతోనే యీ నాడూ అతని వద్దకి వెళ్ళలేక పోతు న్నాను. ఇంతకన్నా ఏం చెప్పను!"

కళ్యాణికి ఆమె మాటల అర్థం బోధపడలేదు. తిరిగి ఆమెను ఏదో ప్రశ్నించాలనుకుంది కాని, అంతలో బయట పోస్టుమాన్ కేక విన్పించటంతో గభాలున లేచి బయటికి నడిచింది. అంత వర్షంలోనూ పోస్టుమాన్ యింటికి వచ్చి ఉత్తరం అందించగానే ఆమె అతనికి కృతజ్ఞత తెల్పి లోపలికి వచ్చింది. ఆ ఉత్తరాన్ని చించి చదవగానే ఆమె కళ్ళంబడి అప్రయత్నంగా కన్నీళ్ళు రాలసాగాయి. సంగతేమిటో తెలియని రాధాదేవి ఆ వింత సంఘటనకు చకితురాలై కళ్యాణి చేతి లోని వుత్తరాన్ని అందుకొని చదువుకో సాగింది.

కాని, ఆ వుత్తరాన్ని ఆమె పూర్తిగా చదవలేక పోయింది. కెవ్వున కేకవేసి కుప్పలా ఎక్కడి దక్కడే కూలి పోయింది. తన తల్లి అకస్మాత్తుగా స్మృహ తప్పి క్రిందబడి పోవటం చూసి బాబు ఆమె పైబడి గోలుగోలున రోదించ సాగాడు.

అప్పటికి కళ్యాణి తేరుకుంది. రాధాదేవి స్పృహ తప్పి పడి వుండటం చూసి గభాలున మంచినీరు తెచ్చి ఆమె ముఖంపై చిలకరించింది. తన తొడపై ఆమె తల పెట్టుకొని పైట చెరగుతో ముఖం తుడవసాగింది.

కాస్సేపటికి నెమ్మదిగా రాధాదేవి కళ్లు విప్పి చూసింది. ఎదురుగా ఏడుస్తూ నిల్చొని వున్న బాబును కావు

లించుకొని తనూ ఘోరున ఏడ్వసాగింది. కళ్యాణి కూడా ఆమె దుఃఖంలో పాలు పుచ్చుకొని తనూ కంటనీరు పెట్టుకుంది.

చాలాసేపటికి కళ్యాణి దుఃఖం నుండి తేరుకుంది. రాధాదేవి పైట చెరగు ముఖానికి కప్పుకొని అలాగే కూర్చుండి పోయింది. బాబు దీనవదనంతో ఆ యిద్దరు స్త్రీ మూర్తులను వూరకే చూస్తూ కూర్చున్నాడు.

కళ్యాణి ఆ గంభీర నిశ్శబ్దాన్ని భరించలేక పోయింది. రాధాదేవి కేసి చూస్తూ- "అక్కా!" అని రుద్ధమైన కంఠంతో పిలిచింది.

మూర్తీభవించిన శోకదేవతవలెనున్న రాధాదేవి మెల్లగా తలెత్తి కళ్యాణి కళ్ళల్లోకి చూసింది.

"ఇప్పటికైనా అర్థమైందా అక్కా! సావిత్రి ఎంత మనోవేదన అనుభవించి యీ ఉత్తరం వ్రాసిందో! ఎవరో పరాయి స్త్రీకే అతనిపై అంత గొప్ప జాలి కలిగితే - నీ హృదయం యింకా పగిలిపోకుండా ఎందుకుందక్కా! ఒక వైపు అతను చావుబ్రతుకుల్లో కొట్టుమిట్టాడుతూంటే - నువ్వెంత గాయిగుండె దానివయ్యావ్? ప్రపంచంలో నువ్వొక్కదానివేనా ఆశయాల్ని పట్టుకొని ప్రాకులాడుతుండేది. దేనికైనా సమయాసమయాలను గుర్తించాలి. నిన్ను నువ్వే ఆశయం పేరిట ఆత్మవంచన చేసుకోకు."

అంది కళ్యాణి చాలా తీక్షణంగా. రాధాదేవి హృదయంలో ఆ మాటలు తూట్లు పొడిచాయి. ఆమె కళ్ళ నీళ్లు వత్తుకుంటూ .. "క్షమించు, కళ్యాణీ! పరిస్థితి యీ రెండు

రోజుల్లో యింత విషమావస్థకు వస్తుందని వూహించలేదు. నా సర్వస్వం- నా ప్రాణం, చావు బ్రతుకుల్లో వుంటే- నేనెలా గుండె రాయి చేసుకోగలను చెప్పు? నా హృదయారాటం అంత సులభంగా నీకు అర్థం కాదు. నువ్వు వెంటనే టవున్‌కు వెళ్ళి ఓ టాక్సీ మాట్లాడి తీసుకరా. నాలుగు గంటలకల్లా మనం అక్కడికి చేరుకోగలం. నా హృదయేశ్వరుని సాన్నిధ్యంలో చివరిసారి నిశ్చింతగా కళ్లు మూస్తాను'' అందామె.

కళ్యాణి ఆ మాటలు విన్నదే తడవుగా యింకేం మాట్లాడకుండా అక్కడినుండి లేచి గబగబా బయటికి వెళ్ళి పోయింది.

ఆమె వెళ్ళిపోగానే రాధాదేవి బాబును కావులించుకొని క్షణకాలం నిశ్చలంగా కళ్ళు మూసుకుంది. ఆ సమయంలో ఆమె మాతృహృదయం పసివాడి భవిష్యత్తును గురించి ఎన్ని విధాలుగా ఆరాటపడిందో సర్వేశ్వరుడికే తెలియాలి.

# 19

అక్కడ నర్సింగ్ హోమ్‌లో సుధాకర్ రెండు దినాల నుండి మనుష్యుల స్వాధీనం లేక అచేతనంగా పడిపోయాడు. అతని మంచం ప్రక్కనే డాక్టర్ రఘురామ్ కూర్చొని క్షణక్షణానికి నాడి పరీక్ష చూస్తూ - ఏవేవో యింజెక్షన్‌లు యిస్తూనే వున్నాడు.

కాని, విధిబలీయత ముందు ఆయన మానవప్రయత్నం ఎందుకూ కొరగాకుండా పోయింది.

శశికళ స్థితి వర్ణింప నలవికానిది. ఆమె యీ రెండు రోజులూ కంటికి మంటికి ఏకధారగా శోకిస్తూ, అన్నపానీయాల ప్రసక్తే మరచిపోయి అతనివద్దే కూర్చొని వుంది. ఏ క్షణంలోనైనా కళ్లు తెరచి అతను మాట్లాడతాడేమో నని ఆశిస్తూ వచ్చింది. అయినా, ఆమె ఆశలో సైతం ఏ నూరవ భాగం కూడా ఫలించలేదు.

సావిత్రి రేయింబగళ్లు ఆ గదిలోనే కూర్చొని- అతని ఆరోగ్యంకోసం ముక్కోటి దేవతలనూ మొరబెట్టుకుంది- కాని, ఆమె ప్రార్థన ఆలకించి ఏ భగవంతుడూ అతన్ని తిరిగి మామూలు మనిషిని గావించలేదు.

సంధ్యకూడా ఆ ముగ్గురు సహృదయుల దుఃఖంతో పాటు తనూ అతనికోసం వ్యధ చెందటం తప్ప ఏమీ చెయ్యలేకపోయింది.

విషాదరూపు దాల్చిన ఆ గదిలో ఏ క్షణంలో ఏం జరుగబోతుందో ఎవ్వరికీ తెలియక గాఢంగా నిట్టూర్పులు వదుల్తూ అలాగే కూర్చుండిపోయారు.

అంతలో బయట కారాగిన చప్పుడు కాగా అప్రయత్నంగా అందరి దృష్టులూ గది బయటికి ప్రసరించాయి. శశికళ కుర్చీలోనుండి లేచి కిటికీలోగుండా బయటికి చూసింది. వెంటనే ఆమె సర్వ ప్రపంచాన్ని మరచిపోయి 'రాధా!' అని గది ప్రతిధ్వనించేలా కేక పెట్టింది.

ఆమె పెట్టిన కేక విని సావిత్రితోపాటు రఘురామ్

కూడా వులిక్కిపడ్డాడు. ఇద్దరూ గబగబా బయటికి నడిచి- ఎదురుగ్గా కారు దిగుతున్న రాధా దేవిని- కళ్యాణిని చూశారు.

ఈలోగా శశికళ సుధాకర్ చెవివద్ద నోరుపెట్టి- "రాధ వచ్చింది సుధా! నీకోసం యిన్నాళ్ళకు మనస్సు మార్చుకొని వచ్చిందయ్యా! ఒక్కసారి కళ్లు తెరువు. రాధ- రాధని అలమటించిపోయావే. ఆ నీ రాధే వచ్చింది సుధా! కళ్లు తెరచి చూడు" అంది గద్గదంగా.

అంతలో రాధా దేవి అక్కడకి పరుగెత్తుకుంటూ వచ్చింది. శల్యావశిష్టుడై మంచంలో అచేతనంగా పడివున్న తన ప్రియబాంధవుని చూడగానే ఆమెలోని శోకసముద్రం పొంగి పొర్లింది. తన కాళ్ళక్రింది భూమి రెండుగా చీలి పోతున్నట్లు అన్పించిం దామెకు. తన కళ్ళముందు దీన వదనాలతో నిల్చొనివున్న ఆప్తులు- సమస్త వస్తు సముదాయమూ గిర్రున తిరుగుతూ ఎక్కడికో పాతాళంలోకి కృంగిపోతూ వున్నట్లుగా తోచిం దామెకు.

అతని వక్షంపై తలనిడి "సుధా! సుధా! నేను వచ్చాను సుధా! ఒక్క సారి కళ్లు తెరవవూ! నాకేసి ప్రియంగా చూడవూ! ఒక్కమాట మాట్లాడవూ!" అంటూ రోదించసాగిం దామె.

గుండెలవిసే ఆమె రోదనను ఏ భగవంతుడు ఆల కించాడో కాని- నెమ్మదిగా సుధాకర్ కళ్లువిప్పి ఆమెకేసి చూశాడు. క్రమక్రమంగా అతని ముఖంలో మార్పు రావటం చూసిన- అక్కడివా రందరూ బాబును మంచం వద్దకు తీసుకవచ్చారు.

"నేనే సుధా! నీ రాధను. ఎందు కలా వెఱ్ఱిచూపులు చూస్తావ్. నువ్వలా చూడకు సుధా! నువ్వింత అన్యాయమై పోతావని ఎన్నడూ అనుకోలేదు. మన బాబు... మన బాబును చూడు సుధా!" అంటూ రాధాదేవి బాబును కావులించుకొని అతనికి అందించింది.

సుధాకర్ కనుకొలుకులనుండి రెండు అశ్రుబిందువులు రాలాయి. అతను అప్యాయంగా బాబు తల నిమిరి ఏదో చెప్పబోయాడు కాని, నోటంట మాట పెగలలేదు. నెమ్మదిగా అతను కళ్లు మూశాడు. ఇహ ఆ కళ్ళు తెరిపిల్లు పడలేదు. ఆ దృశ్యం చూసి రాధాదేవి భోరుమంది. 'సుధా!' అంటూ విలపిస్తూ అతనిపై వాలిపోయింది. అంతే! అంతటితో యిహ ఆ యిద్దరి భగ్నజీవుల తనువులూ వేరు కాలేదు. ఒకరి నొకరు చివరిసారిగా కావులించుకొని- యీ విశాల విశ్వాన్ని, సమస్తాన్ని శాశ్వతంగా వదిలి వెళ్ళిపోయారు.

ఆ సంఘటన చూసిన అక్కడి వారంతా ఘొల్లున రోదించారు. జరిగిం దేమిటో తెలియని ఆ పసిబాలుడు కళ్యాణివద్ద కెళ్ళి- 'అమ్మా!' అంటూ ఏడ్వసాగాడు.

కళ్యాణి హృదయం బాబును చూడగానే బ్రద్దలైంది. ఆ బాలుడ్ని అమాంతం కావులించుకొని "ఇంకెక్కడి అమ్మ తండ్రీ! ఆమె నిన్నూ, నన్నూ అందర్నీ శాశ్వతంగా వదిలిపెట్టి మీ నాన్నతోకూడా మరో చోటికి వెళ్ళిపోయింది. ఏడవ కమ్మా, నే నున్నాగా!" అంటూనే సముదాయించసాగింది.

కాని, ఆ బాలునికి ఆమె సమాధానం రుచించలేదు.
'అమ్మా! అమ్మా!' అంటూ ఏడ్వసాగాడు.

సావిత్రి అచేతనురాలై కిటికీ వూచలను పట్టుకొని బయటికి చూడసాగింది.

# 20

ఆకాశం అరుణవర్ణం దాల్చింది. అరుణబింబం క్షణక్షణానికి అంతరిక్షం నుండి క్రిందకి వాలిపోతోంది.

నర్సింగ్ హోమ్‌కు కుడివైపున వున్న పెద్ద మైదానంలో గంధం చెక్కలతో చితి పేర్చారు.

సావిత్రి చివరి సారిగా ఆ భగ్నప్రేమికుల పాదాలకు నమస్కరించింది. పొంగి వస్తున్న దుఃఖాన్ని ఆపుకునేందుకు శత విధాలా ప్రయత్నిస్తూ అక్కడి నుండి ప్రక్కకు వచ్చింది.

వెంటనే ఆ చితిపై రెండు శవాలను చేర్చారు. కొన్ని క్షణాల్లో అగ్ని జ్వాలలు మిన్నుముట్టాయి.

కళ్యాణి ఆ దృశ్యం చూడలేక చీరె చెరగుతో ముఖం కప్పుకుంది. శశికళ కళ్ళల్లో నీళ్లు ఆవిరి అయ్యాయి. రఘురామ్ అశ్రునయనాలతో - మండిపోతున్న చితి కేసి చూస్తూ - పగిలి పోతున్న తన గుండెల్ని చిక్కబట్టుకో సాగాడు.

చూస్తూ చూస్తూండగానే చుట్టూ చీకట్లు ఆక్ర మించాయి. చితి పూర్తిగా మండి బూడిద కాసాగింది.

చాలాసేపటికి కళ్యాణి దుఃఖంనుండి తేరుకుంది. బాబును తన గుండెలకేసి హత్తుకుని-"భగవాన్! ఈ భగ్న ప్రేమైక జీవుల జీవితం ఇంతటితో పరిసమాప్తి నొందింది. ఈ దుఃఖ

భ[illegible]వరకైనా ఏకం కాగల్గారు. కాని, వీళ్లు ఏ పాపం చేశారని యింత గొప్ప శిక్ష విధించావ్? ప్రేమించ టమే నేరంగా పరిణమింపచేసి– వీళ్ళ కీ దుర్భర శాపాన్ని దేనికి ప్రసాదించావ్? హే భగవాన్! జీవితమే ఒక స్వప్నంగా యీ ఉభయుల జీవితమూ అంతరించిపోయింది. వీళ్ళ ఆశలూ, ఆశయాలూ, తనువులూ చివరకు చితిపాలై బూడిదగా మారి పోయాయి. బ్రతుకు భారంగా ఆమరణాంతంవరకూ కళ్ళనీళ్ళతో కృంగి కృశించిపొమ్మని వీరియెడ ఎందుకు వ్రాశావో నాకు సమాధానం కావాలి! ఈ చరాచర ప్రపంచంలో నిజమైన ప్రేమ ఎందుకు వంచించబడుతోందో నాకు తెలియచెప్పాలి!!” అంటూ ఉద్రేకంతో తనలోని దైవాన్ని ప్రశ్నించుకుం దామె.

కాని, ఆమె ప్రశ్నలు ప్రశ్నల రూపంలో వుండగానే దూరం నుండి ఓ విషాద గీతం విన్పించింది :

శోకాంబుధిలో మునిగి పోకమ్మా!
మానవ జీవిత మింతేనమ్మా!!
కుళ్ళిపోయినది మానవ జాతి
క్రూరహింసకు లోనైనాది
కులమత భేదము విస్మరించని
మానవులే దానవులై
మోసము చేసిరి యీ జీవితాలనే...
శోకాంబుధిలో మునిగి పోకమ్మా!
మానవ జీవిత మింతేనమ్మా!!

—ఓం శాంతి, శాంతి, శాంతిః—

# ఉజ్వల ప్రచురణలు

| | | |
|---|---|---|
| ప్రాణేశ్వరి | (డి. మనోహర్) | 4-00 |
| వాసంతి | ,, | 3-00 |
| కోరుకున్న వరం | ,, | 2-00 |
| అందాల శిఖరాలు | ,, | 2-00 |
| మూను పువ్వులు | ,, | 2-00 |
| చరితార్థులు | (యం. యస్. ఆచార్య) | [illegible]-0[illegible] |
| సమరసుందరి | ,, | [illegible]-0[illegible] |
| జీవిత స్వప్నం | (అడవేని ఈశ్వర) | 3-00 |

JEEVITHA SWAPNAM
by
Adaveni Eswara

Price
Rs. 3/-

